# జీవితం

రచన :

ఎ్ట ట్రూబ్లడ్

అనువాదం :

ఎన్. ఆర్. చందూర్



ప్రతిభా బుక్స్

49 మూకత్తాల్ వీధి

మద్రా

# విషయాలు



* ఈ గ్రంథంలో 'మన' అని రచయిత వాడుతున్నప్పుడు, అమెరికనుల గురించి అని అర్థం

# ముందు మాట

అందరికీ హితవుకాని విషయాలు ముచ్చటించే పుస్తకాలలో యిది ఒకటి. మానవాళి మధ్య జరుగుతున్న అనిర్వచనీయఘర్షణలో ఏర్పడ్డ రెండవ మూడవ కాల్పనిక శాంతిదశల గురించిన ప్రస్తావన యిది. జనబాహుళ్యపు మనోభావాలని అర్థం చేసుకోగల 'వ్యక్తి విజయం' జీవన ధర్మంగా పరిగణింపబడుతోంది; ఎవరికి వారు సుఖాలని సమకూర్చుకోగలగడమే తమ మతంగా భావిస్తున్నారు. ఇలాటి సంగతులు తర్కించే పుస్తకాలు యిప్పటికి అనేకం వచ్చాయి. కాని, నానాటికి మనం క్లిష్ట పరిస్థితులలోకి జారబడుతున్నాము కాబట్టి, నేను చేసిన ఈ సరికొత్త ప్రయత్నం కొందరికి రుచించవచ్చు.

భవిష్యత్ ఏమి కానుందో ఎవరం చెప్పలేము; కాని, ఆలోచనాపరుడైన ప్రతి వ్యక్తీ మన జీవితశేషం అశాంతియుత పరిస్థితులలో గడవక తప్పదని భావిస్తున్నాడు. రానున్న సంవత్సరాలలో చరిత్రగతి ఏ విధంగా మారినప్పటికీ అది ప్రశాంతతవైపుకి మాత్రం కానేరదు. మన ఈ నవ్య ప్రపంచం ద్వేష భావాన్ని విపరీతంగా పెంచుకుంది. భయోత్పాతంతో, ప్రచ్ఛన్న ప్రత్యక్ష యుద్ధాలతో ప్రజలు శాంత జీవనానికి దూరమయారు. ప్రస్తుతం వున్న కలతలు ఏదోవిధంగా

పరిష్కరింపబడినప్పటికీ, అసలు కలతలనేవే లేకుండా పోవు; అవి మరికొంచెం ఉద్ధృత రూపం దాలుస్తాయేమో కూడా!

మనమిప్పుడు వర్షాకాలంలో ఉన్నాం; ఆ సంగతి విస్మరించి ప్రయోజనం లేదు. ఈ వర్షంలేక, పొడిగా వున్న దినాలని తలుచుకు వాపోవడంకంటె, - 'ఈ కుంభ వృష్టిలో మనము వున్నాం; యిప్పుడేం చెయ్యాలి?' - అని వాస్తవ దృష్టితో చూడటమే వివేక మనిపించుకుంటుంది. తుపాను అనేది మనందరికీ ఒకటే; కాని, తుపానునుంచి మననిమనం సంరక్షించుకోవడంలో, అందరమూ ఒకే పంథా అనుసరించము. తుపానుని మనం అరికట్టలేముగాని, దానిని ఎదుర్కొని మనని కాపాడుకోగల శక్తి, మనలో ఉంది.

రాజకీయాలకీ ఆర్థిక మనస్తత్వశాఖలకీ అతీతమైన ప్రధాన విషయాలు ఆలోచనాపరులని ఆకర్షిస్తున్నాయి. ఉన్నవి వున్నట్టు చూడటంకంటె, అవి ఏవిధంగా వుండాలో చెప్పగలగాలి. మానవుని 'అవసరాల' గురించిన పట్టీ పదేపదే వింటున్నాము గాని అవి ఎంతవరకూ సబబూసాధ్యం అనే యోచన తక్కువవుతోంది. ఏమైనా కష్టాలవల్ల పరిస్థితులు కొంచెం మెరుగు అవుతున్నాయి. కష్ట సమయంలో మనుషులు సద్భావపూరితులవడం సహజం. నేటి

ప్రపంచంలో చాలామందికి నైతిక ధర్మం గురించి తెలియదు; ఋజువర్తనకీ నేర్పుకీ సహస్రాంతం తేడా ఉందంటారు నైతిక వాదులు.

మనని నిలబెట్టి ప్రశ్నించే కఠినతరసత్యాలు, కొంతలోకొంత అవగాహన చేసుకున్నవారిని ఉద్దేశిస్తూ, ఈ పుస్తకం రచించాను. నా జీవితకాలపు పతన, యోచన యిందులో కరుడుకట్టి ఉన్నాయి. పరిస్థితులు ప్రకాశవంతముగా ఉన్నా, అంధకారమయంగా ఉన్నా, ఏ ప్రధాన లక్ష్యం పట్టుగొమ్మగా మానవుడు జీవించాలో, నాకు తోచినంతలో చెప్పేందుకు ప్రయత్నించాను. ఏది వెలుగో తెలుసుకొనేందుకు అందరమూ యేకమవాలి. కమ్యూనిజమ్‌ని ఆడిపోసుకు లాభం లేదు - అంతకంటె వుత్తమమైన మార్గం చూపగలగాలి. అటువంటి మార్గానొకదాన్ని చూపేందుకు చేసే ప్రయత్నమే ఈ పుస్తకం. పాశ్చాత్య ప్రపంచపు హృదయ నాళాలనుంచి దీని జీవ రక్తం సేకరింపబడింది. ప్రజాస్వామ్యమసగా మేధావంతుల కూటమి - అందరికోసం వుమ్మడిగా ఆలోచించే డిక్టేటర్ వుండదక్కడ.

రాజకీయపద జాలాన్ని సాధ్యమైనంత వరకూ తప్పించేందుకు ప్రయత్నించాడు ఈ రచయిత. ఎంత గొప్ప విషయమైనా, సామాన్యులకి అర్థమయే భాషలో చెప్పినప్పుడే అది రాణిస్తుంది.

కొన్ని శతాబ్దులుగా ఎందరో మేధావులు ఆలోచించి పెట్టిన విజ్ఞానభాండాగారాన్ని యిష్టమొచ్చినట్టు వాడుతున్నాను – అంచేత ఈ పుస్తకంలోని భావాలు పూర్తిగా నా స్వంతం కాదు. నుడీ నానుడీ చాలా వుంది యిందులో. 'ది న్యూయార్కర్' పత్రికలో ఒక విమర్శకుడు అన్నాడు: "మానవుడు సామెతలని ఆధారంగా చేసుకుముందుకి సాగుతాడు. ఒక రకంగా మన సామెతలే మన వివేకం." మానవజాతిలోని వివేక ధర్మమూ విజ్ఞానతృష్ణా అతి పురాతనమైనవి; కాని పాశ్చాత్య ప్రపంచంలో ఈనాడు వుద్భవించిన ఒక తరంవారికి పొయిట్రీ అంటే తెలియదు; ఫిలాసఫీకి వర్ణక్రమం ఎరగరు; ఇక వారు బైబిల్ వినిన పాపాన పోలేదు. ఈ తరంవారికి పూర్వీకుల విజ్ఞానమంతా పేలవంగాను అర్ధరహితంగాను కనిపిస్తుంది. వెనకటి భావ సంప్రదాయం వీరి ఆలోచనలకి ఉపకరించడం లేదు.

ఈ గ్రంథాన్ని ఒక పురాతన భవనంలో కూచుని రాయగలగడం నా అదృష్టమనే చెప్పాలి. ఛార్నీ మేనర్ ఇంగ్లండులోని అతి పురాతన భవంతులలో ఒకటి. ఈ భవంతి నా ఆలోచనలకి ఒక విధంగా జీవం పోసింది. శిరసు పైకి ఎత్తేటప్పటికి ఏడు వందల సంవత్సరాలక్రితంవి అయిన కర్ర దూలాలు యేదో సందేశం చెప్పేవి. ఈనాడు మనం మన కాలానికి పనికొచ్చే వివేక విజ్ఞానాలకోసం యాతన

పడుతున్నాము; యేడు వందల యేళ్లక్రితం ఈ దూలాల క్రింద కూచున్నవారుకూడా మనమాదిరే, తమ సమస్యా పరిష్కారాలకోసం యాతనపడి వుంటారు. ఈ కర్ర దూలాలు యేడు శతాబ్దులబట్టీ ఈ కట్టడాన్ని నిలబెట్టగలిగాయి; మన పునాది రాళ్లు సరిగా వుండి, కలప మన్నికైనదైన పక్షంలో మన కట్టడమూ నిలబడుతుంది.

— రచయిత



# 1

# నేటి ప్రపంచం

పరిశీలనా దృష్టిలేని బ్రతుకు బ్రతుకే కాదు.

— సోక్రటీస్

మనంపుట్టి బుద్ధి ఎరిగాక, మనం ఎరగనంతగా ప్రపంచ మీ నాడు కుదిపివేయబడుతోంది. మిలిటరీ పరాజయాలకంటె, మిలిటరీ ప్రమాదాలకంటె మననీనాడు ఎదుర్కొంటున్నది 'ఆత్మవిశ్వాసరాహిత్యం.' ఒకనాడు ఒకటిగా కనిపించిన ప్రపంచం, ఈనాడు మన కళ్లముందే, ముక్కముక్కలవు తోంది. ఇటువంటి విపత్కర పరిస్థితితో పోల్చిచూస్తే, రెండు ప్రపంచ యుద్ధాలవల్ల కలిగిన నష్టం ఏపాటిది?

మన రాజకీయశక్తి మాట అటుంచి, నైతికంగా చాలా దెబ్బతిన్నాం. వెనకటి రోజులలో ఎటువంటి అపాయంలోకి అయినా, ఏదో రసపుత్ర వీరులమాదిరి, అన్యాయాన్ని అరి కట్టేందుకు ముందుకి దూకేవారం. పశుశక్తి నెదిరించి, బల వంతుడికిగాక న్యాయవంతుడికి పట్టాభిషేకం చేయ బూనాము. 1940 జూన్ 4 వ తేదీన కామన్సుసభలో విన్‌స్టన్ చర్చిల్ 'నూతన ప్రపంచ జననం' గురించి చెప్పిన పలు కులు జ్ఞాపకముంచుకోదగ్గవి:

"మేము ఎప్పటికీ లోబడము - ఎన్నటికీ లోబడము. అంతపనీ జరగదుగాని ఒకవేళ ఈద్వీపమే శత్రుపశమైనచో, యిక్కడివారు ఆకలితో అలమటించి లోబడవలసివచ్చినప్ప టికీ, సముద్రాలకు అవలనున్న సామ్రాజ్యంనుంచి, బ్రిటిష్ నౌకాబలంవల్ల సంరక్షింపబడుతున్న సామ్రాజ్యంనుంచి మా పోరాటాన్ని, భగవదేచ్ఛ ప్రకారం నూతన ప్రపంచం జనించి పాతదానికి విమోచన కలిగించేదాకా, సాగిస్తూనేవుంటాము-

మా పోరాటాన్ని సాగిస్తూనే వుంటాము. శత్రువుకి ఎంత మాత్రం లోబడము."

చర్చిల్ ఉదహరించిన నూతనప్రపంచానికి చెందిన మనుష్యులం మనము. ప్రపంచంలోని వివిధ భాగాలలో జరిగిన పొరబాట్లని సరిదిద్దవలసిన భారం మనమీద వుంది. ఎవరూ అనుకోని విధంగా మార్షల్ ప్లానుద్వారా ఎన్నోదేశాలకి సాయపడ్డాము. ఈ శతాబ్దిలో రెండుసార్లు ఐరోపా సంగ్రామంలో ప్రవేశించి, నవచరిత్ర గతిమార్చాము. జపానుతో పెట్టుకున్న పోరాటంవల్ల మనకి కలిగిన నష్టం యింతా అంతా కాదు. ఎన్నోదేశాలలోని ప్రజలు మన ఓడలకోసమూ మన ఆహార దినుసులకోసమూ కళ్ళు కాయలు కాచేటట్టు ఎదురుచూశారు.

ఇలావుండగా ఒక విప్లవాత్మక పరిణామం ఏర్పడింది. కనీవినీ ఎరగని విధంగా మన నైతిక గౌరవం దిగనాశిల్ల జొచ్చింది. ఉపద్రవంనుంచి రక్షించేందుకు మనం రావాలని కోరుకున్నవారికే, మనం ఉపద్రవకారులమనే అభిప్రాయం ఏర్పడసాగింది. 1950 లో అనధికారవర్గాలవారు తీవ్రంగా ఆలోచించినది కొరియా సమస్య, రష్యా సమస్య, చైనా సమస్య యిలాటివి కానేకాదు - అమెరికా సమస్య. అపరిమిత వేగంతో వచ్చిన పరిణామ ప్రకారం మన మనోభావాలు మారలేకపోయాయి. అంతవరకూ హితులమైనవారికి మనం విరోధులుగా తోచాము. ఇనపతెర వెనకనున్నవారికి మనం విరోధులుగా తోస్తే, బాధపడవలసిన పనిలేదు; అది వారి పాలనా విధానంలోని పద్ధతి అని సరిపెట్టుకోవచ్చు. కాని భూమధ్యరేఖకి ఉత్తర దక్షిణాలుగావున్న మన మిత్రుల

దృష్టిలోకూడా మనం పడిపోయాం. ఇప్పటికీ ఐక్యరాజ్య సమితిలో చాలాదేశాలు మన తరఫున వోటు చెయ్యవచ్చు; కాని మనపరపతి దెబ్బతిన్నదని వొప్పుకోకపోతే, పిల్లి కళ్ళు మూసుకు పాలుతాగుతున్నట్టవుతుంది.

ఇటువంటి సమయంలో, మన నాయకులు క్రమనిర్ణయాలు చేయడంలేదని, విరుచుకుపడటం మొదలుపెట్టాము. మన అవస్థ ఎలా తయారైదంటే, మన పుణ్యకాలం కాస్తా యితరుల సమస్యలు పరిశీలించేందుకు వినియోగపడ సాగింది. ఈ చదరంగపు ఆటలో వేసే ప్రతిఎత్తూ మన ప్రాణానికి చుట్టుకునేదే! పాతకాలపు యుద్ధం నిష్ప్రయోజన మని రష్యను నాయకులు ఏనాడో గ్రహించారు. వారికటువంటిది అక్ఖర్లేదు. శాంతి లక్ష్యాలు ప్రకటిస్తూ పాశ్చాత్య ప్రజని యిరకాటంలో పెట్టడమే వారికి లాభదాయకం. కొన్ని దేశాలని యిరుకున వుంచడమనేది, వారి రాజకీయపు ఎత్తుఅలో ఒకటి.

అజేయమని భావిస్తూవచ్చిన మన యుద్ధశక్తి విషయంలో కూడా, ఆశ్చర్యకర పరిణామాలు కనిపించాయి. మనం యింతకాలంగా అనుకున్నంతటి అజేయమైనది కాదది. యంత్రబలాన్ని మాత్రమే నమ్ముకున్న దేశాలన్నిటికీ కొరియా యుద్ధ మొక గుణపాఠం. మతోన్మాదాన్నిపోలిన మొండి ధైర్యంతో, తెరలుతెరలుగా రణరంగంలోకి దూకే ప్రజావాహినుల్ని, యంత్రాలు కొంతదాకానే ఆపగలవు. చైనావారి కమ్యూనిస్టు సిపాయిలు, కెరటాలు కెరటాలుగా మీదపడటంతో, యంత్రశక్తికికూడా ఒకపరిమితమంటూ ఏర్పడింది.

మహావేశంతో ముందుకిసాగే ఆ సైనిక పంక్తుల ముందు వైమానిక బలంకూడా నిరుపయోగమైపోయింది. బాంబులూ విమానాలూ వాటి ఆధిక్యతతో యుద్ధవిజయం చేకూర్చగల వని యిన్నాళ్లుగా అనుకుంటూవచ్చాము. మతోద్ధారణకిగాను కంకణం కట్టుకున్న ప్రజలముందు యంత్రాల ప్రతాపం కొంతదాకానే పనిచేస్తుంది. ఎటొచ్చీ, అవతలివారు మన మీద అంత కత్తికట్టారా - అని నమ్మలేకుండా వున్నాము.

మబ్బులు నెమ్మది నెమ్మదిగా విడిపోతున్నాయి. ఒకా నొక నైతికసూత్రం వారిని ఆవిధంగా ఉత్తేజపరుస్తున్నదని మనం తెలుసుకోవలసి వస్తోంది. ఆసియావాసుల వైమనస్యం నిర్హేతుకమూ అసందర్భమూ అయినదికాదు; వారి ఆగ్రహానికి తగు కారణాలు లేకపోలేదు. 'తెల్లవారు' వెనక చల్లిన విత్తనాల ఫలం, మనమీనాడు అనుభవిస్తున్నాము; తామేదో అధికుల మనుకుంటూ శ్వేతజాతీయులు ప్రాచ్యఖండవాసుల మీద జరిపిన అత్యాచారాలన్నిటి ఫలితమూ మనమీనాడు అనుభవిస్తున్నాము. 'బాయ్' అని చైనీయుణ్ణి పిలిచిన ప్రతి తెల్లవాడూ మానవతకి మచ్చనాపాదించాడు. వాళ్లందరి పాప ఫలమూ మన నెత్తికి చుట్టుకుంది. ఆసియావాసులు మన మీద ఈవిధంగా విరుచుకుపడటం సబబుకాదనుకోండి - కాని ఏంచేస్తాం? సిద్ధాంతరీత్యా కొరియా విషయంలో మనం కల్పించుకోవడం న్యాయసమ్మతమే! కాని కల్పించుకుని వూరుకున్నామా? మన ఆధిక్యత గురించి బడాయి చెప్పుకో కుండా వుండలేకపోయాము. అమెరికా ప్రభుత్వం దక్షిణ కొరియా విషయంలో 1938 నాటి జెకోస్లోవేకియాకివలె జరక్కుండా చూసింది. 1950, 1951లో జరిగిన మనపొరబాట్లకి

గాక, పాశ్చాత్యుడు ప్రాచ్యఖండ ప్రజాకోటికి చేసిన తప్పిదా లన్నిటికీ సంజాయిషీ చెప్పుకోవలసి వస్తున్నది.

ఇవేవో చిన్నవిషయాలు, అంత పట్టించుకోవలసినవికావు. అని భుజాలెగరేసి, తక్షణ సమస్యని విస్మరించబోతాము. అదే మనంచేసే తప్పులెక్క. మనకి మిలిటరీశక్తి ఎంత వుందో ఏమోగాని, నైతికబలం మాత్రం లోపిస్తోంది. మహా నాయకులు యుద్ధబలగాన్ని మాత్రం త్రాసులోవేసి తూచి ఎవరిది ఎక్కువశక్తో తేలుస్తారు; ఒక్క అధిభౌతికమైనవాటి తోటే శక్తి అనేది లభించదు; ఆ అధిభౌతికమైన దానిని చైతన్యవంతంగా చేయగలది మరొకటి ఉండాలి.

ఏ శాంతికోసమైతే మనమందరం కష్టపడి అనేకత్యాగాలు చేశామో, ఆ శాంతి మనకంటి కగపడటంలేదు. ఈ శతాబ్దిలో జరిగిన మొదటి ప్రపంచ యుద్ధంవల్లగాని, రెండవ ప్రపంచ యుద్ధంవల్లగాని సాధించిన ఘనకార్యమేమీలేదు అని వొప్పుకో వలసి వస్తోంది. చరిత్ర మహావేగంగా పరువులెత్తుతోంది. ఈ రెండు దారుణ సంగ్రామాలమధ్య, మానవజాతికి ఒక ఇరవై సంవత్సరాల తాత్కాలిక శాంతి లభించింది. రెండవప్రపంచ యుద్ధం పూర్తిఅయి, అయిదేళ్ళు గడిచింది. 1940 లో మాజినోలైను పడిపోవడంతో ఫ్రాన్సు ఏమయిందో, అటువంటి మనస్థితితో ఉంది నేటి పాశ్చాత్య ప్రపంచం - ఈ అయిదేళ్లు గడిచేటప్పటికే! చారిత్రక శక్తులు అంత త్వర త్వరగా ప్రయాణం చేస్తున్నాయి. రక్షణ స్థలాలంటూ ఎక్కడాలేవు. వివేకవంతులైన వ్యక్తులు, ఘనంగా భావించే విలువల్ని, తారుమారుచేయగల స్థితిలో ఉంది ప్రపంచం యావత్తూ.

సమ్మెటపోటులవంటి ఈ దెబ్బలకి మనుషులు తట్టుకోలే కుండా ఉన్నారు. ఇంత ఆదుర్దా, యింత భయమూ మనం ఎప్పుడూ ఎరగము. మనం చేయవలసినవాటి గురించేగాక, నమ్మవలసినవాటి గురించి కూడా, పరితాపానికి లోనవు తున్నాము. అనుక్షణమూ మారిపోతున్న ప్రపంచగమనంలో ఏది స్థిరం? అణువిధ్వంసన బెదిరింపేగాక నిజమైనప్పుడు, త్రాసు ఎటు మొగ్గుతుంది - ఎలా తూగుతుంది? అన్నీ జల జల రాలిపోయే పక్షంలో, స్థిరమైనదేమిటి? మన పిల్లలు మనకి కాకుండా యుద్ధభూమిలో బొమ్మలయితే ఏం దారి? అంతేనా - మారణహోమానికేనా మనుషులు? మిగతా సమ స్యల జోలికి పోయేముందు, ఈ ముఖ్యప్రశ్నలకి సమాధాన మేమిటో ఆలోచించాలి.

మిలిటరీ రంగంలోనూ రాజకియ పరంగానూ మన వ్యూహాలు విఫలమైనప్పటికీ, భావనా జగత్తులో మనదే యింకా పైచెయ్యి. స్టాలిన్ తత్వం పూరాగా భౌతికవాదం. ఈ భౌతికవాదాన్ని ఒక చక్కటి ఆదర్శవాదంగా ఆసియా వాసులకి కనిపింపజేస్తున్నారు కొందరు; అంతేగాకుండా, మన అమెరికనులది శుష్కభౌతికవాదమన్నట్టుగా ప్రదర్శిస్తు న్నారు. మన పూర్వీకులు సాధించిన కొన్ని ఆర్థిక ప్రయోజ నాలని - ససేమిరా వొదలం - అని మనం అంటున్నట్టుగా చిత్రిస్తున్నారు. పైకి చెప్పో చెప్పకో, యిటువంటి రూపకల్ప నకి మనమే చేతులారా అవకాశం యిచ్చాం; ఎంతకాదన్నా యిది స్వయంకృతాపరాధం.

పాశ్చాత్య లోకంలోని మానవ జీవితలక్ష్యం సుఖసంపదలు కాదనీ, మానవ హృదయంలోని విప్లవ జ్యోతి నిరంతరం

ప్రకాశించేటట్టు వుంచగలగడమనీ, మనలో ఎందరికితెలుసు? ఎందరు ఈ విషయమై ఆలోచించారు? ఈ లక్ష్యాన్ని మానవ జాతి రెండువేల సంవత్సరాలబట్టీ కాపాడుకుంటూ వస్తోంది. వెనకటి మెసపటోమియా సామ్రాజ్యాలలో భౌతికవాదమే ప్రబలంగా ఉండేది. సోవియట్లు అదర్శవాదం గురించి మాట్లాడటం, వారి ప్రచార సాధనలో ఒకభాగం. మనము మన ధనాన్నీ శక్తినీ వెర్రిగా వెచ్చిస్తూ, భూసంస్కరణలు విమోచనా విధానం మొదలైనవి ప్రవేశబెట్టలేని జడులమాదిరి లోకం దృష్టికి కనపడ్డాము; ఏవిధమైన స్వప్నాలూ లేక, కొంచెం హెచ్చుస్థాయిలోవున్న మన భౌతికావసరాలు నిల బెట్టుకునేందుకు తాపత్రయపడుతున్న మనుషుల్లా కన పడ్డాము.

ఆఖరికి అమెరికా దేశంలోకూడా "అటువైపునవున్నవారి" సంఖ్య దిట్టంగానే ఉంది. తాము "అటువైపున" ఎంత మాత్రంలేమని గొంతుచించుకు చెబుతారువారు; కాని అంత ర్యంలోవారు గతతార్కిక భౌతికవాదులు. రష్యాదేశం 'గత తార్కిక భౌతికవాదం' (డయలెక్టికల్ మెటీరియలిజమ్) ఒక్కదాన్నే, నిజమైన 'ఫిలాసఫీ'గా నమ్ముతుంది. సోవి యట్ పాలనకిందనున్న విశ్వవిద్యాలయాలలో ఆ ఒక్క 'ఫిలాసఫీ'యే చెప్పడానికి వీలు. మన జీవన విధానంలాటిది, చితికిచితికి, జీర్ణించక తప్పదని సోవియట్ మేధావులు తల పోస్తారు; అది శాస్త్రసమ్మతమగు పరిణామమని వారు అంటారు. 'క్రెమ్లిన్' లోని వ్యక్తులేగాక, మనమధ్య నున్న మనుషులు కూడా, చరిత్ర గతిని ఆర్థిక శక్తులే నిర్ణయిస్తు

న్నాయనే విశ్వాసంలోకి వచ్చారు. ఆర్థికశక్తుల ప్రభావం కాదనలేముగాని మానవ పురోగమనానికి అవే మూలశక్తు లంటే కష్టం; భావనఅనే మరొక బ్రహ్మాండమైన శక్తి ఉంది.

మార్క్సిస్ట్ దృక్పథంలో 'డ్యూటీ' అనేది పోటిమాట; నైతికబంధాలు, నైతిక నిర్ణయాలు అర్థరహితములు. లోక పరంగావుండే నైతిక ధర్మాన్ని మార్క్సిస్టులు ఆమోదిం చరు. ప్రతిపనీ భౌతికదృష్టితో చేసినప్పుడు నైతిక భావానికి చోటులేదనుకోండి! ఇక్కడ ఈదేశంలోకూడా మార్క్సిస్టుల వలె తలపోసేవారు చాలామంది లేకపోలేదు. ఒకవిధంగా ఆలోచిస్తే ప్రపంచమీనాడు రెండు చెక్కలుగా చీలివుంది. ప్రధానలక్ష్యం ఒకటైనప్పుడుకదా, ఈ రెండు చెక్కలూ ఏక ఖండమై, ఒకేప్రపంచం ఉద్భవించడం. ప్రధాన లక్ష్యాలు ఒకేమాదిరివి అయినప్పుడే, ఏకప్రపంచం ఏర్పడుతుంది.

అన్నిచోట్లా మనం ఒకటోరకమైన సేల్స్‌మెన్‌గా ఖ్యాతి నొందాము. దురదృష్టమేమిటంటే, మనం మంచి సరుకు అమ్మలేకపోతున్నాము. మనం తయారుచేస్తున్న రిఫ్రీజిరేటర్ల గురించీ, మోటారుకార్లగురించీ, విమానాల గురించీమాత్రమే లోకానికి తెలుసు. ఆ యాంత్రిక శక్తి గురించే మనం గొప్పలు చెప్పుకుంటూ వచ్చాం. వస్తువులకి స్వతహాగా శక్తి ఉండదు; ఆ శక్తి మానవ హృదయంలోనుంచి వస్తుంది. మనము యంత్రాలు చేయగలం; ఇతరులూ చేయగలరు - చేస్తున్నారుకూడా. ఎక్కువ ఆయుధాలవల్లా, ఎక్కువ ధన బలంవల్లా, ఎక్కువ సాంకేతిక సంపదలవల్ల మననెవరూ ఓడించబోరు. ఒక జీవన ధర్మంమీద నమ్మకంవుంచి, అను

భవ జ్ఞానంవల్ల కలిగిన ఆత్మవిశ్వాసంతో ఉత్తమసమాజాన్ని నిర్మించుకో గలిగితే తప్ప, యింటా బయటా వున్న శత్రువుల తాకిడినుంచి మనని మనం రక్షించుకోలేము. మన జీవన ధర్మం ఏమిటో పదిమందికీ విడమరిచి చెప్పాలి - మన సరుకు అదే.

వాస్తవిక దృష్టితో మన పరిమితులేమిటో యిప్పుడిప్పుడే తెలుసుకోగలుగుతున్నాము; కాని కేంద్ర సమస్యని పరిపూర్ణంగా గ్రహించలేకుండా వున్నాము. స్వయం రక్షణకి బాంబులు ప్రధానమనే దురభిప్రాయం మననింకా వొదలడం లేదు; బాంబులకంటె అత్యవసరమైనది ఆత్మవిశ్వాసం. పరిస్థితులు పరిశీలించినమీదట, దీని ఆవశ్యకత సహేతుకంగా బోధపడుతుంది. ఇప్పట్లో మూడే అవకాశాలు కనిపిస్తున్నాయి : సోవియట్ విజయం, పాశ్చాత్య విజయం, దుర్భర ప్రతిష్టంభన. మొదటిదీ మూడవదీ మనకి బాధావహమైనవి. సోవియట్ విజయం మన నాగరికతని నేలమట్టం చేయగలుగుతుంది; ప్రతిష్టంభన మన నాగరికతలోని ఉదాత్తమైనవాటిని హరించి, మనుషులందరూ ద్వేషంలో దారిద్ర్యంలో బతికేటట్టు చేస్తుంది.

మూడు అవకాశాలలోనూ రెండవదానినే మనం వాంఛించడం సహజం. పాశ్చాత్య విజయంవల్ల మానవాళికి మేలు కలుగుతుంది. కాని, ఎలాకలుగుతుంది, ఏవిధంగా కలుగుతుంది అనే ప్రశ్నలు లేకపోలేదు. పాశ్చాత్య విజయ సాధన కోసం మనం నియంతృత్వాన్ని వరిస్తే, అందువల్ల ప్రయోజనం ఉండదు. ఒక ఉదాత్త లక్ష్యం కోసమని ప్రచారం

చేస్తూ, మనుషులు స్వల్పబుద్ధులు అయినప్పుడు, ఆ లక్ష్యం నీరసించక తప్పదు - విజయంకూడా సంశయమే. పురాతన గ్రీకుదేశంలో ఈమాదిరి చారిత్రక సంఘటనలనేకం జరిగాయి. ఒకపద్ధతిని వోడించేందుకు మనం ఆ పద్ధతిని అలవరుచుకు లాభంలేదు. ఆ కొత్తపద్ధతి మన జీవనాళాలలోకి పోయి మననే ఓడించడం తథ్యం. చరిత్రనిండా యిటువంటి సందర్భాలు అనేకం ఉన్నాయి.

పాశ్చాత్యలోకం ప్రసాదించిన జీవన విధానంపట్ల మనకి విశ్వాసం వుండి, అందులోని నైతిక ధర్మాలకి మనం కట్టుబడినప్పుడే, విజయం నిజమవుతుంది. మన నైతిక పరిస్థితి పటిష్టంగా వుండని పక్షంలో, విజయం అపజయంగా మారేందుకు ఎంతోకాలం పట్టదు. మన స్వప్నం క్రియారూపం దాల్చేందుకు మేధావులు మార్గాలని అన్వేషించాలి. సాంకేతిక సంపదనే గట్టిగా పట్టుకు కూచున్నంత మాత్రాన నాగరికత నిలబడదు.

మన శక్తి సామర్థ్యాలు ఎంతవరకూ వున్నాయో, వాటిని ఎంతదాకా నమ్ముకోవచ్చో గ్రహించగలగడమే 'వివేకము' అనిపించుకుంటుంది. ఈ ప్రపంచమంతా నైతిక బంధాలకి కట్టుబడివుందనే అకుంఠిత విశ్వాసానికి మనం తలవొగ్గి, ఆ విశ్వాసంలో మన ఆశాజ్యోతిని వుంచాలి. విశిష్ట ఆదర్శాన్ని అందుకోలేకపోవడంలో పొరబాటులేదు; కాని ఆదర్శమనేది వుండకపోవడం ఘోరం. లక్ష్యాన్ని చేరలేకపోవచ్చుగాని లక్ష్యమనేదే లేకుండావుంటే ఘోరమా, మరీ ఘోరమా!!

న్యాయబుద్ధి, సత్యసంధత ఆదర్శాలుగా చేసుకున్ననాడే మన రాజకీయ నిర్ణయాలు ప్రభావభరితములవుతాయి. రష్యా లోని నియంతృత్వాన్నేగాక, నియంతృత్వమనేది ప్రపంచ పొలిమేరలలో ఏచోటనున్నా మనం ఖండించగలిగిననాడు, మన రాజకీయ దృక్పథం నీతివంతమైనదని లోకులకు అని పిస్తుంది. మాటవరసకి స్పెయిన్ గురించి చెప్పుకుందాం. స్పెయిన్ దేశంలోని ప్రజాజీవన విధానం, రష్యాలో దానికంటె ఎంతమాత్రం మెరుగైనదికాదు; చతుర్విధ స్వాతంత్ర్యాలని గౌరవించేదికాదు. రష్యాలో స్వాతంత్ర్యం లేదని ఎలుగెత్తి చాటుతూ, స్పెయిన్ దగ్గిరికి వచ్చేటప్పటికి కిమ్మనకుండా వూరుకోవడం ఏం న్యాయం? స్ట్రాటజిక్‌గా మనకి పనికొచ్చే ప్రదేశాలలోని తప్పులు, చూసీచూడనట్టు వూరుకుం టున్నా మన్నమాట. ఇనపతెర వెనకనేగాక, యివతల కూడా అనేక మందికి, వ్యక్తి స్వాతంత్ర్యం అనేమాటకి అర్థం తెలియదు.

సత్యసంధతపట్టుగొమ్మగాచేసుకు మనం ఈ పోరాటంలో ముందుకి పోగలిగితే, ఎదుటివారి విధాన లోపాలు ప్రజా కోటికి యిట్టే అవగతమవుతాయి. ఎదుటివారి యాంత్రిక సమర్థతకేమీ కొరతలేదు; వారిలో వున్నది ఒకే ఒక్కటి - నైతికలోపం; వ్యక్తిని సిద్ధాంతాలకి బానిసగాచేసి వ్యక్తి గౌర వంమీద వారు దెబ్బకొట్టారు. వారి జీవన విధానంలోని నీరస గుణం అది ఒక్కటే. మనం ఆ 'వీక్‌పాయింట్'నే ఎదుర్కో వాలి. పరిశ్రమలలో, మిలిటరీ బలగంలో, సామాజిక విధా నంలో వారు మనకేమాత్రం తీసిపోరు; వ్యక్తి గౌరవమూ

వ్యక్తి స్వాతంత్ర్యమూ అను స్వేచ్ఛా సూత్రాలని విస్మరించి, నైతిక ధర్మానికి ముప్పుతెచ్చిపెట్టారు వారు.

ఈ ప్రపంచ క్షోభలో పైకి కనిపించే తారతమ్యాలు ఎటువంటివైనా, అవి రాజకీయ ఆర్థిక విధానాలకి సంబంధించినవి కాదు - ముఖ్యంగా నైతికమైనవి. కమ్యూనిజమ్ మార్క్సిజం అనే బదులు స్టాలినిజమ్ అనడం సరైన మాట. గత తార్కిక భౌతిక వాదంలో (డయలెక్టికల్ మెటీరియలిజమ్) నైతిక నిర్ణయాలకి స్థానంలేదు; సమస్త సంఘటనలూ భౌతిక శక్తుల పరిణామ రూపం. కొందరు రష్యను నాయకులు మనని మన ఆర్థిక పొరబాట్లకీ యితరములకీ గాక నైతిక లోపానికి దుమ్మెత్తిపోయడం యింకాతమాషాగా ఉంటుంది; మనం అసమర్థులమనీ సాంకేతికంగా వెనక పడివున్నామనీ అనరు - అవినీతిపరులమని వారి అభియోగం; తాము పీడిత ప్రజాలోకానికి ఒక అపూర్వమైన 'ఆర్థిక సమానత' (ఎకనమిక్ డెమొక్రసీ) సమకూర్చి పెట్టామని గొప్పలు చెప్పుకుంటారు; పెట్టుబడిదారీ దేశాలలోకంటె తమ ప్రజలకి ఎక్కువ స్వాతంత్ర్యం వుందని వారి వాదన.

ఐక్యరాజ్యసమితివంటి ప్రపంచ సభ ముందు రష్యన్ నాయకులు నీతులు వక్కాణిస్తూ, యితరుల జీవన విధానంలో క్రమ పద్ధతి లేకపోవడం గురించి బాహాటంగా చెబుతారు. మొదట తమ జీవన విధానంలో ఒక క్రమ పద్ధతి వున్నమీదటకదా యితరులని అనడం? తాము చేసే పనులని తమ సూత్రాల ప్రకారం గాక, మన సూత్రాల ప్రకారం

సమర్థిస్తారు. ప్రపంచానికి కావల్సిన నైతిక ధర్మం (ఆబ్జెక్టివ్ ట్రూత్) గురించి వారికంత పట్టుదల వుండకపోవచ్చు; మార్క్సిస్ట్ పదజాలంతో తామెప్పుడూ రైటే అయినట్టు, యితరులదే పొరబాటు అయినట్టూ నిరూపణ చేస్తారు.

ప్రపంచ జనాభాలో ఒక భాగం, మరొక భాగాన్ని నీతి లేనిదిగా భావించడం మానవ జాతికి మంచిది కాదు. సత్య స్వరూపం ఏకోన్ముఖంగా ఉంటుంది గాని ద్వివిధములుగా ఉండదు. పోనీ, అది సత్యము కాదు, సత్యాన్ని చేరుకునే మార్గం - అని భావిద్దాం. అటువంటప్పుడు కూడా పరస్పర విరుద్ధమైన మార్గాలు ఉత్తమ లక్ష్యానికి ఏవిధంగా తీసుకు వెళ్లగలవు? ఒక చెక్క మరొక చెక్కని దుష్టులుగా, అవి నీతి వర్తనులుగా భావించడం విచారకరం. ఒకరు న్యాయ మన్నది మరొకరికి అన్యాయంగా తోస్తోంది; ఒకరి సబబు మరొకరికి బేసబబు అవుతోంది; ఒకరు రైటన్నది మరొకరు తప్పు అంటున్నారు. ఇద్దరు చెప్పేవీ నిజాలేనేమో; ఎంచేత నంటే, యిద్దరూ మానవుని క్షేమం ప్రధానంగా పెట్టుకు మాట్లాడుతున్నామనే అంటున్నారు. ఈ పృధ్వీస్థలి మీద ద్వివిధ భావగమనాలతో ద్వివిధ జీవనధర్మాల్ని ఆశ్రయించి మానవులు బ్రతకవచ్చు. మిలిటరీ దృష్ట్యా అటువంటి సమ స్యలు పరిష్కారం కానేరవు. బహుశా యిరు తెగల మను షులూ వంకరదార్లనే నడుస్తూ వుండవచ్చు. థొరో అన్నట్టు విశ్వరూపం మన భావనాజగతికి అందదు.

ఆచరణలో మనం అనేక తఫాలుగా విఫలులమైనప్పటికీ అట్టడుగున మనకొక నైతికస్థానం వుందని ఏదో గట్టినమ్మకం.

ఆ నైతికస్థానమేమిటో విడమరిచి చెప్పేటప్పుడు సరిగ్గా చెప్ప లేకుండా వున్నాం. ఇప్పుడు మనని బాధిస్తున్న క్లిష్టపరిస్థితి ఏమిటి? దేనిని సంరక్షించాలని మన తాపత్రయం? ఏ విధంగా కాపాడగలం? ప్రపంచక్షోభకి మూలకారణం కొన్ని మానవత్వపు విలువలు - అని మాటవరసకి అంటాము. ఆ విలువలు ఏమిటి? పొడిమాటలతోగాక వాటిని విస్పష్టంగా చెప్పలేమా? స్టాలినిస్టులకి ఒక ఫిలాసఫీ వుంది; అందులోని మంచిచెడ్డల విషయమై వారికి ఎటువంటి సంశయాలూ లేవు. వారికి నియమబద్ధమైన కార్యక్రమావళి ఉంది. చదరంగపు ఆటగాడు ముందుఎత్తులు ఎలా గ్రహించ గలడో అంతస్పష్టంగా వారికి ఎత్తులు తెలుసు. అన్నిటినీ మించి వారికి తమ జీవన విధానంపట్ల గురుతర విశ్వాసం వుంది.

మన దురదృష్టం ఏమిటంటే, స్టాలినిస్ట్ పద్ధతికి మూల స్తంభాలు సక్రమమైనవి కాదనేవారు, అంత పటుత్వంగల మరొకపద్ధతిని కనిపెట్టలేకుండా ఉండటం. మనకొక ఫిలాసఫీ లేదు, కార్యక్రమావళి లేదు, ఉత్సాహబలం అంత కంటె లేదు. యుద్ధంమాట ఎటున్నా, ఈ మూడూ మనలో ప్రవేశిస్తేగాని మన జీవనవిధానం బాగుపడదు. బయటి శక్తులకంటె మన భ్రష్టతే మనని పాడుచేస్తోంది. కమ్యూ నిజమ్ ఎంతచెడ్డదో, 'యాంటీ - కమ్యూనిజమ్' కూడా అంతే చెడ్డది. ఒక చెడుని ఎదుర్కొనే చెడు, 'మంచి' కింద చెలామణీ అవదు. వాగ్యుద్ధంలో అవతల వారి వాదనలోని మంచిపాయింట్లు మర్చిపోతాము; అలా మర్చిపోవడం వివేక

వంతుల లక్షణం కాదు. 1941 లో ప్రపంచప్రజలు నాజీ విధానాన్ని ఎదుర్కొన్నారు. వీరందరూ ఒక సక్రమనిరతికి కట్టుబడే ఎదుర్కొన్నారా ?—లేదు. ఎవరి ధోరణి వారిది.

ఇటువంటి దృష్టాంతరాలు పరిశీలించినకొద్దీ ఒక ముఖ్య విషయం మనకి తడుతుంది. మానవ హృదంతరాళంలో కలకాలం నివశించగల ఒక నైతికలక్ష్యం, ప్రజాసముదాయ మంతటిలోనూ వున్నదని అనిపిస్తుంది. అందచందాల పత్రికలలోని ప్రకటనపుటలు ఆటొమేటిక్ వాషింగ్ మిషనుల గురించీ టెలివిజన్ గురించీ ఎంత కొనియాడినా, మనం వాటికోసమే బతకడం లేదు. మానవ ధర్మంకోసం, మానవ స్వాతంత్ర్యంకోసం, వ్యక్తిగౌరవంకోసం మనం బతుకుతున్నాము. కాని ఈ విషయం పైకి చెప్పుకోము; చెప్పుకునేందుకు మొహమాటం. వ్యక్తి భద్రత, వ్యక్తి గౌరవము మానవుని కెంతో ఆత్మీయమైనవి; మిగతా ఆడంబరాలన్నీ వీటి తర్వాతనే. అనంతవాహినికి చెందిన కొన్ని విలువల చుట్టూ కేంద్రీకృతమైనదే చైతన్యవంతమగు జీవితం.

అట్టడుగుకి వెళ్ళి ప్రధానాంశాలని చర్చించడం సోక్రటీస్ కాలంనుంచీ 'ఫిలాసఫీ' అను పేరుతో పిలవబడుతోంది. ఇంకా తరిచిచూస్తే దీనిని నైతికతత్వం (మోరల్ ఫిలాసఫీ - ఎతిక్స్) అనవలసి వస్తుంది. పాశ్చాత్య ప్రపంచంలోని నైతిక భావన, సోక్రటీస్ కాలంనుంచీ యింతవరకూ, నైతికధర్మమనేది ఒకటి ప్రపంచంలో ఉందనే మూలస్తంభాన్ని ఆధారంగా చేసుకు ముందుకి సాగింది; స్వలాభాపేక్షలకీ వ్యక్తిగతవాంఛితాలకీ అతీతమైన నైతిక ధర్మపు పునికిని అది

గుర్తించింది. నైతికనిర్ణయాలనేవి మన ఒక్కరికోసం కాదు- మన అందరికోసం. నైతికధర్మ మనేది ఒకటి వున్నదని ఒప్పుకున్నమీదట, మనం పైకి నిజాలు చెప్పినా అబద్ధాలు చెప్పినా, అంతర్యంలో ఒక నియమాన్ని అంగీకరిస్తున్నా మన్నమాట. ఇందుకు భిన్నమైన ధోరణి ఇనపతెర వెనక ఉంది. వారికి మాటలు ప్రచార సాధనాలు; మాటనేర్పు ఉత్తమ ప్రచారంగా పరిగణింప బడుతుంది. అంతకి మించి నది ఏమీలేదు వారికి మాటలలో. మనకి అలా కాదు. నైతిక ధర్మమనేది పూర్వీకులు మనకి ప్రసాదించిన అపూర్వ సంపద.

సాధారణంగా ప్రజానీకం తత్వపరిశోధనల జోలికి పోదు. జీవన విధానాన్నిబట్టి జీవన ధర్మం నిర్ణయింపబడుతూ వుంటుంది. తక్కువధరకి లభ్యమయే మోటారు కారులూ, కార్నర్ డ్రగ్‌స్టోర్స్ యివేనా మనకి కావల్సింది? ఇదేనా స్వాతంత్ర్యమంటే? ఇంతేనా స్వాతంత్ర్యమనే పదానికి అర్థం? 1950 డిసెంబరు 15 న ప్రెసిడెంట్ ట్రూమన్, అమెరికన్ జీవితంలోని ఉదాత్త విలువలగురించి ప్రస్తా వించాడు. మోటారుకార్లూ రిఫ్రీజిరేటర్లూ ఉదాత్తమైనవి అవుతాయా? —కావు. అందుకనే ఆయన మన జీవన విధానంలోని ఉదాత్తమైనవాటిని జ్ఞాపకం చేసుకోమని హెచ్చరించాడు. అవే మానవతకి సంబంధించిన విలువలు.

జీవనాదర్శం విడమరిచి తెలుసుకోవడానికి, ప్రథమంలో మనం, ఈ ప్రపంచ సంఘటనలూ వ్యక్తి జీవన విశేషాలూ ఒక నైతిక ధర్మానికి కట్టుబడి వున్న సంగతి ఆమోదించాలి.

ఏదో కాలానుగుణంగా నైతిక భావన అవసరమైందని సరి పెట్టుకోవడం కాదు - నైతిక మార్గం పట్టుకు ఆ దారి వెంట నడవాలి. నైతికమైనది మనని తరుచూ పల్కరించడం, సామాన్య సంభాషణలలోకూడా అనుభవమే. పత్రికా రచయితలు రాజకీయ నాయకుల్ని విమర్శిస్తున్నప్పుడు, తరుచూ ఆ నాయకులలోని నైతిక బలహీనతనే గురిచూసి ఎదుర్కొం టారు. నైతిక నిర్ణయమనునది, సాంఘిక జీవనంలో ప్రధాన పాత్ర వహించేది అయినప్పుడు, ఆ విషయంలో మరికొంచెం శ్రద్ధచూపడం వల్ల నష్టమేముంది? చాలా మంది ప్రఖ్యాత పురుషులు నైతిక సూత్రాల విషయమై ఆలోచిస్తూ వుండటం శుభసూచకం.

ఋజువర్తనను నేర్పేదే నైతిక తత్వం. హేతువాదం ప్రయాణం చేయగలిగినంతవరకూ అదీ వెళ్తుంది. హేతువాదం కొంతవరకూ వెళ్లి అక్కడ ఆగిపోతుందని విజ్ఞులందరూ వొప్పుకుంటారు. ఆపైన మనం నెట్టినా కూడా అది ముందుకి వెళ్లదు. గణితానికీ తర్కానికీ కూడా ఈ అవధులు వున్నాయి. మనం నిరూపించి చూపించినవి కొందరు కాదంటారు. వారికి అర్థంగాకనో, వొప్పుకోవడం యిష్టం లేకనో ఆ విధంగా అంటారు. మనం వారిని మార్చగలమా? - మార్చ లేము. అంచేత, మన హేతువాదమంతా కొందరు విజ్ఞుల్ని వొప్పించేదాకానే పనికొస్తుంది. పోతే, ఆత్మ ధర్మమని మరొకటి వుంది; అది వ్యక్తిలోని నైతిక మందిరం. దానికి మనం 'అపీలు' చేసుకోగలమేగాని మరొక మార్గం లేదు. ఉత్తమ జీవన విధానం ఎలా వుంటుందో, మనం రూప

చిత్రణ చేసి ప్రజలకి చూపగలగాలి. అప్పటికిగాని వారికి అదేమిటో తెలియదు.

నైతికవాదులందరిలోకీ ప్రముఖుడైన ప్లాటోకూడా 'న్యాయం' అనుదానిని తర్కం వల్ల గాక, క్రమ విధానానికి లోబడిన సంఘాన్ని సృష్టించి, తద్వారా 'న్యాయం' అనగా ఏమిటో వివరించాడు. న్యాయమనేదానికి అర్థం ఒక్క ముక్కలో చెప్పమంటే కష్టం. ప్లాటో మహాశయుడు 'రిపబ్లిక్' అంటే ఏవిధంగా ఉండాలో చిత్రించి, ఆపైన మిగతా పదాలకి ఆ చిత్రణద్వారా అర్థాలు అందిచ్చాడు. ఈనాటికూడా రాజకీయ రంగంలో మనకి అయన పెట్టినదే భిక్ష.

నైతిక తత్త్వ పరిశీలన హేతువాదంవలెనూ యితర విజ్ఞాన శాస్త్రాల మాదిరిగానూ అంచెల ప్రకారం నడవదు. ఎంచేతనంటే, నైతిక స్థితి అనేది సులువుగా బోధపడేది కాదు. ప్రతి అనుభవంలోనూ ఒక ప్రధాన ధర్మం ఉంటుంది గాని అనుభవాలు దేశకాల పాత్రల్ని బట్టి నిరంతరం మారుతూ వుంటాయి. ప్రధాన ధర్మం ఒకటైనప్పటికీ, పైరూపం క్షణక్షణానికీ మార్పు చెందుతుంది. ఫలానిదే రైటు - అంటూ ఈ విషయంలో మనం సూత్రాలు అల్లలేము. అరిస్టోటిల్ అన్నాడు:

"నైతిక వాతావరణానికి సంబంధించిన దాని గురించి మనం వుజ్జాయింపుగా చెప్పగలమేగాని ఖచ్చితంగా చెప్పలేము. విషయగ్రహణకు హేతువాదం కొంతవరకూ తీసుకు వెళ్తుంది; కాని ఇక్కడ 'యిది' తక్షణావసరాలకి చెందిన

పరి స్థితి. అంచేత యే సూత్రాలూ సరిగ్గా అన్వయించవు. నైతికమనగానే అసందిగ్ధత కొంతమేర తప్పదు."

అంత మాత్రాన ఉత్తమ జీవనాన్ని కొన్ని సూత్రాలలోకి యిమడ్చలేమనీ, మనకటువంటి గ్రంథసారం లేదనీకాదు దాని అర్థం. రెండువేల సంవత్సరాల అనుభవం నుంచి మనం, మనకి కావల్సిన శక్తి సామర్థ్యాలను సమకూర్చుకో వచ్చు. హీబ్రూ - క్రిస్టియన్ ధర్మాల మేళవింపు పాశ్చాత్య సంస్కృతికి ఒక స్వరూపాన్ని యిచ్చింది. గ్రీకుల తార్కిక చింతన, యూదుల నైతిక స్వప్నమూ పాశ్చాత్య జీవనానికి పట్టుగొమ్మలవంటివి. ఇవి ఒకదానితో ఒకటి కలిసీ కలి యకా పురోగమిస్తూ వచ్చాయి. బానిసత్వ నిర్మూలనానికి ఈ మనోభావాలే కారణమయాయని ప్రొఫెసర్ వైట్‌హెడ్ అన్నాడు.

నేడు నైతిక భావాలని మనంమాటమాత్రంగానేగాని, క్రియరూపేణా ఆదరించలేకుండా వున్నాము. అవి పుస్తకా లలో పదిలంగా వున్నాయి. ఛిన్నాభిన్నమై చితికిపోయిన నైతిక సంపదని ఒకటిగా చేసుకుంటే తప్ప నైతిక విజ్ఞానానికి క్రమత ఏర్పడదు. ఈ పుస్తకంలోని ప్రకరణలు వేటికవి విడిగా చదివితే, మొత్తంమీద రచయిత ఏమి చెప్పదలుచు కున్నదీ తెలియవట్లే, నైతిక ఆదర్శానికి సంబంధించిన చిత్రం పూర్తిగా వుంటేగాని, మనకదేమిటో బోధపడదు. వ్యక్తులకీ సముదాయానికీ ఆ ఆదర్శం మంచిదని తోచి నప్పుడు, అటువంటి స్వప్నం నిజమయేందుకు తగు ప్రోద్బలం మనంకూడా యివ్వాలి. ఆ బాధ్యత మనందరి

మీదా వుంది. నైతికతత్వ మెప్పుడూ మంచి వైపే మొగ్గు తుంది.

ప్రఖ్యాత నైతికవాదులలో అభిప్రాయభేదాలు అనంతంగా వున్నాయికాని, వారు ఏర్పరిచిన వివేకమార్గం అందరికీ ఆచరణయోగ్యమైనది. మానవ నాగరికత యితరమార్గాల పురోగమించినప్పుడు, మానవునిలో సంతుష్టి లోపించడం విచారకరం. అసంతృప్తి సహజలక్షణంకాదు. కాలంఖర్మం కలిసిరాక ఈమాదిరి పరిస్థితు లేర్పడ్డాయి. ఒకదేశంలోని ఒక వ్యక్తివల్లనో, ఒకదేశంలోని కొందరు వ్యక్తులవల్లనో, ఈ యాంత్రిక నాగరికతకి కీలకమైన పరిశోధనలు జరగలేదు. వివిధ దేశాలలో వేరువేరు కాలాలలో, జరిపిన పరిశోధనల ఫలితంగా మనకి ఈ అపూర్వ నాగరికత లభించింది. నైతికవాదులు లోకాధారమైనవాటి గురించి తర్జనభర్జనలు జరుపుతారేగాని, 'ఏది మంచిది?' అనే విషయంలో వారందరిదీ ఏకాభిప్రాయమే. సిద్ధాంతవైవిధ్యం ఎంత వున్నప్పటికీ, క్రియ విషయంలో అందరూ ఒకేమాటమీద వుండి, ప్రకృతిపరంగా నైతిక ధర్మమనేది ఒకటి వుందనీ, అదే సత్యస్వరూపమనీ వొప్పుకుంటారు.

నేటి నాగరిక పౌరుడికి అర్ధమయే భాషలో మనం ఈ విషయాలు విశదీకరించి చెప్పగలమా? చెప్పాలి - చెప్పక తప్పదు. ఆ విధంగా చెప్పడంవల్ల, మనం ఒక ఉత్తమ కార్యం చేసినవారమవుతాము. నైతికభావన ప్రజలకి వుండటంవల్ల రెండు మంచి పనులు జరుగుతాయి. చారిత్రక విషయాలమీద దాని ప్రభావం కనపడుతుంది; ప్రజలకి

తాము దేని విషయంలో ఎక్కువ విలువ యివ్వాలో తెలుస్తుంది. ఆ కారణంగా వారిలో పెల్లుబికే నూతనోత్సాహం చరిత్రగతిని మార్చగలుగుతుంది. రెండవ మేలు ఏమిటంటే, నైతికభావన వ్యక్తులని ఢక్కామొక్కీలు తినగల బలవంతులుగా చేస్తుంది. ఆ కారణంగా కష్టాలని ఎదుర్కొగల మనస్థయిర్యం అబ్బుతుంది వారికి.

ఇది విషమ సమస్యే కాని నూతన సమస్య కాదు. మానవుడు 'డార్క్ ఏజెస్' దాటుకువచ్చాడంటే, అది విధివశాన గానీ స్వతస్సిద్ధంగాగానీ జరిగిన సంగతి కాదు. అంతటి అంధకారయుగంలో కూడా కొందరు వ్యక్తులు మానవ విజ్ఞానాన్ని ప్రాణప్రదంగా దాచిపెట్టి కాపాడారు. వీటిని కాపాడటమే తమ జీవన ధర్మంగా భావించారు కొందరు మహాపురుషులు. ఈ మహనీయుల విజ్ఞాన తృష్ణకి మానవజాతి ఎప్పుడూ ఋణపడి వుండవల్సిందే! 1500 సంవత్సరాలక్రితం రోమ్‌లో జన్మించిన బోథియస్ అనే ఆయన అటువంటివారిలో ఒకడు. రోమన్ సామ్రాజ్యం పడిపోయింది. అంధకార యుగం ప్రవేశించింది. నిరంకుశులైన ప్రభువులు ఈ మహనీయుణ్ణి ఒక జైలుకొట్లో పారేశారు. అక్కడ, ఆ ఖైదులో, బోథియస్ 'ది కాన్‌సోలేషన్ ఆఫ్ ఫిలాసఫీ' అను బ్రహ్మాండమైన గ్రంథం రచించి జ్ఞానజ్యోతి ఆరిపోకుండా కాపాడాడు. ఆ రోమన్ వేదాంతిని గురించి చెప్పుకోవడం, మనకీ రోజున అన్నివిధాలా సరిపోతోంది. ఈనాడు విశేష ప్రజానీకం ఒక మాదిరి జైలులోనే నివశిస్తోంది. బోథియస్‌కివలెనే మనం, రాజకీయరంగానికీ సైనిక రంగానికీ అతీతమైన విలువల

గురించి ఆలోచించవలసి వుంది. సేనలు తగ్గవచ్చు, పెరగ వచ్చు; రాజకీయాలు మారవచ్చు; కాని మార్పులేనిదొకటి మానవ హృదయంలో ఉంది. అందరి మంచికీ పనికొచ్చే ఆ 'ఉత్తమవిలువ'ని మనం గ్రహించాలి. అది గ్రహించేందుకు మరి కొంచెం మనోబలం కావాలి. భౌతిక సంపదలు చేయి జారిపోనిస్తే ఎలా అనే ప్రశ్న అప్రస్తుతం; ఇది ఆ మాదిరి సంపదలకి సంబంధించినదని అనుకుంటే, ప్రధానాంశం దగ్గిరికి మనం వెళ్లనేలేము. నైతిక ధర్మమనేది జీవనసత్యం అన్నాడు బోథియస్.

అంధ యుగంలోని పరిస్థితులు తరిచిచూసినకొద్దీ, మన ప్రధాన సమస్యకి చేరువగా వెళ్లగలుగుతాం. సంపదలోకంటె ఆపదలో మనుషులు జాగరూకులై వుంటున్నట్టు తోస్తుంది. బాబిలోనియా పాలబడ్డ తర్వాతనే హీబ్రూసాహిత్యం బయటి కొచ్చింది. సివిల్‌వార్‌లో చిక్కినప్పుడే అమెరికనుల నోటి వెంట ఉత్తమ వాక్యాలు వచ్చాయి. ఇప్పుడు ఈనాడు జరుగుతున్న సివిల్‌వార్, ప్రపంచం మొత్తంమీద జరుగు తోంది - అదే ప్రపంచ క్షోభగా రూపొందింది. మహా సత్యాలు పలుకగల కొన్ని కంఠాలు కావాలి మనకీనాడు.

ఈ శతాబ్దిలోని ప్రజలు ఒకవిధంగా అలిసిపోయారు. చాలామంది మెదళ్ళు మొద్దుబారాయి; మనసులు విసిగి పోయాయి. అది కొంతవరకూ యుగప్రభావం. ఈ నైరాశ్యత మరీ ప్రబలమైతే 'ప్రస్తుతాన్ని' మార్చే ప్రయత్నంకూడా జర గదు. అటువంటి స్థితికి మనం దిగజారకూడదు. భావనా బలం చరిత్ర వైఖరిని మార్చిన సందర్భాలు అనేకంవున్నాయి గనక, చెయ్యికాలక పూర్వమే ఆకులు పట్టుకోవడంమంచిది.

# 2

# జీవన లక్ష్యం

"మరణం జీవితాన్ని కబళించడం లేదు. క్షణ క్షణమూ రోజురోజూ లక్షాతొంభయి నిరుపయోగమైన పనులతో జీవితాన్ని కోల్పోతున్నాం, మనం."

— స్టీఫెన్ విన్సెంట్ బెనెట్

మనం ఘనంగా భావించే ఈ జీవనవిధానాన్ని పాడు చేదామని ఏ పరాయిశక్తీ కనిపెట్టుకు కూచోలేదు; మన పాశ్చాత్య సమాజంలోని విరుద్ధభావాలే అందుకు కారణ మవుతున్నాయి. భావవైరం మన యుగధర్మం. ఏ భావ సముదాయం శక్తివంతమైనది, ఏది నిర్జీవమైనది – అని మనకి మనముగా తెలుసుకోవాలి. అసాధ్యమైనది సాధించ బోయి భావసంపదలో నీరసుల మవడంకూడా కద్దు. జీవిత చిత్రణ ఎప్పటికప్పుడు మన కళ్లముందు పాడగడుతూ వుండాలి. ఆ చిత్రణనుంచే మనం స్వారస్యం గ్రహించ గలుగుతాము. మన మెదడులోకి విరుద్ధమైన అభిప్రాయాలు ప్రవేశించనివ్వకూడదు. ఒకేపుంత వెంటనడవడం నేర్చు కోవాలి.

ఆడుతూ పాడుతూ జీవితం గడపగలగడమనేది మర్చి పోతున్నాము. ప్రపంచంలోని రెండు చెక్కలలోనూ, ఏదో బ్రహ్మాండమైనది జరుగనున్నదని ఒకచెక్కలో వారు భావిస్తూంటే, ముందుదారి తెలియక దిగాలుపడి కూచున్నారు మరొక చెక్కలోవారు. వారి ఉత్సాహం, వీరి దిగులు ఎల్లకాలం నిలవవు. కాని ఈ దిగులు వీరి జీవ గ్రంథులలో ప్రవేశించి, వీరిని నిస్తేజులుగా చేయకుండా వుండాలి. వంకరటింకర ఆదర్శం అయినప్పటికీ, ఏదో ఒక ఆదర్శం వున్నవారు, ఆదర్శమనేది లేనివారికంటె ఉత్సాహ వంతులై వుంటారు.

పాశ్చాత్యలోకంలో మనకీనాడు, ఒకమందకొడితనం (డిప్రెషన్) కనిపిస్తూంది. అర్థిక కారణంగా వుత్పన్నమైన మందకొడితనంకాదది. చాలాకాలంగా ఎందరో మేధావులు యిటువంటి మనోవ్యాకులత ఉద్భవమవుతుందని జోస్యం చెబుతూ వచ్చారుకాని వారిమాట కొట్టేశాము. మనం వూహించని విధంగా, ఇప్పుడీ మనోవ్యాకులత ప్రదర్శితమవుతోంది. మనలో ఒకవిధమైన నైతికపతనం ప్రవేశించింది. స్టాకు మార్కెట్ చక్కగా వుంది; ధరల విషయంలో యిబ్బంది లేదు; అర్థికంగా అంతా పుష్టివంతంగానే వుంది – అయినప్పటికీ ఈ నైతికపతనం మన కన్నుగప్పి చక్కా వచ్చింది.

అర్థికంగా ఉచ్చదశలో వున్నప్పుడు, నైతికపతనం(మోరల్ డిప్రెషన్) మరీ తమాషా అయిన విషయం. ఇంత మెరుగైన అర్థిక పరిస్థితులు ఈమధ్యకాలంలో ఎవరూ ఎరగరు. అర్థిక కారణంగా సమస్తమూ నిర్ణయింపబడుతుందనేసూత్రం నిజమైన పక్షంలో, పాశ్చాత్యలోకానికి యిటువంటిగతి పట్టివుండకూడదు. ఈ నైతికపతనమనేది, దారిద్ర్యంవల్ల బాధపడే దేశాలలో గాక, సమృద్ధిగా అహారమూ, పుష్కలంగా జీతాలూ అందరికీ ఉద్యోగాలూవున్న ప్రదేశంనుంచి వచ్చింది. అమెరికా ప్రజల అర్థిక సౌష్ఠవానికీ మిగతా దేశస్థుల జీవన ప్రమాణానికీ మధ్య సాటిలేనంత వ్యత్యాసం వుంది. ఆగ్నేయాసియాలోని ప్రజల అకలిబాధ ఎటువంటిదో, మన కాన్సర్వ్యాధీ అటువంటిదే! వారు అకలికి భయపడితే, మనం.

కాన్సర్‌కి భయపడుతున్నాము - రెండూ విచారకరమే కాని నివారించలేకుండా వున్నాము.

ఆకలిబాధతో అలమటిస్తున్న ప్రజలు, చింతా క్రాంతులై ఆత్మస్థయిర్యాన్ని కోల్పోయారంటే మనం అర్థంచేసుకోవచ్చు. కాని సిరిసంపదలు పుష్కలంగా వున్నచోట జీవిస్తూ, వాటిని రెండుచేతులా అనుభవిస్తూ, ప్రజలు తప్పుదారి పట్టారంటే, మన జీవన విధానంలో ఎక్కడో పెద్దలోపం వుందన్నమాట. ప్రజాస్వామ్య మందిరంలో అక్షరాలా యిదే జరుగుతోంది. కడుపునిండా తిండి, వొంటినిండా బట్ట గల కోటానుకోట్ల ప్రజలు, బాంబులతో పట్నాలు నేలమట్టం కావడమనే దుర దృష్టాన్ని అనుభవించి ఎరుగని ప్రజలు, అకారణంగా వ్యాకులపాటుకి లోనవుతున్నారు. పాశ్చాత్య లోకంలో మనో వైద్య కేంద్రాల సంఖ్య నానాటికి పెరుగుతోంది. సామాన్య పౌరులు హృదయ ప్రశాంతతను కాపాడుకోలేకపోతున్నారు. జనసామాన్యంలో అకారణ భయోత్పాతం పెరిగిపోతోంది.

మన పెద్దమాటలను వొట్టి కబుర్లుగా కనిపింపజేస్తోంది మనలోని ఈ నైతికపతనం. ఎన్నో కొత్త పరిశోధనలు కని పెట్టామనే గర్వాన్ని, ఈ నైతికపతనం పూర్తిగా తుడిచి వేస్తోంది. అమెరికనుల ప్రతిభకి నమూనాగా డిట్రాయిట్ పట్నం వృద్ధిపొందింది. నవీనతకి మారుపేరా అన్నట్టుగా రూపొందింది ఈ మహానగరం. ఇక్కడ తయారయ్యే మోటారుకార్ల వరసలు కనుల వైకుంఠంగా ఉంటాయి. ఎన్నిమోటార్లు, ఎన్నిమోటారుకార్లు!! కాని వీటని తయారు

చేసే మనుషులమాటో? ఈ ప్రాంతం మోటారుకార్లతోబాటు వ్రణాలకి కూడా ప్రసిద్ధి. స్టామక్ అల్సర్ (కడుపులో పుండు) యిక్కడివారికి ఎక్కువగా వస్తుంది. గడియగడియ కొక మోటారుకారు చొప్పున తయారుచేయగల మనం, యిక్కడి ప్రజల 'స్టామక్ అల్సర్స్' నివారింపగల మార్గం కనిపెట్టలేకపోయాము. ఏ మనుషులకోసమైతే ఈయంత్రాలు నిర్మితమవుతున్నాయో, వారిపట్ల ఈ యంత్రాల విషయంలో చూపిన శ్రద్ధ చూపలేకపోతున్నాము. 'యంత్రంకంటె మనిషి గొప్పవాడు' - ఆ విషయం మర్చిపోవడమే మనం చేస్తున్న పెద్ద పొరబాటు.

మనస్థిమితం కోసం మనవాళ్ళు నలుదెసలా వెతుకు తున్నారు. మనసుకి శాంతినిచ్చేవి, ఆత్మకి శాంతినిచ్చేవి, మనోధైర్యం పెంపొందించేవి - అనుచీట్లతో చెలామణీ అవు తున్న పుస్తకాలూ తత్సంబంధమైన సాహిత్యమూ విపరీతంగా అమ్ముడవుతోంది ఈ మధ్య. అదేవిధంగా మందులుకూడా. ఒక మందు విపరీతంగా అమ్ముడుఅవుతోందంటే, అందులో గుణం వుండికాదు; ఆ వ్యాధి ఎంత వ్యాప్తిచెందిందో మనకు తెలియజేస్తోందన్నమాట. ఆత్మశక్తికీ మనశ్శాంతికీ సంబం ధించిన పుస్తకాలు మిలియనుల సంఖ్యలో చెల్లుబడి అవు తున్నాయంటే, ఆ రెండూ ప్రజలలో ఎంత లోపించాయో మనం తెలుసుకోవచ్చు. తమకి లేనిది పొందాలని తపన పడటం మానవులకు సహజం. సాధారణులు సంతోషాన్ని గురించి ఆలోచించరు; విషాదహృదయులే సంతోషం గురించి కలలు అల్లుకుంటారు. సుఖ సంసారంలో వున్నవారికి సెక్సు

పుస్తకాలమీద దృష్టిపోదు; రోగిష్టులేకదా డాక్టరుని వెతుక్కుంటూ వెళ్లేది!

మనలోని నైతిక పతనం గురించి చెప్పేందుకు యిది చాలు; కొత్త సాక్ష్యాలు సేకరించవలసినపనిలేదు. మనలో నైతికపతనం వచ్చిందని అందరం వొప్పుకుంటూనే వున్నాం. పోతే, సహేతుకంగా విమర్శించుకు, కారణాలు కనిపెట్టి, వాటి నివారణోపాయం అన్వేషించాలి. యంత్ర యుగంలో వేగాన్ని ఎక్కువగా నమ్ముకుని వుండటంవల్ల, ఈ మానసిక రుగ్మత ఏర్పడిందని కొందరి అభిప్రాయం. యంత్రయుగాన్ని అనడం పరిపాటైపోయింది. వేగం గురించి చెప్పినది కొంత వరకూ నిజం, సంపూర్ణసత్యము మాత్రం కాదు. ఎంచేతనంటే, ఈ మానసికరుగ్మత పట్నవాసు లొక్కరిలోనేగాక ప్రజలందరిలోనూ కనిపిస్తూంది. కాన్సాస్ రాష్ట్రంలో ఈ మానసికరుగ్మత మరీ ఎక్కువగా ఉంది - అది అర్బన్ ఏరియా క్రిందకి రానేరాదు. ఆ సంగతి అలా వుండగా, పట్నవాసంలో నిరంతర రొదలో, యాంత్రిక నాగరికత నడిబొడ్డులో, యేమాత్రం చెక్కు చెదరని వినిర్మల మనస్థయిర్యంతో, లక్షలాది స్త్రీ పురుషులు హాయిగా జీవిస్తున్నారు. వారి మాటేం చెబుతాం?

నవీన యాంత్రిక విధానం మన మనస్థయిర్యం పోయేందుకు కారణం కాకపోయినా, మనలోని లోపాలు మట్టుకు బయట పెడుతోంది. నిర్దాక్షిణ్యంగా మనలోని నీరసగుణాన్ని వ్యక్తం చేస్తూ వార్తా ప్రసారమూ రాకపోకల సౌలభ్యమూ

మొదలైన వాటిద్వారా మనలోకల భయాందోళనలని వృద్ధి పరుస్తోంది. యంత్రాలు మానవునికి సౌకర్యం కలగచేయ టంతోబాటు, తలకి మించిన బాధలు తెచ్చిపెట్టాయి.

నేటి జీవన విధానంలోని మహోద్వేగం చాలా రుగ్మత లకి మూల కారణం. ఈ రోజులకి తగిన 'ఫిలాసఫి' మనకి తెలియడం లేదు. కొందరు పురాతన గ్రంథాలు చదువు తున్నారు; కొందరు సుశిక్షణ మార్గంద్వారా శాంతి సౌఖ్యాలు అన్వేషిస్తున్నారు. ఏమైనా అందరూ యేదో ఒక పరిస్థితి లోకి గిరవాటు వేయబడినట్లుగా తలపోస్తున్నారు. వార్తా పత్రిక, రేడియో, సినీమా, టెలివిజన్ - యివి కొద్దిగా మను షులకి తాత్కాలిక తృప్తిని యిస్తున్నాయి; అది తాత్కాలికం మాత్రమే. ఇవి సరిపడక తీరిక సమయాన్ని యేమి చెయ్యా డమా అని బాధ పడుతున్నారు చాలామంది. మనం పరు గిడుతున్నాం; ఒకళ్లం స్థిమితంగా కూచోలేము; ఏకాంతం భరించలేము. 'యేకాగ్ర చిత్తత' (మెడిటేషన్) అనే మాన సికానుభవం మనకి తెలియదు. ఎలక్ట్రిక్ ట్రయిన్‌నుంచి దిగడంలో అర నిముషం ఎందుకు ఆలస్యమవాలని, బండి ఆగడానికి ముందే ఫుట్ బోర్డు మీదకి వచ్చినుంచుంటు న్నారు మనుషులు. మన మనస్తత్వం ఆ విధంగా వుంది. వీరికి పుస్తకాలు చదవడంవల్ల యేం శాంతి వస్తుంది? జీవన పద్ధతి మొదలంటా మారాలి. అంటే మనం వెనక్కి, యంత్రాలు లేని రోజులలోకి, వెళ్లలేము; ప్రస్తుత స్థితిగతు లనిబట్టి మనోనిగ్రహం పెరగాలి - ఆత్మవిశ్వాసం పెంపొం దించుకునేందుకు తగుకృషి చేయాలి.

•

మన శతాబ్దిలోని రుగ్మతలకి యంత్రాలకంటె యుద్ధాలు ఎక్కువకారణ మవుతున్నాయి. యుద్ధంవల్ల ఉత్సాహం తగ్గదు, ఎక్కువవుతుంది గాని! యంత్రాలు జీవనవిభాగ మైనట్లే, యుద్ధ భయంనుంచి తప్పించుకో లేని స్థితి కూడా ఏర్పడుతోంది. అంతర్జాతీయంగా శాంతి అనేది, తాత్కాలిక శాంతి మాత్రమేనని, రెండు ప్రపంచయుద్ధాలు చవిచూసిన మనతరం వారికితెలుసు. సుస్థిరశాంతి అసాధ్యమైన విషయం; అది సాధ్యంకాగల పరిస్థితులు యిప్పట్లో కన పడటం లేదు - ఎప్పుడు పుద్భవమందు తాయో చెప్ప లేకుండావున్నాము. రాజకియంగానూ సాంఘికంగానూ మనుషులు పెనుతుపానులో చిక్కువున్నారు; విద్వేషమూ అపనమ్మకమూ విపరీతంగా ఉన్నాయి. ఇవన్నీపోయి, మనుష్యులందరూ మంచివాళ్లుగా మారుతారనే సుందర స్వప్నం చక్కటిదే గాని అది నిజమవుతుందా? ఈ అలజడి నేటి మానవునిలో ఒక భాగమని మనం అంగీకరించక తప్పదు. ముందు సంగతి చెప్పలేంగాని, యింతవరకూ ప్రపంచం మొత్తంమీద, అఖండంగా శాంతి నెలకొల్పబడట మనేదీ జరగలేదు.

అంచేత, నేటి మానవుడు ఈ పరిస్థితులకి దూరంగా జరగడం గాక, ఈ పరిస్థితుల మధ్య నిలబడి, తనేమిటో తన పాత్రయేమిటో తెలుసుకోవాలి. శాంతిసూత్రాలు వల్లించి ప్రయోజనంలేదు. గత పది సంవత్సరాలుగా ఉత్తరఅట్లాం టిక్ మహాసముద్రంపైన ఎగురుతున్న వైమానికుల నేర్పు వంటిది అలవరుచుకోవాలి; వారి ఏకాగ్రత, వారి కార్య భారమూవంటిది మనం అలవరుచుకోవాలి.

1946 - 1950 ల మధ్య ఒక నీతిసూత్రాన్ని చాలామంది చెబుతూండేవారు. మనశ్శాంతి అన్నిటికంటె ఉత్తమమైన సుగుణమనీ, దానినుంచే 'మంచి' అనేది ప్రసారితమవు తుందనీ ఆ సూత్రధర్మం. మనశ్శాంతిని సాధించడ మెలాగో రకరకాలమార్గాలు చెప్పేవారు. మతపరంగా చెప్పినా, విజ్ఞాన యుతంగాచెప్పినా యివన్నీ వ్యక్తిలోని 'చింతన'ని ఏకో న్ముఖంగాచేసి, మనశ్శాంతికి దోహదమయ్యేవి. నిరర్థకమైన జీవితాలు గడపవద్దని మతబోధకులు మొదటినుంచీ చెబు తూనేవున్నారు. జీవితానికి అర్థం కనిపించకనే శాంతిఉండదు. ఆ నాటి సూక్తులు విస్మరింపబడటం జరిగింది. అంత నెమ్మ దిగాచెబితే అర్థం చేసుకోగల స్థితిలో లేరు ఈ నాటి మను షులు. సందేశసారం ఒకటే అయినప్పటికీ, యుగధర్మాన్ని బట్టి చెప్పేపద్ధతి మారాలి.

జోషువా లిబ్‌మాన్ 1946 లో 'పీస్ ఆఫ్ మైండ్' - (మనసుకి కావల్సిన శాంతి) అను గ్రంథాన్ని ప్రచురించాడు. ఆ పుస్తకాన్ని ప్రజలు ఎంత వెర్రిగాకొన్నారో చెప్పలేము. ఆ తర్వాత అటువంటి పుస్తకాలు చాలావచ్చాయి. కాని జోషువా లిబ్‌మాన్ గ్రంథం పొందిన విశేషఆదరణ, మనకి ప్రజల మనస్తత్వం తెలియపరుస్తోంది. ప్రజలకి అన్నిటి కంటె ముఖ్యంగా కావల్సిందేమిటి ? - మనశ్శాంతి. కొందరు పాఠకులు ఆ పుస్తకంచదివి బాగుపడివుంటారు - అది కాదన లేము. కాని ఆ మాదిరి పుస్తకాల బహుళ ప్రచారంవల్ల, ప్రజలు ఎంతవేదనామనస్కులైవున్నారో కూడా తెలుసుకో గల అవకాశం కలుగుతోంది.

ఈ కాలపు ప్రజకి రుచించక పోవచ్చునేమోగాని వ్యక్తి జీవనలక్ష్యం మనశ్శాంతి కానేరదు. ఎంచేత ననగా, మన శ్శాంతికి వివిధస్థాయిలువున్నాయి. బోథియస్‌వంటి రోమను ఫిలాసఫర్ బందిఖానాలోకూడా మనశ్శాంతిని పోగొట్టుకో కుండా వుండగలిగాడు; ధర్మమార్గాన నడిచే వారికి బాధ లేమిటని భావించే సోక్రటీస్‌కి, విషపాత్ర చేతబుచ్చుకున్న ప్పుడు, మనశ్శాంతి చలించలేదు. ఛార్లెస్ మార్గన్ 'ది ఫౌంటెన్' అను నవలలో ఒక పాత్రచేత అనిపిస్తాడు: "కడుపునిండా భోజనంచేసి, హాయిగా చుట్ట ముట్టించి నప్పుడు, లావ్ హామ్‌కి ఎంతో మనశ్శాంతిగా ఉంటుంది." ఉన్నదానితో తృప్తిపడని అశాంతి, కళాకారులనీ యితర మహనీయులనీ ముందుకి నడిపిస్తుంది. సామాన్యులకి నిజంగా మనశ్శాంతి అనుభవమైతే గొప్ప విషయమే - కాని అవదు. అదీగాక, మనశ్శాంతే జీవనలక్ష్యమని భావించిన నాడు శుద్ధ మొద్దావతారం సుఖవంతుడవాలి - అది నిజం కాదే! మృదుహృదయులే (సెన్సిటివ్ పెర్సన్స్) మానవ జాతికి పూజనీయులవుతున్నారు.

మనశ్శాంతి, మనశ్శాంతి అని మాట వరసకి అంటున్న ప్పుడు, ఋషులకివుండే ఆత్మశాంతీ, విరాగులకివుండే మనో నిబ్బరమూ ఉదాహరణాలుగా భావించి ఆ పదం వాడు తున్నాము. అప్పుడు కూడా అది ఒక తరహాకి మాత్రమే చెందుతుంది. మనశ్శాంతికంటె వాంఛించదగిన దేమీలేదా? మనశ్శాంతి ఎప్పుడూ 'మంచి'కే దారితీస్తుందా? కొన్ని సంద ర్భాలలో మనిషిని కదిపి కుదిపితేగాని లాభంలేదు; కొన్ని

సందర్భాలలో మనుషులు పౌరుషవంతులు కాకపోతేగాని కుదరదు.

తుపాను మధ్యని కూడా 'శాంతికేంద్రం' ఉంది - అక్క డికి చేరుకోగల సమర్థత మనకి వుండాలేగాని! అన్యా యాలూ అక్రమాలూ జరుగుతున్నప్పుడు మనశ్శాంతితో వుండటం మానవత అనిపించుకోదు. తీవ్రమైన బాధలలో నుంచి నడిచి వెళ్లగలిగినప్పుడే, ఆ పొందే శాంతి, పటు తరమై ఉంటుంది. శాంతిని పొందగలగడంలో కూడా చవక, ప్రియమూ ఉన్నాయి.

వ్యక్తిగత సౌఖ్యంకోసమే ప్రాకులాడటం నైతికపతన చిహ్నం. సౌఖ్యాన్వేషణ ఒక సమస్యా? - అని ప్రశ్నిస్తారు కొందరు. అందరికీ సౌఖ్యంకావాలి; కాని అందరూ సౌఖ్యా న్వేషకులైన పక్షంలో సమస్తమూ స్వార్థపూరితమవుతుంది. 'మీకు సుఖపడాలనివుందా లేదా?' అని అడిగితే, అందరూ సుఖపడాలనివుందనే చెబుతారు. మానవచరిత్రలో ఘనత కెక్కిన మహనీయులెవరూ, సుఖంకోసం తాపత్రయపడ్డట్టు తోచదు; ఆ ప్రశ్నే వారికి కలగలేదు. మనకి ఆదర్శమూర్తు లైన స్త్రీ పురుషులందరూ సత్యాన్వేషకులూ ధర్మనిరతులూ గాని, సౌఖ్యాభిలాషులు ఎంతమాత్రం కాదు. ఆ సత్యాన్వేష కులూ ధర్మనిరతులూ సుఖపడకేం, గొప్పగా సుఖపడ్డారు. కాని వారి జీవనలక్ష్యం మాత్రం అది కాదు.

గుప్పెట్లో పట్టుకోబోతే సుఖమనేది జారిపోతుంది; మనం దానిని నిరసించి లక్ష్యపెట్టకుండావుంటే వొళ్లోవచ్చి కూచుం

టుంది. సౌఖ్యం కావాలనుకున్నవారు, దాని సంగతి మర్చి పోవాలి. సుఖపడగల సాధనాలు చెప్పే పుస్తకాలు మనని చివరంటా తీసుకువెళ్లలేవు. అవి చదివి వాటిలోని విషయం విస్మరిస్తారు చాలామంది. సుఖాన్వేషణే పరమ లక్ష్యంగా భావించే జనాభాని మనసులో వుంచుకు ఒక పత్రిక, "ప్రపం చంలోని జీవరాసు లన్నిటికంటె బురదలో దొర్లే పంది ఎక్కువ సుఖపడుతోంది" అంటూ ఈసడించింది.

సుఖపడేందుకు మనుష్యులు పడే యాతన, ఈనాడు అమాంత్రం పుట్టుకొచ్చినది కాదు - మానవ వివేకంలో అది ఒక భాగం. ఈ ప్రత్యేక భాగం మానవుణ్ణి ఎప్పటికప్పుడు వోడించి, బోల్తాకొట్టిస్తూ వుంటుంది. సుఖమనండి, ఆనంద మనండి - అది అన్వేషించదగ్గదికాదు; మరొకదానికై వెళ్తు న్నప్పుడు, అది కాళ్లకి అడ్డం పడుతుంది.

అతి వినయం ధూర్తలక్షణం అనే సామెత మనకి వుండనే వుంది. ఎలా వినయంగా వుండాలా అని ప్రయత్నించి లాభం లేదు. నమ్రత, వినయము - యిటువంటివి అంతర్యంలో నుంచి రావాలి. ఉన్నా లేకపోయినా అవి ప్రదర్శించబోయే వారు తమకి తాము హానికలగ చేసుకుంటారు.

"పాపులలో నేను పాపిష్టిని; భగవంతుడా - నన్ను కరు ణించు," అని ఒక సాధువు అనేటప్పటికి, "నువ్వు పాపిష్టివి కాదు; కాని నీచేత అలా పలికిస్తున్నదేమిటో తెలుసా - నీ అహం," అందట అశరీరవాణి. వినయము అనగా, నమ్రత అనగా తనని గురించి తను అనుకోకుండా వుండగలగడం.

అన్వేషణవల్ల 'సౌఖ్యము' చేతికందదని తెలుసుకున్న మాత్రాన విషయం పూర్తికాదు. ఎప్పటికప్పుడు రోజులు నిరుత్సాహంగా కనిపించినా, ప్రతి వ్యక్తి జీవితంలోనూ స్వర్ణ ఘడియలు వుంటాయి. ఆ స్వర్ణ ఘడియలు ప్రతిధ్వనుల వంటి మొత్తం రోజులకంటె బరువుగా ఉంటాయి. ఆ సమ యాన మనుషులు మంచిగా ప్రవర్తిస్తారు; వారుచేసే పనులు ఉదాత్తంగా ఉంటాయి. కొన్ని పరిస్థితులు సానుకూల మైన ప్పుడు విశిష్ట జీవితం ఏర్పడుతుంది. విశిష్ట జీవితం మాట అటుంచి, ఆ ఉత్తమ పరిస్తితులు ఏలాటివో మనం తెలుసు కోవాలి. మనకి చేతనైనంతలో జీవనధర్మం తెలుసుకు, ఆ ప్రకారం జీవితాలు దిద్దుకోవడమే వివేకమనిపించు కుంటుంది. ఇనప్పెట్లో డబ్బు, వొంట్లో శక్తి, నాలుగు మూల లకి తిరగగల అవకాశాలు, అన్నీ వుండికూడా కొందరు ధన వంతులు, అకారణ మనస్తాపంతో దినాలు వెళ్లబుచ్చు తూంటే, జైలుకొట్లో బంధింపబడ్డ కొందరు ఖైదీలు గొంతెత్తి పాటలు పాడుతారు - ఎంచేత? ఒక్కొక్కప్పుడు యజమాని కంటె నౌకరు సుఖపడగలడు - ఎంచేత? ఒకేమాదిరి పరి సరాలలో పెరిగిన వ్యక్తులలో ఒకతను సరసుడూ, మరొక తను కుత్సితుడూ అవుతున్నారు – ఎంచేత? తమ తలనొప్పి గురించీ తమ కడుపు నొప్పి గురించీ ఒకటికి పదిసార్లు వాపోయేవారు రోగిష్టివారవుతున్నారు. రక్తపోటు గురించిగానీ గుండెదిటవు గురించిగానీ ఆలోచించేందుకు క్షణం వ్యవధి లేకుండా తమ కార్యభారంలో నిమగ్నులైవున్న స్త్రీ పురుషులు హాయిగా ఆరోగ్యంగా ఉంటున్నారు. ఇది మనందరికీ తెలి

సిన విషయం – కాదనలేము. పోతే, ఉత్తమ జీవితానికి ప్రధానం బయట పరిస్థితులే కాదు; లోపలి ఏర్పాటుకూడా అందుకు అనుగుణంగా ఉండాలి. ఎవరికివారు తమ మనసుని సరిగ్గా 'ట్యూన్' చేసుకోగలగాలి. భరింపరాని కష్టాలలో మనిషి కుంగిపోవచ్చు - అది వేరే సంగతి. కాని, ఈ జీవితపు గోడలమధ్య నైతిక స్వాతంత్ర్యం ఎంతగానో ఉంది. నార్వే దేశంలో నాజీలచేత ఖైదుచేయబడ్డ జార్జి బ్రాక్‌మాన్ అనే ఆయన అంటాడు: "మాదేశాన్ని నాజీలు దోచుకుంటున్నారు. ఆ దోపిడీ ఈ కళ్లతో చూడకుండా జైలుగోడలమధ్య పడివుండటం కూడా అదృష్టమే కదా! నాకిక్కడ ఎంతో బావుంది."

ప్రతి మనిషి హృదయంలోనూ ఒక చిన్న వెలుగు లేకపోతే, సుఖాలు పులిసిపోతాయి. అందంగా వుండేవాళ్ళూ, భాగ్యవంతులూ పడే ఆ దిగులు చూడండి - మహజాలేస్తుంది. హాలీవుడ్ మనుషులు జనసామాన్యం కంటె రూపవంతులై ఉంటారు; కాని వారి రూపానికి విలువ ఉన్నట్టు తోచదు. కనుముక్కు తీరు బావున్న యితరులు వారికంటె రూపవంతులుగా మన కళ్లకి కనిపిస్తారు - ఎంచేతనంటే, ఈ రెండవవారిది వ్యక్తిత్వంగల రూపం. ఏ వస్తువుకైనా సరే విలువలేదని ఎవరూ అనరు; ఉపయోగాన్నిబట్టి దాని విలువ నిరూపిత మవుతుంది - అంతేగాని స్వతహాగా ఏమీ ఉండదు. డబ్బుకి విలువలేదనడం తెలివి తక్కువ - డబ్బుతో ఎన్నో మంచిపనులు చేయవచ్చు. అలా అని, డబ్బు వ్యక్తిజీవితంలోకి 'మంచి'ని తీసుకొస్తోందా ?

•

ఒక ఖైదీ విషయంగానీ ఒక రోగిష్టిమనిషి విషయంగానీ తీసుకోండి. అతను తనకి అతీతమైన పరిస్థితుల మధ్య చిక్కుకుని వుంటాడు. వాటిని ఛేదించేందుకై అతను ప్రయత్నిస్తూ వుంటాడు. సర్వసామాన్యంగా డబ్బు కోసమూ సాంఘిక గౌరవం కోసమూ శ్రమించే మానవుడు, విపత్కర పరిస్థితులలో యిరుక్కున్నపుడు డబ్బు గురించీ సాంఘిక గౌరవం గురించీ మర్చిపోతాడు. యుద్ధకాలంలో యిటువంటి బంధనే, సైనికుల్ని ఒకేతాటిమీద నడిపిస్తుంది. యుద్ధము పరమ వినాశకరమైనదన్న సంగతి నిజమే కాని కొందరిలో నిద్రాణంగావున్న ఉత్సాహశక్తుల్ని అది మేల్కొల్పుతుంది. అందరి బాధలో తమ బాధ మర్చిపోయి, అందరి కోసం ఉన్నతభావంతో మసిలేందుకు ప్రయత్నిస్తారు మనుష్యులు. శాంతియుత కాలంలో జనసామాన్యంలో, యిటువంటి ఉన్నతభావం కలిగేటట్టు చేయలేకపోవడం, మన నాగరికతలోని లోపం - మన దురదృష్టం. నోటితో పైకిఅనకపోయినా మన నాగరికతలో చాలామంది యుద్ధోన్ముఖులై ఉన్నారు. 'ది బెస్ట్ యియర్స్ ఆఫ్ అవర్ లైఫ్స్' (మన జీవితంలోని మంచి రోజులు) అని యుద్ధకాలపు చిత్రానికి పేరు పెట్టడంలోనే మన స్వభావం తెలిసిపోతోంది.

లక్షలాది ప్రజలు యుద్ధంపట్ల ఉత్సాహితులై వుండటానికి మూలకారణం ఏమిటంటే, యుద్ధము వారి సర్వసామాన్య జీవితాలకి ఒక ప్రత్యేకతని అపాదిస్తుంది. కర్షకుని పని, కార్మికుని పని, ప్రతిఒక్కరి పని యుద్ధంలో పొందగల అంతిమ విజయానికి ఎంతో అవసరమనిపిస్తుంది ఆ యుద్ధ

కాలంలో. దీనివల్ల మానవ జీవితానికి సంబంధించిన ఒక అపూర్వ సత్యం తెలుసుకోగలుగుతున్నాం మనం. ఆధ్యాత్మికంగాగానీ, దైహికంగాగానీ మానవుడు ఎంతటి కష్టనిష్టూరాలనైనా వోర్చుకోగలడుగాని 'అర్థరాహిత్యాన్ని' (మీనింగ్ లెస్‌నెస్) మాత్రం భరించలేడు. ఏదో ఒక మార్గంలో మన జీవితానికి విలువ కనిపించాలి, మన ప్రత్యేకత గుర్తింపబడాలి - లేదా, మనకి మతిపోతుంది. బాధలవల్లా, రోగాలవల్లా, తలకిమించిన బరువులవల్లా హాని జరగడం లేదు - 'చిన్నచూపు' (ట్రివియాలిటి) మానవుని పాలిట శత్రువు. తమ అవసరంలేదనీ, తమతో ప్రయోజనంలేదనీ, తమ జీవితాలకి అర్థంలేదనీ స్త్రీ పురుషులకి అనిపించడం కంటె ఘోరం మరొకటిలేదు.

మన జీవితాలు తరిచి చూసుకుంటే, మనలో చాలా మంది మనకి రాదగ మృత్యువు గురించి భయపడము; మన ఆత్మీయులకి మృత్యువు వస్తుందేమో అని భయపడతాము. "ఈ బ్రతుకుకంటె చావు మేలు" అని తాత్కాలికంగా అనిపించే దుర్భర పరిస్థితులు, చాలా మందికి అనుభవమయ్యే వుంటాయి. మరణంతోగాని లక్ష్యాన్ని అందుకోలేమని అనిపించినప్పుడు, మృత్యువుని రెండు చేతులా ఆహ్వానిస్తూ ముందుకి వెళ్ళేవారు వున్నారు. సెయింట్ ఎక్సూపెరె యుద్ధభూమిలో పడిపోవడానికి ముందు ఒక స్నేహితునికి ఈ విధంగా వ్రాశాడు: "ఈ యుద్ధంలో చనిపోతానను భయం నాకు లేదు...భౌతికమైనవి వున్నా వూడినా నాకు అవసరంలేదుకాని, ఈ పరిస్థితులు ఈవిధంగాగాక మరొక

క్రమతలో ఉండాలనే లక్ష్యంకోసం, ఈ నా పోరాటం." ఒక లక్ష్యంకోసం ప్రాణాలు అర్పించడంలో అందమూ ఆనందమూ ఉన్నాయి. స్వల్ప సౌఖ్యాలకోసం జీవన మధువుని వొలకబోసుకోవడం అవివేకం. ఈ ప్రకరణ ప్రారంభంలో బెనెట్ చెప్పినట్టు చాలామంది అవిధంగానే జీవితాలు వృథా చేసుకుంటారు.

చేతినిండా తగుపని లేక ఏరోజుకారోజు, - ఈ రోజు ఎలా గడపడం ? - అని వాపోయే మనుషులు మృత జీవనులు. జీవించదలుచుకున్నవాడికి చేసేందుకు చేతినిండా పనులే! చేయవలసినవెన్నో యింకా మిగిలిపోతూనే వుంటాయి. రిటైరవడమంటూ వుండదు అలాటివారికి. ఒక మంచి పని చేస్తున్నానని భావించే మనిషి, అది చెయకుండా ఎలా వుండగలడు? - వుండలేడు. 85 ఏళ్ళు జీవించిన రూఫస్‌జోన్స్ అను తత్త్వవేత్త, తను చనిపోయేనాటి వుదయం, తన ఆఖరి పుస్తకం ప్రూఫులు చూసుకున్నాడట. జీవించడమంటే ఆ విధంగా జీవించగలగాలి.

మనగురించే మనం 24 గంటలూ తలపోస్తూ, మన బాధలతో మన ఏడుపులతో సతమతమవుతూండటంవల్ల జీవనోత్సాహం కలగదు. మనకి మనం గొప్పవాళ్లమని ఎన్నిసార్లు చెప్పుకున్నా, నిజానికి కాలేము. కాము అని మనకే తెలుసు లోలోపల. మన బాధలూ మన ఏడుపులూ కొంచెం వెనక్కి నెట్టడంతో, మన జీవితానికి ఒక స్వల్ప ప్రత్యేకత ఏర్పడుతుంది. అప్పుడు అ ప్రత్యేకతని ఒక ఆదర్శం వైపు

తిప్పుకోవాలి. అన్ని ఆదర్శాలూ ఒకే విలువ కలిగి వుండవు. కాని మనస్తత్వ రీత్యా ఏ ఆదర్శమూ లేకుండా వుండటం కంటె యేదో ఒకటి వుండటం మంచిది.

నైతిక తత్వ పరిశీలనలో, యిప్పుడొక తమాషా అయిన చోటుకి వచ్చాము. సౌఖ్యమనేది మనలోనుంచి వస్తుంది; అలాగే బాధావహమైన సౌఖ్య లేమికూడా మనలోనుంచే వస్తోంది; - మనగురించి మనం ఎక్కువగా తలపోయడం వల్ల అసౌఖ్యం కలుగుతోంది. మన మనసు మనని సుఖ పెట్టగలదు, క్షోభ పెట్టగలదు. ఇందులోని పరమ రహస్యం ఎక్కడ వుందంటే, మనం మనగురించిగాక, యితరులకి క్షేమదాయకమైనవి - ఆలోచించడం వల్ల, మనసుని హాయిగా ఉంచుకోగలుగుతున్నాము - అదే జీవన క్రమత.

ప్రతి వ్యక్తిలోనూ దేవదానవులు వున్నారనీ, ఆ దేవ దానవ సంగ్రామం మానవ హృదయంలో నిరంతరమూ జరుగుతూంటుందనీ ప్లాటో మహాశయుడుకూడా అన్నాడు. మన అంతర్యంలోని ఆశలూ కోర్కెలూ ఉద్దేశాలూ ఉద్రేకాలూ పరస్పర వైరుధ్యంతో ప్రకోపిస్తూంటాయి. వీటన్నిటికీ మన అంతర్యంలోనే సమాధానం సమకూర్చుకోగలగడం, అంత తేలికగా అయేపని కాదు. మన సహజ వాంఛలని అనుసరించి నడవడం కూడా అంత మంచిది కాదు - ఎంచేతనంటే, ఆ కోర్కెలు అనంతం. అదీగాక ఇవి ఒకదానితో ఒకటి పోటీపడుతూ వుంటాయి. బడాయి చెప్పుకోవాలనే కోర్కె ఒక పక్కన ఉంటుంది; మనం చెప్పినది నిజమంటూ, అందరూ ఆమోదం తెలపాలని మరొక పక్కన

ఉంటుంది. ఒడలు సిసిమెలా అవుతుంది? రెండూ ఒకదాని కొకటి వ్యతిరేకం కదా!

వ్యక్తి జీవితంలో సామరస్యమనేది, వ్యక్తి తన స్వంత వాటికిగాక, బయటనున్న దేనికో తన జీవితాన్ని అంకితం చేయగలిగినప్పుడు కలుగుతుంది. ఆ సామరస్య సాధనలో స్వంతమనుదాని గురించి మర్చిపోవాలి. ఆదర్శం పట్ల ఏర్పడే గురివల్ల ఆ మరుపు దానంతటదే వస్తుంది. సామరస్య సాధనవల్లనే వ్యక్తిలోని విభిన్న శక్తులు ఏకోన్ముఖ మార్గాన నడవగలుగుతాయి. ఒక ఆదర్శానికి ఆత్మార్పణ చేసుకోవడంవల్లనే వ్యక్తి, సామరస్యాన్ని సాధించి, స్వలాభం మర్చిపోగలుగుతున్నాడు.

చాలామంది స్త్రీ పురుషులు తమలోని మమత వెలుపలకి ప్రసరింపజేసి 'స్వంతం' మర్చిపోగలుగుతున్నారు. ఆ మమత ఒక ఉద్యమంపట్ల కావచ్చు, ఒక వ్యక్తిపట్ల కావచ్చు, ఒక ఆదర్శంపట్ల కావచ్చు, ఒక సంస్థపట్లకావచ్చు. తీవ్రతరమూ ఉత్తేజపూరితమూ అయిన ఆ మమతా బంధనలో వ్యక్తి తన కష్టసుఖాలు మర్చిపోయి, సమరస భావుడవుతున్నాడు. లక్ష్య సాధనలో నిమగ్నులైవున్న మనుషుల్ని, కీర్తికాంత కూడా వెనక్కి లాగలేదు. వారి సాధన పవిత్రమైనప్పుడు, పేరు ప్రతిష్టలు పేలవంగా కనిపిస్తాయి. ఆదర్శంపట్ల వుండే భక్తి విశ్వాసాలకంటె కీర్తి మీద కోరిక ఎక్కువ అయిందంటే, అది ఎప్పటికైనా ప్రమాదకరమే! కాని చాలామంది కొంత వరకూ ప్రయాణం చేసి, దభీలున పడటం కూడా మన

విరికలో ఉన్నదే! ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, లక్ష్య సాధన వ్యక్తిని అధిగమించాలి.

మనశ్శాంతిని గురించిన పుస్తకం శ్రద్ధగా చదివినంత మాత్రాన, మనశ్శాంతి లభించక పోవచ్చు. కాని మనకి మనం ఒక కుటుంబంలో ఒకరిగా, ఒక కాలేజిలో ఒకరిగా, ఒక ప్రభుత్వంలో ఒకరిగా అర్పితం చేసుకున్న నాడు, ఆ మనశ్శాంతి మనకి దొరుకుతోంది. మనశ్శాంతికోసమని పని గట్టుకు వెతికితే అది దొరకదు. సంగీత సాధనలో, రచనా వ్యాసంగంలో, పొలం పనీ, తోట పనీ మొదలైనవాటిలో అది మనకి కనపడకుండా దాక్కొని ఉంటోంది. ఈ పనులు, ఒకనాడు కాకపోతే ఒకనాడైనా, మనశ్శాంతి నివ్వడం మనం చూస్తున్నాము. నైతిక నిర్ణయాలకి ఆత్మ పరిశీలన అవసరం - అదిలేని నాడు మనిషి మనిషే కాదు. ఆత్మ పరిశీలనలో నిష్పాక్షిత వున్ననాడే అది వుపకరిస్తుంది. ఒక మనిషి మరొక మనిషికిగానీ లక్ష్యానికిగానీ తనని తను అర్పితం చేసుకోవడం లోనే 'అహం'ని జయించగలుగుతున్నాడు.

జోసయా రాయిస్ వ్రాసిన 'ది ఫిలాసఫీ ఆఫ్ లాయల్టీ' అను గ్రంథం ఈనాడు బహుళ ప్రచారంలో లేదుగాని నలభై ఏళ్లక్రితం అది ఒక ఉత్కృష్ట రచనగా భావింప బడింది. "నీ లక్ష్యమేదో తెలుసుకు, దానికి సేవ చేయడం లోనే నైతిక వ్యక్తిత్వం అబ్బుతుంది ...... ఏకొద్ది మందికో సాధ్యమయే 'మంచి' గురించి మనం మాట్లాడుకోవడం లేదు... మహా నాయకులను ఋషులను గురించి కానే

కాదు... ఆ మాటకొస్తే నైతిక ధర్మానికి అందరూ సరిసమానులే - బలవంతులు బీదవారూ అని తేడా లేదు. నమ్మిన లక్ష్యంపట్ల అకుంఠిత విశ్వాసం వుండటం అవసరం," అన్నాడు రాయిస్.

మనిషి తనకి తానుగా తృప్తిపడడు; ఎవరికో దేనికో తను ముడిపడినట్లుగా భావిస్తాడు. మానవుడే ఈ మహాసృష్టిలోని మొట్టమొదటి వ్యక్తిస్వరూపము. కోటానుకోట్ల స్త్రీ పురుషులు ఎవరికి వారుగా విభిన్నవ్యక్తులు, మానవునిలో వ్యక్తిత్వమనేది ప్రథమఅంశ. శ్రేయోరాజ్యానికి వినియోగపడదగు పదార్థ సముదాయంగా ఈ వ్యక్తులని భావించలేము. వారొక విస్తృతసంఘములోని సభ్యులు. మనుషుల్ని వస్తువుల్లా వాడుకున్న నాయకులు లేకపోలేదు; అటువంటి దేశాలూ లేకపోలేదు. అడపాదడపా మానవుడు ఆటవస్తువు మాదిరిగా అయే పతనావస్థకి వస్తూనేవున్నాడు. మళ్లీ ఎప్పటికప్పుడు తేరుకుని తన వ్యక్తిత్వంకోసం ప్రాకులాడుతున్నాడు.

వ్యక్తులు, తమ వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోకుండా, సంఘంలో జీవించడం ద్వారానే వ్యక్తికీ సంఘానికీ సామరస్యం కుదురుతోంది. ఆ వ్యక్తిప్రకాశతే వారిలోని స్వార్థపరత్వాన్ని కబళించగలుగుతోంది. దేనికి, ఎందుకు అను ప్రశ్నలు తన జీవితం గురించి కలిగినప్పుడే మానవుడు, వ్యక్తిపరిపూర్ణతకి సన్నిహితుడవుతున్నాడు. మనమొక లక్ష్యానికి కట్టుబడి వున్నప్పుడు, మన సమస్తమూ ఆ లక్ష్యసాధనకిగాను ధార

పోస్తాము. లక్ష్యానికి కట్టుబడివుండటమనేది, సామాన్యజీవితాన్ని పరిమళభరితంగా చేస్తుంది.

ఇప్పుడీ నాడు హిట్లరువల్ల, నాజీ సేనలవల్ల ప్రపంచ ప్రజానీకానికి తీరనినష్టం కలిగిందని అంటాము. నిజమే. కాని, ఆ హిట్లర్ ఒకతరం వారిని, తను అనుకున్న లక్ష్య ప్రకారం తయారుచేశాడు. అందుకు పది పదిహేనేళ్లు పట్టింది. జీవనగమ్యం తెలియక బాధపడుతున్న జర్మన్ యువకులకి, 'యిదిగో గమ్యం' అంటూ నాజీ విధానం ఎరగా చూపించాడు. చూపబడ్డది తప్పుదోవ. కాని ఏదో ఒక దోవకోసం అల్లాడారు ఆ నాటి యువకులు. చెడుదోవ కాబట్టి పాపఫలితం అనుభవించవలసివచ్చింది – అది వేరు విషయం.

వ్యక్తి జీవితానికి ఒక లక్ష్యం వుండాలని అనుకున్నాము కదా ! లక్ష్యం వుండటం ఎంత అవసరమో, ఆ లక్ష్యంపట్ల మనకి విశ్వాసం వుండటంకూడా అంతే అవసరం. జోసయా రాయిస్ తన గ్రంథంలో ఈ విశ్వాసధర్మం గురించి ఎంతగానో ముచ్చటించి, మానవసౌభాగ్యత ప్రధానంగాలేని లక్ష్యాలు 'పరస్పరవైరుధ్యం' కలిగివుంటాయి కాబట్టి, అవి ప్రజలకి కీడుచేస్తాయని తత్వనిరూపణచేశాడు. ఎవరికీ హాని చేయనిలక్ష్యమే ఉత్తమోత్తమలక్ష్యం - అన్నాడాయన. కాని మనం తలపెట్టే ప్రతిపనీ కొద్దో గొప్పో యితరులకి కష్టం కలిగించవచ్చు – అలాటప్పుడు ఏందారి ? "సాధ్యమైనంత వరకూ మనలక్ష్యం ఎక్కువమందికి మేలుచేయగలిగినదై

ఉండాలి. తద్వారా మానవులలో 'మంచి'ని పెంచగలుగుతాము," అన్నాడు రాయిస్.

మన స్తత్వరీత్యా వ్యక్తికి లక్ష్యమనేది వుండాలేగాని, ఆ మీదట అది మంచి అయినా చెడుఅయినా, నడక ఒకటే. అలా అని 'చెడు'ని ప్రోత్సహిస్తామా? మానవసంఘానికి ఏది 'మంచో' తెలుసుకోవాలి. ఒకదేశం మరొక దేశంమీద, ఒకవర్గం మరొక వర్గంమీద, ఒకజాతి మరొక జాతిమీద చేసే దురన్యాయాలు 'చెడు'లోకి వస్తాయి. మానవతే మంచితనం. ప్రతివ్యక్తీ, వ్యక్తిజీవనసామరస్యంతో, ఈ ప్రపంచ యాత్రలో, తనకీ ఒక పాత్రవుందని విశ్వసిస్తూ ముందుకి సాగాలి. అదొక పెద్ద ఊరేగింపు; ఆ ఊరేగింపుచూసి ఆనందిస్తూ, అందులో మనం కలిసిపోవాలి.

కాలస్వభావానికి అతీతుడు·కావాలనే తృష్ణమానవునిలో అదినుంచీఉంది; తను వెళ్లిపోయాక కూడా తనపేరుమీదుగా నిలిచే యిళ్లూ, ధర్మసత్రాలు మొదలైనవి సమకూర్చుకోవడం అలవాటు. ఓడలూ, ఒంటెమార్గాలూ, దేవాలయాలూ మానవునిలోని ఈ తృష్ణని ఎంతగానో విశదీకరిస్తాయి. వ్యక్తిజీవితం కాలస్వభావాన్ని అతిక్రమిస్తేగాని మానవునికి తృప్తిలేదు. తను మరణించాక తన గురించినది కొంత మిగలాలి; అందుకోసం తన 'అహం'ని జయించి లక్ష్యానికి దాసుడవుతాడు. తన జీవితకాలంలో ఎదిగి, తనకి నీడ నివ్వలేని చెట్లని నాటడం, ఏ నాడైతే మానవుడు ప్రారంభించాడో, ఆ నాడే జీవనలక్ష్యం గురించిన పరమరహస్యం తెలుసుకున్నాడు.

# 3

# బాధ్యత

మనసుని తేలికగా, చేసుకోవడం కాదు; బరువు మోయగల శక్తి మనసుకి యివ్వాలి.

— *టి. యస్. ఎలియట్*

నేటి కాలగమనంలోని ప్రభావాలు అందరిపట్ల ఒకేమాదిరిగా ఉన్నాయి. ప్రభావాలు ఒకటేకాని, వాటిని ఎదుర్కోగల శక్తి ఆయా వ్యక్తుల్నిబట్టి మారుతూ వుంటుంది. చాలామందిలో ఎక్కువగా కనిపించేది పలాయనత (ఎస్కేప్); ముఖ్యంగా బాధ్యతలపట్ల ఈ పలాయనత మరీ ఎక్కువగా అగుపిస్తుంది. రోజులు సక్రమంగా లేవు; వ్యక్తిని నిలదీసి ప్రశ్నించే సమస్యలా అనంతం; అంచేత, వ్యక్తి అసహాయుడవుతున్నాడు. ఏ ఒక్కటీ స్థిరమని నమ్మకునేందుకు వీల్లేకుండా వుంది. ప్రజానాయకులను పేరిట కొందర్ని ఎన్నుకుని, పెద్ద విషయాలన్నీ వారికి వొదిలేస్తున్నాము.

సామాన్యులు అసంపూర్ణమైన మనోధర్మాన్ని (ఇంటెరిమ్ మెంటాలటీ) అలవరుచుకుంటున్నారు. బుద్ధిపూర్వకంగా కాకపోయినా, ఏదో ఒక విపత్తు ముంచుకొస్తున్నట్టు భయపడటం వారికి అలవాటైపోయింది. 'ఈ సుఖము లెన్నాళ్లు?' అను తత్వంలో చాలామంది కుంగిపోతున్నారు. అసంపూర్ణ మనోధర్మం, ఫలానాఅని పైకి స్పష్టంగా కనిపించకపోయినా, ప్రవర్తనలో ఒక భాగమైపోతుంది. చాలామందికి ఈజీవితం, ఎన్నో బాధలతోటీ వేదనలతోటీ నిండివున్న నిరంతరసమస్య; ఆ సమస్యని పరిష్కరించడం తేలికగా అయ్యే పనికాదు; అంచేత, అక్కడనుంచి పలాయనం చిత్తగిస్తారు. యువకులకేగాక పిన్నలకీ పెద్దలకీ కూడా 'రేపటి' గురించిన తలంపు

లేదు. "కడుపునిండా తిని, కమ్మగా తాగి, హాయిగా గడి పెయ్; రేపు ఏమికానుందో ఎవరికి తెలుసు?" అను తత్వం ప్రజానీకానికి వరవడిగా తయారైంది. "అయిదారు సంవత్స రాలపాటు కష్టపడి ఏ యింజనీరింగో, మెడిసినో, మరొకటో చదువుకుంటే మాత్రం వొరిగే మహద్భాగ్యం ఏముంది? మర ఫిరంగుకి ఫలహారం (కానన్ - ఫొడర్) అవడమేగా పర్యవ సానం? ఆ మాత్రం దానికోసం ఈ శ్రమఅంతా దేనికి – బతి కిన నాలుగు రోజులూ సుఖంగా వుండక!" అని అడుగు తున్నారు యువకులు. "పెళ్లిచేసుకు ఒక యింటిదాన్ని అవాలనే సదభిలాషతో నేను వుంటే మాత్రం, నేను ప్రేమిం చిన ఆ యువకుడు వెనక్కి తిరిగివస్తాడనే నమ్మకమేమిటి?" అని అడుగుతోంది నేటికాలపు యువతి.

మన సాంస్కృతిక జీవనంలో పలాయనత యింత ఉప ద్రవకరంగా అలుముకుపోయింది. ఆ పలాయన వాదాన్ని పోషించగల పద్ధతిలోనే మన కళలూ కాలక్షేపాలూ రూపొందుతున్నాయి. వినోద వ్యాపారంలో (ఎంటర్‌టెయిన్ మెంటు) ఈ పలాయనత వేళ్ళుపాతుకు నిలబడిపోయింది. తద్వారా వినోదం అనేది ఒక భారీవ్యాపారంగా తయారైంది. డిటెక్టివ్ కథలద్వారా, రేడియో కథల ద్వారా, సినిమా టెలి విజనులద్వారా ప్రజలు ఈ పలాయన వాదాన్ని ఎంచక్కగా పోషిస్తున్నారు. పై చెప్పిన నాలుగూ ప్రజని చక్కగా జోకొట్ట గలిగిన సాధనాలు. కష్టసమయంలో మానవులు పలాయన వాదులవడం కొత్త సంగతి కాదు; కాని ఆ పలాయనతకి దోహదకారి కాగల సాధన సంపత్తి యింత ముమ్మరంగా

ఎప్పుడూ వుండేదికాదు. నైట్ క్లబ్బులకీ సినీమాలకీ అమితంగా డబ్బు రావడానికి మూలకారణం, ప్రజానీకానికి తమ జీవనవిధానంలో అర్ధం కనిపించకపోవడమే. చాలా మంది స్త్రీ పురుషులకి తమ జీవితాలు అర్ధరహితంగా తోచడంవల్లనే, వినోదమో అంటూ యింత వెర్రిగా వాపోతున్నారు. చేతి నిండా పనివున్నవారు వినోదంపట్ల వేలంవెర్రి కనబరచరు. ప్రజలలోని పలాయనత, వినోద వ్యాపార చక్రవర్తులకి బంగారు తొడుగు తొడిగిస్తోంది.

వెనకటి రోజుల్లోని మనుష్యులు మాదక ద్రవ్యాలు (ఆల్కొహాలిజమ్) సేవించి తమ కష్ట భారాన్ని మర్చిపోతూండేవారు; తమ స్వల్పత్వాన్ని మర్చి పోయేందుకు అదొక మార్గంగా వుండేది. ఈనాడు గ్రేట్ బ్రిటనులో తాగుడు చాలా మట్టుకు తగ్గిందట; కాని, సినీమాలు చూసేవారి సంఖ్య పెరిగింది. ఏది మంచి, ఏది చెడ్డ అని నిర్ణయించేందుకు కాదు; మానవులు ఒక పలాయనత నుంచి మరొక పలాయనత వైపుగా ప్రయాణిస్తారు. ఏదో ఒక మాదిరిది వుండాలి – లేకపోతే కుదరదు.

పలాయనత మొట్టమొదట భావ ప్రపంచంలో ప్రవేశించి ఆపైన క్రియా రూపం దాల్చింది. మాట మాత్రమైన సంప్రదాయ సిద్ధాంతాలు మాట్లాడుతాముగాని వీటికి కార్య రంగంలో ఆకృతి కల్పించము. పాశ్చాత్య ప్రపంచంలో ఈనాడు ఎన్నో ఘనసూక్తులు వినపడుతూంటాయి. అవి ఆ నోటా ఆనోటా గాలిలో తేలుతాయే తప్ప, వాటిపట్ల ఎవరూ బాధ్యతా భావం వహించరు.

ఉదాహరణకి :

1) భగవంతుడు మనని ఎలానూ క్షమిస్తాడు గనుక మనం ఏవిధంగా బతికితేనేం ? ?

2) సుగుణము లన్నిటిలోకి సహనము గొప్పది; ప్రతి విషయానికీ ఏదో ఒక హేతువు ఉంటుంది కాబట్టి అన్నిటి పట్ల మనం సహనం కలిగి వుండాలి.

3) నీతి అనేది దేశకాల పరిస్తితులకి లోబడి వుంటుంది; అంచేత, ఎవరి నీతి వారికి గొప్పది; అందులో ఎక్కువ తక్కువలు లేవు.

అందరి మనసులోను పాపభీతి ఎక్కడో అట్టడుగున వుంటుంది. ఈ పావ భీతి (కన్విక్షన్ అఫ్ గిల్ట్) మనస్తత్వ శాస్త్ర రీత్యా వివిధ రూపాలు తీసుకుంది. తప్పు అనగా యేమిటి - పరిస్తితులే కారణం, అని సరిపెట్టుకుంటూ వెళ్తే, మానవునిలోని 'గిల్ట్ కాంప్లెక్స్' మాసిపోతుంది. అమెరికను లకి ప్రస్తుతం వున్న మనోభిప్రాయాలు పట్టి ఆలోచిస్తే, ఒక వ్యక్తి మరొక వ్యక్తి విషయంలో నైతిక నిర్ణయం చెప్ప లేడు. లంచాలు పుచ్చుకునే ప్రభుత్వ ఉద్యోగినైనా, పీకలు నులిమిన హంతకుడినైనా, నైతికంగా ఖండించడం అమెరిక నులకి తెలియదు. అపని ముద్దాయి ఎందుకు చేశాడో ఆలో చించబోతారు; అటువంటప్పుడు నైతికమైన తీర్పుకి అర్ధ మంటూ యేముంటుంది ?

సహనము సద్గుణమనే భావన, ఉద్రేక పరిస్థితులలో మనుషుల్ని ఉదాత్తులుగా ప్రవర్తింపజేసేందుకు జనించి వుంటుంది. 'అందరినీ అర్థంచేసుకో'–అనుసూక్తి, ఆ 'అందరినీ' మన్నించడమే అవుతుంది. అర్థం చేసుకోవడమనేది, ఏదో చాలా మంచిపని అని, ఈనాడు అందరూ విశ్వసిస్తున్నారు. మంచిదే అని ఒప్పుకుందాము. అటువంటప్పుడు మార్క్సిస్టులు మన జీవనవిధానం వక్రగతిని నడుస్తోందని అనుకోవడంలోనూ, జర్మను పోలెండు దేశాలలోని యూదులని నాజీలు నాశనంచేయడంలోనూ, డబ్బుకోసం పిల్లల్ని అపహరించేవారి చేతలలోనూ, తమాషాకోసం పసిపిల్ల పీక నులిమే పిచ్చివాని ఉత్సాహంలోనూ ఏది ఎంతవరకూ పొరబాటో ఏ లెక్కన చెప్పగలము? ఒకానొక పరిస్థితికి గల 'హేతువులు' విచారించి తీర్పు చెబుతున్నాము. ఈ 'హేతువులు' మన తీర్పుని, యిటు కొంచెం అటు కొంచెం కదుపుతున్నాయి. ఒక క్రిమి (జెరమ్) వుందనుకోండి; ఆ క్రిమిని మనం తిట్టము; దాని చరిత్ర తెలుసుకుంటాము. అదే విధంగా మానవుని విషయంలోనూ చేస్తున్నాము. ఒకడు దొంగ ఎందుకవుతున్నాడు? - అతని బాల్యంలోని దుర్భర పరిస్థితులవల్ల అలా అయాడు. మరొకడు స్వార్థపరుడవటానికికూడా అదేరకమైన కారణం. ఈ సిద్ధాంత ప్రకారం, హిట్లర్ ఆ విధంగా ఎందుకు అయాడూ అంటే, అతను ఆస్ట్రియాదేశంలో పొందిన అనుభవాల ఫలితంగా. యూదుల మీద హిట్లర్‌కి ఎందుకంత కోపం అంటే, మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత అతనుపడ్డ అష్టకష్టాలవల్ల. పరిస్థితులని బటి ఫలితాలు రూపొందుతాయి. అంచేత, ఎవరినీ ఏమీ

అనలేము. ఈ సిద్ధాంత ప్రకారం ఒకరు మరొకరిపట్ల నైతిక మైన తీర్పు చెప్పలేరు - చెప్పకూడదు.

ప్రస్తుత స్తితిగతుల్ని మనం అపహాస్యం చేయడంకాదు - ఉండటమదేవిధంగా ఉంది. ఈ దృక్పథం సామాన్య స్త్రీ పురుషులకేగాక నేరవిచారణలో, న్యాయాధికారులకీ తీర్పు దారులకీ (జూరీన్)కూడా ఉంటోంది. మనస్తత్వ విషయాలు ప్రధానమైనప్పుడు, ఈ దృక్పథం ప్రబలంగా ఉంటోంది. కొన్ని హత్యకేసులలో తీర్పుదారులు నిందితుడు హత్య చేయడం విషయమై సందేహపడటంలేదు; 'ఆ నిందితుని, ఆ హంతకుని బాధ్యత ఎంతవరకు?' అని తర్జన భర్జనలు సలుపుతున్నారు. ఇటువంటి సందర్భాలలో తీర్పు, పరిస్తి తుల్నిబట్టి నిర్ణయింపబడుతోందిగాని నేరానికి తగు శిక్ష పడటంలేదు. ఈ విధంగా మనం, నేర నిర్ణయాన్ని మనస్త త్వానికి ముడిపెడితే, కాలక్రమేణా న్యాయమనేది నవ్వుల పాలవుతుంది.

ఇటువంటి భావనాక్రమత వల్లనే పాశ్చాత్య సంఘంలో 'తేలిక మనసు' (ఈజీ కాన్షన్స్) ఉద్భవమందింది. "నీతి అనగా సాంఘిక పరిస్తితులబట్టి యేర్పడుతుండి; ఏ సంఘా నికా సంఘం, దాని విలువుబట్టి నీతి శాస్త్రం నిర్మించుకుం టోంది. అందరికీ పనికొచ్చే నీతి ఎక్కడా లేదు," అంటూ ఈ 'తేలిక మనసు' సిద్ధాంతానికి జీవం పోస్తోంది నేటి మన స్తత్వ శాస్త్రం, ఇందులో ఫ్రాయిడ్ ప్రభావం ఎంతయినా వుంది. ఈ విషయాలు క్షుణ్ణంగా తర్కించి ఆత్మ పరిశీలన

కుంటే తప్ప ముందుకి అడుగు వేయలేము. ఇది అంత సులువుగా అయేది కాదు; కాని మనకి చేతనైనంతలో ప్రయత్నిద్దాము.

ఇతరులు ఎంత వంకరటింకర పనులు చేసినా, వారి తప్పులు మన్నించాలనుకోవడం సదుద్దేశం అనిపించుకుంటుంది - అందుకు సంశయం లేదు. మనుషులలోని అశక్తతని మనం కనికరిస్తాము. అలా అని, ఒకడు పట్టలేని పిచ్చి కోపంలో హత్యకావిస్తే, - అతని దేహగ్రంధులలోని ఉద్రిక్తత వల్ల కలిగిన అశక్తత, అతనిచేత ఆ పని చేయించిందని క్షమించగలమా? అటువంటప్పుడు నైతిక ధర్మానికి నిలువ నీడ లేదే!!

నిందితులు గర్భదారిద్ర్యం వల్లగానీ, కుటుంబ పరిస్థితులు నికృష్టంగా వుండటంవల్లగాని నేరాలు చేసినప్పుడు, వారివిషయంలో మనం కొంత జాలి చూపిస్తాము - చూపించ వలసిందేకూడా! కాని, నేరపరిశీలనలో యిదే ప్రధానం కాదు; దానిని ఆధారంగా చేసుకు నిర్ణయం జరగకూడదు. ప్రతి సమస్యనీ, సానుభూతిలో చూడటం మంచిదే! ఆ మాటకొస్తే ప్రతి న్యాయ విచారణలోనూ మనస్తత్వ శాస్త్ర వేత్త ఒకడు వుండటంవల్ల నష్టమేమీ లేదు. కాని, అందువల్ల నేరస్తుల సంఖ్య తగ్గుతుందని, ప్రజలలో యేదో వివేకం కలుగుతుందనీ అనుకొవడంలో సబబు లేదు. నేను మా పక్కింటి పెద్ద మనిషిని ఉద్దేశిస్తూ ఒక దుడుసు మాట అన్నాననుకోండి. నేను ఆ 'చెడ్డ మాట' ఎందుకు అన్నానో

తెలుసుకోవడం బాగానే వుంటుంది; కాని ఆ పరిశీలన హేతు మార్గానికి కట్టుబడి వుండదు. నాకు ఆయనని చూస్తే గిట్ట కనో, లేక కోపంవల్లనో ఆ తొందర మాట అనివుంటాను. అనేశాను - బాగానే వుంది. ఆ మాట నేను అనివుండవచ్చా; అని పరిశీలన జరిపినప్పుడు, నూటికి తొంభయి పాళ్లు నేను ఆ మాట అనివుండకూడదనే తేలుతుంది. ఎటువంటి బల వత్తర కారణం వున్నా, యేమాదిరి మానసిక సంక్షోభంవున్నా ఆ మాట అనివుండకూడదని తేలుతుంది. నేను ఎందుకు అన్నానో నాకు తెలుసు; కాని, ఆ అనడం తప్పు, అని నాకు నేను చెప్పుకోవలసి వస్తుంది. మనస్తత్వ సమస్యలు వేరు, నైతిక సమస్యలు వేరు - అని వేటికవి విడమరిచి చెప్పుకు నేందుకు కొంత బుద్ధి సూక్ష్మత, ఆత్మ శిక్షణ అవసరం.

మనస్తత్వరీత్యా మనుష్యుల పనులకి సంజాయిషీలు చెప్పుకుంటూ వస్తే, 'అందరి గురించి "అంతేలే" అనిపించ డమే కాకుండా, మనం చేసేపన్ని మన మనసుకి ఎంతో సబ బుగా కనిపిస్తాయి. మనస్తత్వ ధోరణిలో సమస్తమూ పరి శీలించబోతే, నైతిక నిర్ణయమనేది అర్ధరహితంగా కనిపించి మనం చేసిన వాటికి చేయకుండా పూరుకున్నవాటికీ, మన దైన నైతిక బాధ్యత ఏమీ వుండదు. సిగ్గుపడవలసిన పనిచేసి నప్పుడు నేను చెప్పే సమాధానం ఎలా వుంటుందంటే: "ఆ పరిస్థితుల ప్రాబల్యంవల్ల, వాటికి తలవగ్గి నేను అలా చేశాను. నా స్థితిలో వున్న ఎవరైనా, అదేవిధంగా చేసి వుంటారు." మనం చెసే తప్పుడుపనినుంచి పలాయనం చిత్తగించేందుకు మనసు, చక్కటి సంజాయిషీ ఆ విధంగా

వెతికి పెడుతుంది. 'తేలిక మనసు' సృష్టించిన తత్వోపదేశ మిది. వూగులాడటానికి యిందులో ఆస్కారం లేదు. తను తప్పు చేసినట్టుగా ఎవడూ బాధపడడు; అంచేత, క్షమార్పణ వేడవలసిన అవస్థ అంతకంటె వుండదు. ఈ బాట వెంట ప్రయాణం చేస్తే మనశ్శాంతి లభించకపోదుకాని, ఈ తత్వం లోక వ్యాప్తమైననాడు మన నాగరికత కూకటి వేళ్లతో కూలి పోతుంది.

సులువుగా పదిమందికీ అర్ధమయేట్టట్టు 'భావనాజగతి' వుండాలనే దురభిప్రాయంనుంచి మనం బయటపడాలి. ఆలోచనాప్రపంచంపట్ల వాస్తవదృష్టి అలవరచుకొని, కొన్ని వెర్రిప్రేమలు కట్టిపెట్టాలి. మన స్తత్వశాస్త్రంతో సరిపెట్టుకోక నైతికమనగా ఏమిటో, నైతికధర్మమనగా ఏమిటో తెలుసు కోవాలి. 'ది కాక్ టెయిల్ పార్టీ' అను నాటకంలోని పాత్రలకి వలె తికమకలాడకూడదు. 'డ్యూటీ' అనుమాట నిఘంటువు నుంచి కొట్టివేయడంతోనే మనకష్టాలు ప్రారంభమయాయి, సచ్చరిత్రు లెప్పుడూ 'డ్యూటీ'ని నమ్ముకున్నవారే! ఈ బ్రహ్మాండమైన తుపానులో ఆ పరమసత్యం మరవకూడదు.

'తేలికమనసు' సిద్ధాంతానికి అట్టడుగునవున్న పునాది రాళ్ళు ఎటువంటివా అని కొంచెం కదిపిచూస్తే, కట్టడం ఎంతమాత్రం వూగిసలాడేదీ యిట్టే తెలిసిపోతుంది. చాలా మందికి ఈ నాడు నైతికబాధ్యతలనేవి అర్ధంలేని మాటల్లా కనిపిస్తున్నాయి. నైతికమనుదానికి శాస్త్రీయదృక్పథంవుండ దని కొందరి అపోహ. మరికొందరు తప్పని సరిఅయి నైతిక బాధ్యతలనే వాటిని మాటవరసకి అంగీకరిస్తున్నారు.

రష్యనులు తమది సైంటిఫిక్ దృక్పథమనీ, మిగతా దేశాలప్రజలు సైంటిఫిక్ దృక్పథానికి పూర్వపుదైనకాలంలో జీవిస్తున్నారనీ అనుకుంటారు. సమస్తమూ సైంటిఫిక్‌గా జరుగుతున్నదనీ, పరిస్థితులనిబట్టి పరిణామం చెప్పవచ్చు ననీ, పరిస్థితులు తెలుసుకోవడమే మనవంతు అనీ వారి వాదన. ఆకాశాన మేఘం ఉంది; మన యిష్టాయిష్టాలతో నిమిత్తంలేకుండా అది వర్షకారకమవుతోంది. ఆ వర్షం మనకి కావలసివచ్చినప్పుడూపడుతుంది; అక్కర్లేనప్పుడూ పడుతుంది. సైంటిస్ట్ మేఘంగురించి పరిశీలిస్తున్నప్పుడు 'మన' గురించిన తలంపురానీయడు. మంచిదో చెడ్డదో అది ఒకమేఘం. వాతావరణంలోని కొన్ని స్థితిగతులవల్ల, కొంత సంచలనంవల్ల, ఆ మేఘం ఏర్పడింది; ఏర్పడ్డమేఘం వర్షించి తీరుతుంది - అది దాని స్వభావం. వృక్షశాస్త్రవేత్త కూడా ఆ ప్రకారంగానే చెబుతాడు. చెట్ల విషయంలో మంచీ చెడూ నిర్ణయించడు; ఏ చెట్టు ఏ విధంగా నాటాలో, నాటినచెట్టు ఏ విధంగా ఎదుగుతుందో చెబుతాడు. మానవ జీవితానికి సంబంధించిన శాస్త్రీయదృక్పథం, ఈ ప్రకారమే ఉండాలంటుంది వారి సైన్సు; - మానవప్రవర్తనకి సంబంధించిన కారణాలుతెలుసుకు, ఆ కారణాలమార్పుతో ప్రవర్తననికూడా మార్చవచ్చునంటుంది. రష్యన్ మేధావులకేగాక పాశ్చాత్య ప్రపంచంలోని మేధావులకికూడా ఈ దృక్పథంపట్ల నమ్మకంవున్నట్లు కనపడుతుంది. మనస్తత్వశాస్త్రంలోని 'కండీషన్డ్ రిఫ్లెక్స్'ని రష్యన్ విజ్ఞాని పావ్‌లొవ్ కని పెట్టాడు - మానవప్రవర్తనని అర్థం చేసుకోవడంలో, ఆ సిద్ధాంతం ఎంతగానో ఉపయోగపడిందని, పాశ్చాత్యవిజ్ఞా

సులు కూడా అంగీకరిస్తున్నారు. అమెరికాలోని పాశ్చాత్య గ్రంథాలు ఈ సిద్ధాంతం పరిమితలక్ష్యం కలిగినది మాత్రమే అని అంటున్నాయి.

'కండీషన్డ్ రిఫ్లెక్స్' సూత్రం ద్వారా సమస్యలు పరిష్కరింపబూనడం సులువైనమార్గంలా చాలా మంది భావిస్తున్నారు; దీనికి విజ్ఞానులిచ్చిన ఆమోదముద్రకూడావుంది. తరిచిచూసిన కొద్దీ, యిది తత్వజ్ఞానానికి (ఫిలాసఫి) సంబంధించిన ప్రశ్నగాని సైన్సుది కాదేమో అనిపిస్తుంది - సైన్సుదే అనుకున్నప్పుడు ('డిటర్మినిజమ్'ని), అనగా 'అంతా ముందే నిశ్చయమైపోయింది' అను తత్వవిశ్వాసాన్ని, వొప్పుకోవలసివస్తుంది. 'డిటర్మినిజమ్' అనగా ఒక రకంగా 'విధి' వంటిది. 'విధివశం' అనుదానిని భౌతికతత్వవాదులు ఎంత మాత్రం ఆమోదించరే! వృక్షశాస్త్రజ్ఞుడు చెట్టునాటాడు: చెట్టు మొలిచింది. ఇక్కడి 'చెట్టు' మనిషికి భిన్నమైనది; చెట్టు పెరగడంలో మనిషి ప్రమేయం ఏమీలేదు. సరియైన క్షేత్రంలో మొక్కనాటితే, అది వృక్షమై తీరుతుంది. కాని అన్నిమొక్కలూ, ఏ కారణంవల్లనైతేనేమి, వృక్షాలుకావడం లేదు - అను విషయాన్ని మనం మాటమాత్రంగా వొప్పుకున్నామా, 'నైతికవిలువలు' అనువాటికి ప్రాధాన్యతయివ్వవలసివస్తుంది. సంఘసేవకునికి శాస్త్రవిజ్ఞానంకంటె నైతిక ధర్మంమీద గురి ఎక్కువ ఉంటుంది. బీదసాదల జీవితం బాగుపరచాలనీ, పూరికొంపల స్థానంలో గాలీ వెలుతురూ వచ్చే యిళ్ళు లేవాలనీ అతనుపడే తాపత్రయానికి అట్టడుగునవుండేది నైతికధర్మవిశ్వాసం. ఆ శుభోదయంపట్ల నమ్మ

కమే లేనినాడు, అతను ఆ విధంగా కష్టించలేడు. సమస్త కార్యాలకీ భౌతిక, సాంఘికపరిస్థితులు అనుకూలించాలి. అనుకూలించడమనగా ఆ పనులు చేయగల అవకాశం వరకూ మాత్రమే; ఫలితమెప్పుడూ మన చేతుల్లోఉండదు - మనకి తెలియనిశక్తులు నిర్ణయిస్తూవుంటాయి. ఆ తెలియని శక్తుల వునికిని అంగీకరించి, ముందుకి సాగుతాడు సంఘ సేవకుడు.

తను వేటిని నిర్మిస్తున్నానని మానవుడు అనుకుంటాడో, వాటి నిర్మాణం పూర్తిగా అతనిబుద్ధికౌశలంమీదనే ఆధార పడి వుండటంలేదు. తత్వజ్ఞానంతో విషయపరిశీలన చేస్తున్న పుడు, ఈ నిజం అవగతమవుతుంది. కాని, నిర్మాణకర్త 'విధి నిర్ణయం'లో ఒక భాగం అనితలపోసినప్పుడు మరీ ఘోరం! ఏది న్యాయం ఏది అన్యాయం, ఎవరు దొంగ ఎవరు దొర, ఏది రైటు ఏది తప్పు - ఈ విధమైన విషమా వస్థలోపడి సాంఘిక విలువలు తమ సహజత్వాన్ని పోగొట్టు కుంటాయి. పరిస్థితుల ప్రభావం తనచేత ఆ విధంగా చేయిం చిందంటాడు ప్రతి వ్యక్తి. ఈ సిద్ధాంతం మానవునిలోని సహజ ప్రతిభకి విలువలేకుండా చేస్తుంది; తద్వారా పురుష ప్రయత్నానికే ఎసరుపెడుతుంచి. ఒక లక్ష్యం కోసం తన బ్రతుకుని త్యాగంచేసే వ్యక్తికీ, గాలివల్ల తరుమబడే మేఘ మాలకీ ఎటువంటి తేడా లేనేలేదా ? పై సిద్ధాంత ప్రకారం తార్కికంగాలేదు. 'పరిస్థితుల'వల్ల మేఘమాల తరుమబడు తోంది; 'పరిస్థితుల'వల్లనే త్యాగనిరతుడు అవుతున్నాడు. రెండుచోట్లా 'పరిస్థితుల' ప్రభావమే ప్రధానం. కాని వ్యక్తి

లోనూ బుద్ధిజీవనంలోనూ మానవునికీ మిగతా జీవరాశికీ బ్రహ్మాండమైన తేడాలేదు - స్వల్పమార్పులు మాత్రమే; కాని, నైతికధర్మ నిర్ణయంలో మానవునిదే అందరికంటె పైచెయ్యి. ఉన్నత పరిణామదశకి వచ్చిన జంతువులు, క్షుద్బాధ తీర్చుకునేందుకే తమ బుద్ధిని ఉపయోగించగలుగుతున్నాయి. వాటిమనోధర్మం 'క్షుత్'ని (ఆకలి) ఆశ్రయించుకువుంటోంది. మానవుడు ఆకలిని కొంతవరకూ జయించగలుగుతున్నాడు- తత్ప్రయత్నానికి అతనిలోని నైతికవాంఛే కారణభూతమవుతున్నది. "అది నాకు ఎలా దొరుకుతుంది?" అని అడుగుతాయి ఉన్నత పరిణామదశలోకి వచ్చిన జంతువులు. మానవుడు తనబుద్ధిని యింకొకమెట్టు పైకిపోనిచ్చి, "అది నాకు కావాలా?" అని ప్రశ్నించుకుంటున్నాడు. ఈ రెండు ప్రశ్నలూ పైకి సామాన్యంగా కనిపించినా అంతర్యంలో ఎంతో తేడా గలవి. ఈ తేడాని గుర్తించినవారు 'ఫిలసాఫికల్ యాంత్రొపాలజీ' అను 'జీవధర్మాన్ని అనుసరించే తత్వశాస్త్రం' అభివృద్ధి చెందేందుకు తగు కృషిచేస్తున్నారు. మానవునికీ మిగతా జీవులకీగల వ్యత్యాసం అంగీకరించినమీదటనే గాని, అంతకు ముందు తత్వ పరిశీలన నిష్ప్రయోజనమంటారు వీరు.

అసలు పాశ్చాత్య ప్రపంచంలో 'నైతిక పలాయనత' (మోరల్ ఎస్కేపిజమ్) ఎక్కువగా కనిపిస్తోంది. అది అలా వుండగా గ్రీసుదేశంనుంచీ, పాలెస్టయిన్‌నుంచీ వచ్చి, మన ఆలోచనా క్రమతలో ఒకభాగమైపోయిన మరొక తత్వం ఉంది. ఇది 'ఫాటలిజమ్'ని (విధివాదము) తీవ్రంగా ఖండి

స్తుంది. మానవానుభవానికీ, మానవ స్వాతంత్ర్యానికీ 'ఫాట లిజమ్' వ్యతిరేకి. సమస్తమూ దైవఘటన అని మనం నిస్తేజులమై వూరుకోగలమా ? దైవానికి వొదిలేసి ఏ ఒక్కడూ తన ప్రయత్నం మానుకోడు; అనగా వ్యక్తి తన స్వేచ్ఛని ఉపయోగించుకుంటున్నాడన్నమాట. ఘటనా చక్రంలోని రకరకాల పరిస్థితుల మార్పే, స్వాతంత్ర్యానుభవంగా రూపొందుతోంది. మానవుల నైతికజీవనం అవిధంగా ఉద్భవిస్తోంది.

సణుగుగొణుగులు లేకుండా, లోకంతీరు యిలా అవడంలోని తమ బాధ్యత మనస్ఫూర్తిగా అంగీకరించి, ధైర్యంతో ముందుదారి ఆలోచించగలిగినవారే లోక వ్యవహారాలు ఒక క్రమతకి తీసుకురాగలుగుతారు. పరిస్థితులవల్ల యీప్రకారం చేశాం - అను 'తేలిక మనసు' సిద్ధాంతాన్ని పారద్రోలి, స్వేచ్ఛని అంటిపెట్టుకుండే బాధ్యత భుజాలమీద వేసుకు నవప్రపంచ నిర్మాణానికి పూనుకోవాలి. ఇటో అటో చేయగల స్వాతంత్ర్యం మనకి వున్నప్పుడు, మనంచేసే పనులకి మనంగాక మరింకెవరు బాధ్యులు ? బాధ్యతలేదంటే, మనకి మెదడు వుండీ లేనట్టే అవుతుంది. మేధస్సుకి విలువలేకపోతే మానవునికి విలువ ఏమిటి ? ?

మంచి చెడ్డలు నిర్ణయించుకోగల స్వాతంత్ర్యం మనకి వుందనీ, ఆ స్వాతంత్ర్యానుభవం సత్యస్వరూపంలో ఒకభాగమనీ అంగీకరించేటప్పటికి, మన మనసెందుకనో వ్యాకులపాటుకి లోనవుతుంది. చిన్నప్పట్నుంచీ చేసిన తప్పులు

మనవి కావని సరిపెట్టుకోలేకపోతాము. పరిస్థితులమీద నెపం వేయడానికి అవకాశం లేకుండాపోతుంది; నైతిక ధర్మం మనని నిలవదీసి ప్రశ్నిస్తుంది. అంచేత, అంతరాత్మని శాంత పరిచేందుకు 'తేలికమనసు' సిద్ధాంతంలోకి చర్రున జారి పోతాము; దాంతో మనం, మన నైతికబాధ్యతనుంచి కాపాడ పడ్డట్టుగా భావిస్తాము. పూర్తిగా పరిణామాన్ని పొందిన మను ష్యులు (మెచూర్ మెన్) ఆ విధంగా ప్రవర్తించరు. "అవును ఆపని నేను చేసినదే. నిజమే – పొరబాటే. అటువంటి తప్పు మరొకసారి జరక్కుండా చూస్తాను," అని అంటారు వారు. చేసిన తప్పులు ధైర్యంగా వొప్పుకోగల దృక్పథం ప్రజలలో అలవడినదంటే, లోకమెంతో బాగుపడుతుంది.

'సుజన జీవనము' (గుడ్ లైఫ్) అనగా ఏ ప్రకారం వుండాలి ? - అను విషయంపై ప్రజలందరికీ ఏకాభిప్రాయం లేదు - వుండదుకూడానేమో ! ఎంచేతననగా, సుఖజీవన మనండి, సుజన జీవన మనండి - యిటువంటివి అయా సాంఘిక పరిస్థితులమీద ఆధారపడివుంటాయి. ఆ కారణం గానే, తమ ప్రజలకి ఏది మంచో చెప్పేందుకు మేధావులు బుర్రలు బద్దలు కొట్టుకుంటారు. మొత్తపు ప్రజాభిప్రాయం నుంచి ఒక్క సత్యం మాత్రం గ్రహించవచ్చు. నైతిక ధర్మం ఆమోదించినమీదట, నైతిక దృక్పథం అనేది అందరిపట్ల ఒకేవిధంగా ఉంటుందని. దేశకాలపాత్రలు మారవచ్చుగాని నైతికసూత్రాలు సర్వత్రా ఒకటే - అవి మారవు. విధ్యుక్త ధర్మాన్ని (డ్యూటీ) నిర్వచించడంలో, అదేమిటో విడమరిచి చెప్పడంలో ఒకరితో ఒకరు ఏకీభవించలేకుండా వున్నారు -

పొత్తు కుదరకుండా వుంది. ఒక లెక్కను రైటుగా చేసేందుకు ఒకేమార్గం; కాని తప్పుచేసేందుకు వెయ్యిమార్గాలు. ఈనాడు ప్రతివిషయంలోనూ మనకి అభిప్రాయభేదాలు అనంతంగా కనిపిస్తున్నాయి. మనం కొన్నిపనులుచేసీ, కొన్ని చేయకాకూడా తప్పులు చేస్తాము. అలాఅని, చేతులుకట్టుకు కూచుంటామా ? మనస్థయిర్యంతో ముందుకి నడవాలి; విజ్ఞానతృష్ణతో మానవ హృదంతరాళంలోని జ్ఞానజలధిని మథించవలసి వుంటుందనే విశ్వాసంతో, మనకి సమకూరిన పరిశీలనతో, తార్కికసంపదని వృద్ధిపరుచుకుంటూ ముందుకి నడవాలి. అభిప్రాయభేదాలు ఆత్మపరీక్షకిగాని లొంగవు.

మన కర్తవ్యమేమిటో తెలుసుకోవడానికి పూర్వం, మన మెవరమో, మనం ఏమిటో ప్రశ్నించుకోవడం మంచిది. ప్రతి వ్యక్తి యితర మనుషులతోగల కొన్ని సంబంధ బాంధవ్యాల కూడలి. ప్రతి బాంధవ్యం ఒక బాధ్యతని వెంటవేసుకుంటుంది - అ బాధ్యతని మాటవరసకి 'క్లయిమ్' అందాము. నేను పిల్లల తండ్రిని అనుకుందాం - అటువంటప్పుడు నా పిల్లలకి నామీద ఒక 'క్లయిమ్' ఉంటుంది - ఆ 'క్లయిమ్' నేను కాదనడానికి వీలులేనిది. ఇటువంటి 'క్లయిమ్' పిల్లల విషయంలోనే గాక యితర చోట్లకూడా వుంది. భర్తగా, పౌరునిగా, అప్పు తీసుకున్నవానిగా, విద్యార్థిగా, టీచరుగా, స్నేహితునిగా అనేక రంగాలలో నా బాంధవ్యాలు 'క్లయిమ్స్' రూపేణా కనపడుతూ వుంటాయి.

ఈ క్లయిమ్స్‌ని అర్థం చేసుకుంటూ ముందుకి సాగినప్పుడు, నా డ్యూటీ యేమిటో ఆయా పరిస్థితులని బట్టి

అవగతమవుతుంది. పరిపూర్ణసత్యం మానవులకి బోధపడక పోవచ్చు కాని ఆ మార్గాన్ని వెలిగించగల కాంతి రేఖ ప్రకాశవంతంగా వున్నపక్షంలో మనకి కావల్సినంతమట్టుకు తెలుస్తుంది. 'అది నా జవాబుదారీ కాదు' - అన్నంత మాత్రాన నా బాధ్యతా ధర్మంనుంచి విముక్తి పొందను. సంఘమనేది బాధ్యతలనే పట్టుతాళ్లతో అల్లబడుతుంది - అవి అక్కడ వున్నాయి. లేవంటే ఎలా కుదురుతుంది? ఆస్తి విషయంలోనూ, డబ్బు విషయంలోనూ, అప్పులులేని వాడికి వున్న స్వేచ్ఛ అప్పులుగలవాడికి వుంటుందా? నేను పౌరుణ్ణి అయి, పౌరుడు పొందగల సౌకర్యాలూ సహకార సంపత్తి పొందుతూ, పౌర ధర్మం నేను పాటించనంటే కుదురుతుందా? పాటించి తీరాలి - అదే నైతిక బాధ్యత.

సోక్రటీస్‌కి మరణ శిక్ష పడ్డప్పుడు, క్రీటో అను స్నేహితుడు అతనిని యేథెన్సు నగరంనుంచి పారిపొమ్మని సలహా చెప్పాడు. అలా తాను పారిపోయి ప్రాణాలు కాపాడుకోవడం తను యిన్నాళ్లబట్టీ గౌరవిస్తున్న న్యాయ సూత్రాలకి భంగకర మనే కారణంగా సోక్రటీస్ ఆ పనికి వొప్పుకోలేదు. క్రీటోని ప్రశ్నించాడు సోక్రటీస్ ఈ విధంగా: "నేను యే న్యాయ సూత్రాలని బోల్తా కొట్టించాలని అనుకుంటున్నానో, అవి నన్ను ఈ ప్రకారం ప్రశ్నించాయనుకో: 'సోక్రటీస్, ఏమిటి నీ విషయం ముందు చెప్పు. ఈ న్యాయ సూత్రాలనీ తద్వారా ఈ ప్రభుత్వ ధర్మాన్నీ నీ చేతులారా నువ్వే పడ గొట్టేందుకు సంసిద్ధుడవన్న మాట. మాకు అపచారం చేసి, నువ్వే మమ్మల్ని నీట ముంచుతావా? న్యాయ నిర్ణయాలకి

కట్టుబడని ప్రభుత్వం బతికి బట్టగలదా? తృష్ణాపరులైన వ్యక్తులు అటువంటి ప్రభుత్వాన్ని కూలదోయరూ?' " తనని న్యాయదేవత ఆవిధంగా ప్రశ్నిస్తున్నట్టు భావించాడు సోక్రటీస్. ఇన్నాళ్లబట్టీ యేథెన్సులో వుండి, అక్కడి సదుపాయలన్నీ పొందుతూ - (ఆ సదుపాయాలు ఎలా వచ్చాయి? అక్కడి, సంఘం, 'లా అండ్ ఆర్డర్'కి అనగా చట్టానికీ అధికారానికీ కట్టుబడి వుండటం వల్ల వచ్చాయి) - తనకి కష్టతరమగు పరిస్థితి యేర్పడింది గనక, ఆ న్యాయ సూత్రాలని కాదనగల హక్కు తనకి లేదన్నాడు. తను పొందిన సదుపాయాల కారణంగా, తను ఆ న్యాయాన్ని గౌరవించక తప్పదు. తను ఆ పట్నంలో నివసించడమే తనకీ ఆ పట్నపు న్యాయ ధర్మానికీ మధ్య ఒక 'యింప్లయిడ్ కాన్ట్రాక్ట్' (వ్రాసుకోని ఖరారునామా) - అని అన్నాడు సోక్రటీస్. అతని మహత్తర నిర్ణయం, పాశ్చాత్య ప్రపంచపు నైతికవారసత్వంలో, ఒక ప్రధాన భాగం.

నైతిక జీవనానికి శిఖరాగ్రం వ్యక్తిలోని పరిపూర్ణత. వ్యక్తికి ఈ పరిపూర్ణత యే విధంగా సాధ్యమూ అంటే, అతనిలోని వ్యక్తిత్వం యేకత్వమై వెలుగొందడంవల్ల - తనయందు అఖిల భూతములందు సమంగా వుండమంటారే ఆవిధంగా. సోక్రటీస్ ఆప్రకారమే జీవించాడు, ఆప్రకారమే మరణించాడు. మనం మనకోసమే బతకడంకంటె, యితరులకోసం యితరవాటికీ బతకడంలో వ్యక్తిత్వం విపులీకరణ పొందుతుంది. పూర్ణ పురుషులు బయట తుపానులకి జడవరు; ఎంచేతననగా, వారి జీవన దృక్పథం, లోపలనున్న

ఆత్మ శక్తిని ఆధారంగా చేసుకు ఏర్పడుతుంది. ఈ ఆత్మ శక్తి బహిఃప్రపంచ స్వరూపాన్నీ అందులో తమ స్థానం ఎక్కడ యేవిధంగా వున్నదీ, వారికి చక్కగా తెలియజేస్తూ మనశ్శాంతి చెడకుండా, కల్లోలం ఏర్పడకుండా కాపాడుతూ వుంటుంది. జీవితంలో "నా" స్థానం నావల్ల నిర్ణయమవడం లేదు; నేను యేర్పరచుకున్న బాంధవ్యాలవల్ల నిర్ణయమవు తోంది. ఈ బాంధవ్యాల్ని గౌరవప్రదంగా నేను సంరక్షించుకో గలిగినన్నాళ్లూ, వ్యక్తిగత బాధ్యత విషయంలో ఎటువంటి పేచీలు రావు. నా 'డ్యూటీ' యేమిటో నాకు తెలుస్తూనే వుంటుంది. "నా స్థానము - నా బాధ్యతలు" అను విషయమై తత్వవేత్త బ్రాడ్లే చాలా చక్కగా చర్చించాడు. విలియమ్ టెంపుల్ ఆ విషయాన్ని యీ మాటలలో చెప్పాడు:

"ఒక కుటుంబంలో వ్యక్తిగానూ, ఒకదేశంలో పౌరుని గానూ జన్మించడమనేది మన వ్యక్తిత్వంలో ఒక భాగం - అదెక్కడో బయటనుంచి వచ్చిన విషయం కాదు, మనలో ఒక భాగం. నేను రాజకుమారుణ్ణి అయి పుట్టివుంటే...' అని వాపోవడం నిరర్ధకమైన తెలివిహీనత. నేను ఫలానా ఆయన కుమారుణ్ణి - అని అంగీకరించి ముందు విషయం ఆలోచించాలి. ప్రతి వ్యక్తి తనవెంట కొన్ని బరువు బాధ్య తలు మోయక తప్పదు - అది ప్రకృతి ధర్మం."

మన బాధ్యతలేమిటో మనం తెలుసుకోవడంతో పని పూర్తి కాదు; పూర్ణ పురుషుడు తన్ను గురించే గాక సన్ని హితులను గురించీ యిరుగుపొరుగును గురించీ కూడా ఆలో

చిస్తాడు. మనవాళ్లందరూ సుఖపడితేగాని మనం సుఖపడ లేము - అనగా వారి జీవితాలలో మనం వేలుబెట్టాలనికాదు; వారిదారిని వారిని వెళ్లనివ్వాలి. ఎవరిదారిని వారు నడుస్తూ అందరూ హాయిగా ఉండాలి.

స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు వున్నంతమాత్రాన వ్యక్తివికాసం సంభవనీయంకాదు - వ్యక్తి తనకిగల బాధ్యతలని సంతో షంతో ఆమోదించిననాడే పరిపూర్ణత ఏర్పడుతుంది. 'తన్ను' (సెల్ఫ్) గురించి ఎంత మర్చిపోతే తనకి అంత మంచిది. రాబర్ట్ లూయీస్టీవెన్‌సన్, తను సర్వసామాన్య నైతికవాదినని చెప్పుకుంటూ, ఒకసారి తన పబ్లిషర్‌కి ఈ ప్రకారంవ్రాశాడు:

"ప్రతిఫలం (రివార్డ్) అనేమాట మర్చిపోయి, డ్యూటీఅనే మాట దగ్గిరికి మానవజాతి ఒకనాడు రాకతప్పదు. ప్రపం చంలో ప్రతిఫలాలు ఎక్కువ లేవు - డ్యూటీలు (విధ్యుక్త ధర్మములు) మాత్రం చాలాఉన్నాయి. ఈ పరమ సత్యాన్ని పెద్దమనిషివలెనో పాతకాలపు కిరాతకునివలెనో, ఎంత తొంద రగా మానవుడు తెలుసుకుంటే అంత మంచిది."

ప్రస్తుత యాంత్రిక యుగంలో శ్రమవిభజనతోబాటు బాధ్యతా విభజనకూడా దానంతటది ఏర్పడుతోంది. "ఈ యంత్రాన్ని ఏంచేస్తారు - ఏవిధంగా ఉపయోగిస్తారు ? అనే ప్రశ్న నాకు అనవసరం. దానిని తయారుచేయడం దాకానే నా పని - అంతవరకే నా బాధ్యత," అంటున్నాడు సాంకేతిక నిపుణుడు (టెక్నీషియన్). అదేవిధంగా సామాన్య పౌరుడు తన దైనందిన కార్యక్రమాలు తను చూసుకుంటూ, ప్రభుత్వ నిర్వహణ పెద్దమనుషులకి వొదిలేస్తున్నాడు. ఈవిధమైన

అలసత్వం నైతికపతనానికి దారితీస్తుందనుకునేందుకు తగు చారిత్రక నిదర్శనాలు వున్నాయి - అటువంటి అలసత్వం నుంచే హిట్లరు పుట్టుకొచ్చాడు జర్మనీలో.

పాశ్చాత్యుల ఫిలాసఫీని, అనగా బాధ్యతల బరువు ఆమోదించే ఫిలాసఫీని వొప్పుకున్నమీదట ప్రత్యేకాధికారాలు (ప్రివిలేజెస్) మరింత బరువైనవిగా తోస్తాయి. మన చేతిలోని అధికారం పెరిగినకొద్దీ బాధ్యతకూడా పెరుగుతుంది - అధికార వినియోగమెప్పుడూ ఎక్కువ మందికి మేలు కలిగించేదిగా ఉండాలి. అధికారం బరువైనకొద్దీ బాధ్యతకూడా బరువైతీరాలి. ప్రపంచ ప్రజానీకానికి, నేటి సాంకేతిక సంపదే గాకుండా దానితోబాటు అత్యద్భుతమైన భావనా సంపదకూడా వరప్రసాదమై నిలిచి వుంది. ఈ రెండిటి సాయంతో మానవుడు తన జీవితాన్ని సుఖపూరితం చేసుకోగలగాలి. పాశ్చాత్య లోకం ఈనాడు యాంత్రికంగా అపూర్వమైనవి సాధించగల స్థితిలో ఉంది. ఆ అపూర్వ విజయాలు పాశ్చాత్య లోకక్కరికే చెందినంత మాత్రాన మానవాళికి మేలు చేకూరదు. సర్వమానవ లోకానికి సంబంధించిన నైతికధర్మ ప్రకారం ఆ సంపద అందరిదీను. ఆ సంపదకి పాశ్చాత్యులు తాత్కాలిక ధర్మకర్తలు. ఎంత యివ్వాలనేది తమ శక్తినిబట్టీ, ఎంత పుచ్చుకోవాలనేది తమ అవసరాన్నిబట్టీ నిర్ణీతమవాలి. మహత్తరావకాశాలు మనని జోకొట్టేటట్టు వుండకూడదు-మనసుని బాధ్యతాభావంతో నింపేసేటట్టు వుండాలి. బాధ్యత ఆమోదిస్తే, బరువు ఎక్కువ వున్నట్టే ఉంటుంది - లేకపోతే ఏముంది, ఏమీలేదు.

# 4

# స్వాతంత్ర్యానికి అర్థం

తనకి ఎంత స్వాతంత్ర్యం లేదో తెలుసుకోవడంలో మానవుడు స్వతంత్రుడవుతున్నాడు.

—రీన్‌హెూల్డ్ నైబ్లూర్

పాశ్చాత్య పౌరుని నిఘంటువులో ఈనాడు "స్వాతం త్ర్యం" (ఫ్రీడమ్) అను పదానికి వున్న అత్యంత గౌరవం మరొక పదానికీ లేదు. మనం వుంటున్నది ఫ్రీ వరల్డ్ అనీ, యిక్కడి ప్రజకి చతుర్విధ స్వాతంత్ర్యాలైన, వాక్ స్వాతం త్ర్యము, మత స్వాతంత్ర్యము, సభా స్వాతంత్ర్యము, విమ ర్శనా స్వాతంత్ర్యము వున్నాయనీ, ఈ నాలుగూ వుండటం చాలా గొప్ప విషయమనీ, ఘనంగా చెప్పుకుంటూ వుంటాం. ప్రపంచంలోని అన్ని దేశాల ప్రజలకి స్వాతంత్ర్యాపేక్ష వుంది; వారి వారి స్వాతంత్ర్యాల మాట ఎటున్నా, ఎవరి స్వాతంత్ర్యం లోని ప్రత్యేకతని వాళ్లము గొప్పగా ఉదహరిస్తూంటాము; ఆ ఉదహరించడంలో కొంత ఆత్మతృప్తినికూడా పొందుతూ వుంటాము. ఇనప తెరకి అవతల నున్నవారుకూడా ప్రజా స్వామ్యం కోసమే పాటుబడుతున్నామని అంటారు - వారు రాజకీయమైనదానికంటె ఆర్థికమైనదానికి ఎక్కువ ప్రాముఖ్యత నిస్తున్నారు. ప్రజాస్వామ్య లక్ష్య సాధన నకి (ఎకనమిక్ డెమోక్రసీ) ఆలోచనా స్వాతంత్ర్యం, భావ స్వాతంత్ర్యం నిరుపయోగమని వారి అభిప్రాయం. అటువంటి స్వాతంత్ర్యం పతన హేతువు అనికూడా వారంటారు. మనం ఒకమాదిరి స్వాతంత్ర్యాన్ని ఘనంగా భావిస్తూ, మన విలువ లలో దానికి అత్యుత్తమైన స్థానం యిచ్చాము.

పాశ్చాత్య ప్రపంచం ఫ్రెంచి మహా విప్లవం నుంచి ఒక నినాదం నేర్చుకుంది - స్వాతంత్ర్యము, సమానత, సహోదర

త్వము (లిబర్టీ, ఈక్వాలిటీ అండ్ ఫ్రెటర్నిటి) ఈ మూడు మాటలూ ఒకటిగా గుచ్చెత్తి పదేపదే పలకడంతో, ఈ మూడూ ఒకే ఆశయంలోని వివిధ దశలు - అని అనుకునే స్థితికి వచ్చారు చాలామంది. స్వాతంత్ర్యము, సమానత (లిబర్టీ అండ్ ఈక్వాలిటీ) అనునవి ఒకటిగావు సరికదా, కొన్ని సందర్భాలలో పరస్పర విరుద్ధములవుతూ వుంటాయి. ముఖ్యంగా ఆర్థికరంగంలో ఈ రెండిటికీ పొత్తు కుదరదు. కొన్ని స్వాతంత్ర్యాలు వొదులుకుంటేగాని ఆర్థిక సమానత చేకూరదు. కార్మిక సంఘం పనివారందరికీ ఒకే వేతనం ఉండాలని నిర్ణయించవచ్చు; అలా యిచ్చినప్పుడు మేస్త్రీకీ, సామాన్య కూలీకీ తేడా ఏమిటి ? అందరినీ సామాన్యులుగానే వుంచుదామనుకున్న పక్షంలో పని ఎలా జరుగుతుంది ? వ్యక్తిలోని సహజ ప్రతిభ అణగారిపోవల్సిందేనా? పోనీ, అందరికీ స్వాతంత్ర్యం యిచ్చి వారు ఆర్థికంగా పెరిగేందుకు అవకాశాలు యిస్తేనో ? అటువంటప్పుడు సమానతకి దూరంగా ప్రయాణించేస్తాము; కొందరు అతిభాగ్యవంతులవుతారు; మరికొందరు కడుబీదలు అవుతారు. బీదల సంఖ్య విపరీతమవుతుంది. అంచేత, ప్రస్తుతం మనం తెలుసుకోవలసిన దేమిటంటే, పూర్తి సమానత, పూర్తి స్వాతంత్ర్యము సాధ్యంకాని విషయాలు.

బహుళంగా వ్యాప్తిగల మాటలు రకరకాల అర్థాలకి దారితీస్తాయి. అందులో 'ఫ్రీడమ్' (స్వాతంత్ర్యం) అనే మాట మరీని. తాత్వికంగా, నైతికంగా, ఆర్థికంగా ఈ పదానికి వివిధార్థాలు వున్నాయి. స్వాతంత్ర్యం గురించి అని చెబుతూనే

ఎవరికివారు వేరువేరు పంథాలలో ఆలోచిస్తారు. స్వాతంత్ర్యం అను పదానికి యిదే సరియగు నిర్వచనం అని ఎవరు సిద్ధాంతీకరించగలరు ? ఒకపదం వుందనుకోండి - ఆ పదాన్ని ఎవరిష్టమొచ్చినట్టువారు అర్థం చెడకుండా వుపయోగించవచ్చు, వుపయోగిస్తున్నారుకూడా. ఎటొచ్చీ, ఆ పదం ఏ భావసముదాయాన్ని అంటిపెట్టుకువున్నదో పరిశీలించవలసి ఉంది. ఆ పదమే కాదు, ఏ పదం విషయంలోఅయినా అంతే. ఆ మాట వెనకనుండే భావజలధి దగ్గిరికి మనం వెళ్ళాలి.

రష్యన్ ఫిలాసఫీని శిరసావహించే వ్యక్తులు, 'స్వాతంత్ర్యం' గురించి పాశ్చాత్యులు చెప్పే నిర్వచనాన్నీ అదృక్పథాన్నీ ఖండిస్తారు; తమ ఫిలాసఫీ వేరు - అంటారు. వారి సేనలు కొత్తప్రదేశాలు ఆక్రమణచేసినప్పుడు, అది 'విమోచన' అని పేర్కొనబడుతుంది. ఎలాగనగా, పెట్టుబడిదారుల సంకెళ్ళ నుంచి అక్కడి ప్రజలకి 'విమోచన' కలిగిస్తారు. ఆస్తి హక్కులూ, వాక్ స్వాతంత్ర్యము - వీటిమీద వారికి నమ్మకం లేదు; ఇవి ప్రభుత్వరథానికి అడ్డంకులు - అని వారి అభిప్రాయం. వీటిని మొదట్లో తుంచెయ్యకపోతే కష్టమట. నామమాత్రంగా 'చర్చి'ని వుండనిస్తారేగాని, తమని విమర్శించే వైఖరి అవలంబించిందా పూరుకోరు. ఒక్క ఫిలాసఫీమాత్రమే వారు బోధిస్తారు. తమదే సక్రమమైనదనీ మిగతావన్నీ తప్పుదారిబట్టిన తత్వబోధనలన్నీ వారి ఉద్దేశం. పొరబాటు విషయాలు వ్యాప్తంచేసేందుకు యివ్వబడే స్వాతంత్ర్యం స్వాతంత్ర్యం కానేరదు – అనేది వారి నిశ్చితాభిప్రాయాలలో ఒకటి.

మనం నిత్యజీవితంలో అనుభవిస్తున్న స్వాతంత్ర్యాన్నేగాక తాత్విక స్వాతంత్ర్యం కూడా మనకి లేకుండా చేస్తుంది రష్యను పద్ధతి. రష్యనులూ, రష్యను ఆశ్రితులూ ఒకానొక సిద్ధాంతానికి కట్టుబడివుంటారు. ఆ సిద్ధాంత ప్రకారం అవకాశ స్వాతంత్ర్యమనేది ఒక భ్రాంతి. అన్ని ఘటనలూ, అన్ని భావనలూ ఆది భౌతికధర్మాన్నిబట్టి నిర్ణయమవుతాయి. ఇదే శాస్త్రీయ దృక్పథం - మిగతావన్నీ అశాస్త్రీయమైనవి. శాస్త్ర పరిశోధనని అనుసరించి మానవజీవితం సాగగలదేమో అని మొదట్లో అనిపిస్తుంది - కాని, రానురాను ఈ ఫిలాసఫీ మానవునికి స్వేచ్ఛ అనునదే లేనట్టుగా నిరూపిస్తుంది. అదే విధివాద తత్వం (డిటర్మినిస్ట్ ఫిలాసఫీ).

ఇటువంటి తాత్విక పరిశీలనలో మానవ జీవితం, ఫాటలిజమ్‌నుంచి (విధివాదతత్వం) తప్పించుకోలేని నిస్సహాయమైనదానిగా కనిపిస్తుంది. మానవులు తాము స్వేచ్ఛాయుతులమని భావిస్తున్నారు. ఆ స్వేచ్ఛ వొట్టిభ్రమ అనీ, పదార్థమే పరిస్థితులకి రూపుదిద్ది మనుష్యులచేత పనులుచేయిస్తోందనీ రష్యను ఫిలాసఫీ అంటుంది. ప్రపంచావసరానికిగాను ప్రాణులూ సంఘాలూ ఆయాకాలాల్లో జీవిస్తున్నాయి. ఆ క్రమము ప్రపంచ ధర్మానికి సంబంధించినది; దానిని త్రికరణ శుద్ధిగా ఆమోదించినమీదట, మానవులకి ప్రభుత్వంతో పని వుండదు; ఎంచేతననగా, ఆ క్రమమునికాదని, ఎదిరించి తిరగబడే మనుష్యులు వుండరు గనక! పాశ్చాత్యలోకపు పదజాలంతో ఈ తత్వపద్ధతి ప్రబోధింపబడుతున్నా, యిది గ్రీకులకి పూర్వపుదైన ఫాటలిజమ్‌వంటిది. ఆ ఫాటలిజమ్ తర్వా

తనే గ్రీసులో స్వాతంత్ర్య దీపం వెలిగింది. మానవుని భావనా శక్తికి విలువలేనిచోట వాక్ స్వాతంత్ర్యమూ సభా స్వాతంత్ర్యమూ లేకపోవడంలో ఆశ్చర్యమేమీలేదు. ఫాటలిజమ్ నియంతృత్వాన్ని రగుల్కొల్పక తప్పదు.

ప్రపంచంలో ఒకపక్కనున్నవారికి, స్వాతంత్ర్యం కాపాడుకునే విషయంలో ఎంత పట్టుదలో, మరొక పక్కనున్నవారికి దానిపట్ల అంత ఉపేక్ష. స్వాతంత్ర్యంలో నామమాత్రమైన దానికీ తాత్వికమైనదానికీ ఒకవైపువారు వెర్రి ఆపేక్ష చూపించగా, వేరొకవైపువాచు తిరస్కృతి కనబరుస్తున్నారు. సామాజికశాస్త్ర పరిశోధనలో కృషిచేసే కొందరు, వ్యక్తికి స్వతంత్రమంటూ లేదని అంటారు; కాని ప్రజాబాహుళ్యం తమకి స్వతంత్రం వుందనే భావనలో జీవిస్తున్నారన్న పిషయం మనం విస్మరించలేము. తమయిష్టప్రకారం తాము బతుకుతున్నామనీ, ప్రభుత్వాన్ని తమ యిష్టమొచ్చినట్టు విమర్శించగల హక్కు తమకి వున్నదనీ జనసామాన్యం అనుకుంటుంది - అనుకుంటోంది. ఆ ప్రత్యక్ష సత్యం ఎవరు కాదనగలరు ?

స్వప్రయోజనాన్ని సామాజిక లక్ష్యంలో మర్చిపోగలిగిన నాడే వుత్తమ జీవనానికి ఆస్కారం యేర్పడుతోంది. సాంఘిక శ్రేయస్సుని ప్రధానంగా పెట్టుకు నడవలేనివారికోసం న్యాయ సూత్రాలు (లాస్) అనునవి యేర్పడ్డాయి. పాశ్చాత్య లోకపు నైతిక ఆదర్శాన్ని గ్రహించేందుకు రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో బ్రిటిష్‌వారు చూపిన వైఖరిని తార్కాణంగా

తీసుకోవచ్చు. అంత ముమ్మరంగా యుద్ధం జరుగుతున్న కాలంలోకూడా, ఆత్మప్రబోధ కారణంగా సేనలో చేరేందుకు నిరాకరించినవారిని, వారు నిర్బంధపెట్టలేదు. మానవుని వ్యక్తి స్వతంత్రానికి అటువంటి మహోన్నత గౌరవం యిచ్చే జీవన పద్ధతిని, ప్రాణాలు వొడ్డి అయినాసరే కాపాడు కోవల్సిందే! మానవ వ్యక్తిత్వపు విలువకి అంతకి మించిన గీటురాయి యేముంది?

స్వాతంత్ర్య సంరక్షణకి విమర్శనాత్మక జ్ఞానం మూలాధారమని ఎందుకు అన్నారంటే, తప్పుచేయడమన్నది మానవ లక్షణం. మనుష్యులు అధికారంలో వున్నంత మాత్రాన తప్పులు చేయరని ఎక్కడ వుంది? - ప్రజాస్వామ్యానికి మూలగర్ర అయిన స్వాతంత్ర్యం, ప్రజలందరూ విశ్వాసపాత్రులనే సూత్రం మీదగాక, ప్రజలు సర్వసాధారణంగా నమ్మకద్రోహులై వుంటున్నారనే దానిమీద ఆధారపడి వుంది. వెర్రిగా నమ్మినప్పుడే మోసగింపబడటం జరుగుతుంది. ప్రజాస్వామ్యంలో ఎక్కడికక్కడ పరీక్షలూ ప్రతి పరీక్షలూ వుండటంవల్ల, సమాజం పతనస్థితికి దిగజారదు. ప్రజలందరూ నాయకులతోసహా, "నమ్మకం వుంచదగ్గవారు" కాదనీ, విశిష్టత వ్యక్తులలో వుండటం దుర్లభమనీ 'ప్రజాస్వామ్యపు' అభిప్రాయం. విశిష్టగుణ సంపన్నులు సంఘాతీతులు అయివుండవచ్చు; వారు సంఘ వ్యవహారాలు పట్టించుకొని సంఘాన్ని నడపరు. సంఘపరులైన వ్యక్తులలో లోపాలు వుండక తప్పదు. అంచేత, స్వాతంత్ర్యం అనగా ఒక ఆభరణంవంటిదని తలపోయకూడదు; మానవులని

వృత్తిమ జీవనులుగా చేయగల మార్గమది. ప్రజా స్వామ్య స్వతంత్రమనగా ఒక జీవన పద్ధతి. మనుష్యులందరూ సుగుణవంతులూ హేతుజ్ఞానం కలవారూ కాదుగాని అంద రిలో అధికార తృష్ణమట్టుకు విధిగా కనిపిస్తుంది. భావ స్వాతంత్ర్యం విమర్శనా స్వాతంత్ర్యానికి దారితీసి, వ్యక్తిలో గాని ప్రభుత్వంలోగాని వెర్రి తలలు వేయబోయే అధికా రాన్ని అరికడుతుంది. వ్యక్తిని స్వయం సంపూర్ణుడుగా చూడలేకపోవడమే నియంతృత్వాలలోని పెద్ద తప్పిదం. సర్వసామాన్య పరిస్థితులలో మానవ స్వభావం ఎటువంటి మహోన్నత శిఖరాలని అందుకోగలదో నియంతృత్వం చూతలేకపోతుంది. అది అలా వుంచి, మానవులు లోపర హితులు కారనే సిద్ధాంతం ఆమోదించలేక వేలాది ప్రజలు లంచగొండులని శిక్షిస్తూ నియంతని కాపాడుతుంది. మానవ దౌర్బల్యత సర్వత్రా ఒకటే - అని అంగీకరించడం ప్రజా స్వామ్యంలోని ఘన విషయం. ఆ 'అంగీకారం' వల్ల సామా న్యుడు 'అసామాన్యుని' ఒక కంట కనిపెడుతూ వుంటాడు. అధికారంమీద ప్రేమతోబాటు, దానిని దుర్వినియోగం చేయ గల దౌర్బల్యం వెంటనంటి వుంటుంది. కాబట్టి మనం జాగరూకులమై వుండాలి - అంటాడు జార్జి వాషింగ్‌టన్. ఏ మనిషీ లోపరహితుడు కాదనే సిద్ధాంతాన్ని పునాది రాయిగా చేసుకుంది ప్రజాస్వామ్యం.

రైటు చేయడానికి ఒకే మార్గమైనప్పటికీ తప్పు చేయ డానికి లక్ష మార్గాలు వున్నాయన్నట్లు, పాశ్చాత్యులూ ప్రాచ్య దేశీయులూ కూడా స్వతంత్రతని అర్థంచేసుకోవడంలో పొర

బడుతున్నారు. నియంతృత్వ రాజ్యాలూ మార్క్సిస్టులూ మన స్వాతంత్ర్యాన్ని గుర్తించకపోవడంవల్లకాదు మనకి జరుగుతూవున్న ప్రమాదం; మనలోని నీరసస్వభావమే ఆత్మ విధ్వంసకరంగా పరిణమిస్తూ ప్రమాద హేతువు అవుతోంది. స్వతంత్రతపట్ల తమకి గల విశ్వాసం గురించి నొక్కి చెబుతున్నప్పుడు, లక్షలాది ప్రజలు ఆ స్వతంత్రతని, తమ యిష్ట మొచ్చినట్టు చేయడమని భావిస్తున్నారు. తమకి తోచినట్టు తమ యిష్టప్రకారం పనులు చేయగలగడమే స్వతంత్రమని ఈ లక్షలాది పాశ్చాత్యుల అభిప్రాయం. "నా మానాన నన్ను వుండనీయండి. నాయిష్టమొచ్చినట్టు నేను వుంటాను. నా బతుకు నన్ను బతకనీయండి," అని నేడు ఎందరో విల పిస్తున్నారు. స్వాతంత్ర్యంపట్ల అటువంటి భావన, ముఖ్యంగా విద్యార్థులలో, ఎక్కువ కనిపిస్తోంది. యుద్ధానంతరం విద్యార్థి సంఘాలు విద్యా విధానానికి గొడ్డలిపెట్టుగా తయారవుతున్నాయి చాలా చోట్ల.

స్వతంత్రమనగా ఎవరిష్టమొచ్చినట్టు వారు, న్యాయాన్నీ సంప్రదాయాన్నీ నీతినీ లెక్కచేయకుండా, విశృంఖలంగా ప్రవర్తించడమనే దురభిప్రాయం వుంది చాలామందికి; స్వాతంత్ర్యమనేదీ ఒక హక్కు అనీ, తత్సంబంధమైన బాధ్యత లేమీ లేవనీ అనుకుంటారు; అది స్త్రీ పురుషుల సహజవారసత్వమని వారి భావన. నిజమేగాని అది చవక బారుది కాకూడదు; దానిని అనుభవించగల అర్హత, యోగ్యత, ఎవరికి వారు పొందాలి.

విధ్యుక్త ధర్మమనుదానిని (డ్యూటీ) గుర్తిస్తేగాని ముందుకి సాగలేము. పాశ్చాత్య లోకంలోని ఒకతరం స్త్రీ పురుషులు పాత సంప్రదాయాల్నీ, పాతవైన సమస్తాన్నీ తోసి పారేసి, విభ్రాంత మనస్కులై నిలబడ్డారు ఈనాడు. వారు కోరుకున్న స్వేచ్ఛ ఒకరకంగా లభ్యమయింది. కాని, అది నియమబద్ధం కానిదవడంవల్ల వారికి మతులు పోతున్నాయి. తనేమిటో తనెక్కడికో తెలియని అర్ధరహిత ప్రయాణంవలె ఉంది. ఒకతరం ప్రజలు నిరర్ధక జీవితం గడిపిన సంగతి ఒప్పుకోకతప్పదు. మనం స్వేచ్ఛాపౌరులమే; మనది చుక్కానీ దిక్సూచీలేని ఓడకి గల స్వేచ్ఛవంటిది.

ఈ కృత్రిమ స్వాతంత్ర్యంవల్ల అనేక జబ్బులు అంకురిస్తున్నాయి. బంధనాలలో యిరుక్కుని గిజగిజ కొట్టుకుంటున్నాము. ఆ గిజగిజలో మన పురోభివృద్ధి గురించీ, మన ఆరోగ్యం గురించీ, మన కోరికల గురించీ తలపోస్తున్నాము. ఈ విషాద పరిస్థితిలోవున్న వేలాది ప్రజలు, తమ జీవితాలకి అట్టడుగున సుస్థిరతలేని కారణంగా, గడిచిన యవ్వనాన్నీ అర్థంకాని అన్వేషణనీ, అరచేత నుంచుకుందామనే ప్రయత్నంలో, విలాస ప్రదేశాల వెంట (ఫాషనబుల్ రిసార్ట్స్) వెర్రిగా తిరుగుతున్నారు. దాంపత్యంలో యిద్దరూ సౌఖ్యాన్వేషకులవడంవల్ల వివాహబంధాలు తెగిపోతున్నాయి. ఎవరికి వారు సుఖపడదామనీ, అవతలవారిదే తప్పుఅనీ భావించడం వల్ల వివాహాలు విడాకుల కోర్టుకి దారితీస్తున్నాయి. ఆ పెళ్ళి అలాఅయింది, ఈ పెళ్లిలో సుఖపడగలమని అనుకునేవారు, 'ఈ పెళ్ళిలో'కూడా సుఖపడలేక బాధల పాలవుతున్నారు.

ప్రస్తుత మానవ స్వభావాన్ని అర్థం చేసుకునేందుకు, వివాహ వ్యవస్థని ఒక ఉదాహరణగా తీసుకొనవచ్చు. వివాహాలు విఫలమవుతున్న విషయం రహస్యంకాదు - అందరికీ తెలిసినదే. నూరేళ్ల పంట అయిన వివాహం సుఖప్రదంగా గడిచేందుకు శరీర సంబంధ మొక్కటీ చాలదు - మానసిక బంధనలు చాలా కావాలి. స్త్రీ పురుషుల సహజ వాంఛా పరితృప్తితో వివాహ బంధం బలవత్తరం కానేరదు; సహజ వాంఛా పరితృప్తి శారీరక ధర్మం మాత్రమే అవుతుంది; దానిని మించినవి కొన్ని కావాలి. వివాహ బంధంలో శారీరక ధర్మం ఒకభాగం మట్టుకే అని మనం మరువకూడదు. తన వాంఛా పరితృప్తినీ, తన స్వలాభాన్నీ అధిగమిస్తూ అవతల వారి క్షేమం యోచించడం 'నైతిక' ప్రవర్తన కిందకివస్తుంది. తనగురించి మర్చిపోయి, అవతలవారి యోగక్షేమాలు మనసులో పెట్టుకోవడం నైతిక మనిపించుకుంటుంది. సుఖప్రదమైన సంసారాలు నిర్మితమయేందుకు మనస్తత్వవేత్తలు చెప్పే మామూలు మాటలు చాలవు.

కొందరి స్వభావాలు సరిగ్గా అతకడం, మరికొందరి స్వభావాలు పొతక్కపోవడం ఎప్పుడూ వున్నదే! కొందరు స్త్రీ పురుషులు ఒకరికొకరు, యిట్టే సన్నిహితులవుతారు; కొందరు కాలేకపోతారు. 'హనీమూన్' అన్నా పూర్తిగాకపూర్వమే కీచులాడుకున్న భార్యాభర్తలు లేకపోలేదు. నీతి గురించి చెప్పుకోవడం పాతకాలపు కబుర్లలా వున్నప్పటికీ, ఉత్తమ దాంపత్యాలన్నవి నైతికధర్మాన్ని ఆశ్రయించుకు వుంటాయని అంగీకరించక తప్పదు. భార్యాభర్తలు ఎవరి అభిప్రాయ

ప్రకారం వారు బతకాలని అనుకున్నప్పుడు, అటువంటి వివాహం విచ్ఛిన్నానికే దారితీస్తుంది; అది చాలా బాధావహమైన అపజయంగా పరిణమిస్తుంది. జీవితంలో ఆనంద క్షణాలతోబాటు కష్టపరంపరలు కూడా ఉంటాయి; స్వార్థవాంఛని జయిస్తూ, అవతలవారి సుఖం ఆలోచించడం, నిత్యజీవితంలో ఒకభాగమైతేతప్ప, దాంపత్యం పరిపూర్ణత నొందదు. అప్పుడు గాని ఆ స్త్రీ పురుషులు 'దంపతులు' అనిపించుకునేందుకు అర్హులు కారు.

నేటి జీవితంలో నైతిక బంధనాలకి ఆస్కారంలేదనీ నైతికమైనవాటిని పట్టుకు దేవుళ్లాడటం నిష్ప్రయోజనమనీ భావించేవారు ఎందరో ఉన్నారు. వారు అనుకున్నది అక్షరాలా ఆచరణలో పెడితే, యిల్లు ఒక అరణ్యంగా తయారవుతుంది. ప్రజాజీవితం తాడూ బొంగరం లేనిది అవుతుంది. నియమబద్ధంకాని స్వాతంత్ర్యం, మన యిల్లూ వాకిలికేగాక ప్రజాకోటికే ప్రమాదకరం; అటువంటి స్వాతంత్ర్యం ప్రజాస్వామ్య ధర్మానికి విరుద్ధం. నా యింటిని నేను తగలబెట్టుకుంటానంటే పక్కయిళ్లవాళ్ళు వూరుకుంటారా ? ఒకనాడు బానిసత్వాన్ని 'డిఫెండ్' చేసినవారున్నారు. ఈనాడు మనలో ఎవరమైనా బానిసత్వం వుండాలని అనగలమా ? మానవునికి ఎటువంటి అవకాశం వున్నదనిగాని, మనకి ఏది యిష్టము - అని కాదు ప్రశ్న. అవకాశం దగ్గిరికి వచ్చినప్పుడు, యుక్తాయుక్త విచక్షణ, ఆత్మనిగ్రహమూ మొదలైనవి మానవజాతి మనుగడకి తప్పనిసరిగా కావాలని అంగీకరించవలసివస్తుంది.

ఆ విచక్షణా జ్ఞానమే ఏది సత్ప్రవర్తనో, ఏది దుష్ప్రవర్తనో మనకి తెలియజెబుతోంది.

ప్రస్తుతం పాశ్చాత్యదేశాలలో వ్యక్తి స్వాతంత్ర్యం గురించి వున్న అభిప్రాయం క్షుణ్ణంగా మారితేగాని ఉత్తమ జీవనానికి ప్రాతిపదికపడదు. వ్యక్తి అనునతను సంఘంలో ఒక భాగము. సంఘంనుంచి విడదీసి అతనిని వేరుగాచూడలేము. సంఘములోని వేరువేరు వ్యక్తులకు పరస్పర విరుద్ధములైన కోరిక లుండవచ్చు. వాంఛా ఫలప్రాప్తిలో నియమమూ నిగ్రహమూ లేనప్పుడు సామాజిక జీవనమే సాధ్యంకాదు. ఎవరికివారు తమ కోరికలు తీరడమే ప్రధానంగా ఎంచుకుంటే బతికేదెలా ? ఎదుటివారి మేడ బావుందికదా అని, అక్కడి వారిని తరిమేసి, దానిని మనం ఆక్రమించేందుకు పూనుకోగలమా ? అది సాధ్యంకాదు. సంఘశక్తులు మనని ఆ పని చేయనివ్వవు. లేకపోతే చేసివుందుమేమో !

వివాహ బంధం తమకి స్వేచ్ఛనివ్వడంలేదని కోర్టుకిపోయి విడాకులు తెచ్చుకునేవారు ప్రతి సంవత్సరం లక్షోపలక్షలు కనిపిస్తున్నారు. 'ఈ కట్టడాలు ఘోరంగా ఉన్నాయి - వీటి నుంచి బయటపడితేగాని విముక్తిలేదు' అని తమని తాము సరిపెట్టుకుంటూవుంటారు వీరు. భార్యాపిల్లలు తనకి బరువు అని మొగవాడు ఆ విధంగా వెళ్లిపోతాడా - వెళ్ళిపోగలడా ? పిల్లల్ని పెంచడంలో తలిదండ్రులు, చిన్నచిన్న త్యాగాలు ఎన్నెన్ని చేస్తారో, పిల్లల్ని పెంచినవారికిగాని తెలియదు. కుటుంబపోషణకోసం మొగవాడు ఏ ఫాక్టరీలోనో ఏ ఆఫీసు

లోనో పొద్దస్తమానం కష్టపడతాడు. భార్య పాతబడిపోయిం దని, యితర స్త్రీలతో సంపర్కం పెట్టుకున్నవారు, ఏమవు తున్నదీ మనం చూస్తూనే వున్నాము. ఇతరుల గురించిన ఆలోచన లేకుండా ఎవరికివారు స్వేచ్ఛగా బతకడమనేది అర్ధరహితమైన విషయం - అది సాధ్యంకాదు. స్వార్ధమే ప్రధానమను సిద్ధాంత ప్రకారం ఆలోచిస్తే, మనవ జాతికి శాంతి సుఖములు వుండవు; సమస్తమూ అల్లకల్లోల మైపోతుంది.

స్వాతంత్ర్యమనగానే రకరకాల స్వాతంత్ర్యాలు తలపుకి వస్తాయి - అందులో కొన్ని ఒకదానికొకటి చుక్కెదురు. పొరుగువాని వస్తువుల్నీ, పొరుగువాని ఉద్యోగాన్నీ, పొరుగువాని భార్యనీ తీసుకోగల స్వాతంత్ర్యం నాకు లేదు; ఎంచేతననగా వాటిని అట్టే పెట్టుకోగల స్వాతంత్ర్యం అతనికి వుంది గనక. పరీక్షపేపరు కాపీకొట్టే 'స్వాతంత్ర్యం' విద్యార్థికి ఎందుకు లేదంటే, ఈ పరీక్షపేపర్లద్వారా తమ విద్యకి విలువకట్టించు కోగల 'స్వాతంత్ర్యం' మీగతా విద్యార్థులందరికీ వుంది గనక. తను అర్ధరాత్రివేళ సంగీత సాధన చేస్తాననే మనిషి స్వతం త్రమూ, నిద్రపోదామనుకునే యిరుగు పొరుగువారి స్వతం త్రమూ ఒకదానికొకటి సరిపడవు - రెండూ విరుద్ధములు. ఈ మాదిరి ఉదాహరణలు వందలాదిగా పేర్కొనవచ్చు. మనం యిక్కడ గమనించవలసినదేమిటంటే, యితరుల హక్కులు గుర్తించనిదే సాంఘిక జీవనంలో క్రమత అంటూ యేర్పడ దని. అనగా మన స్వాతంత్ర్యము కొన్ని నియమాలకి కట్టు

బడి వుండక తప్పదన్న మాట. తన యిష్టమొచ్చినట్టు తాను చేయగలిగే స్వాతంత్ర్యం అర్థరహితమని స్పష్టమవు తుంది.

స్వాతంత్ర్య భావన నాగరీకుల మనసుని అనేక విధాలుగా వుక్కిరిబిక్కిరి చేస్తోంది. మన సంఘ స్వరూపంలో బరువు బాధ్యతలకంటె, హక్కుల మీదనే ఎక్కువ మోపుదల వుంచడమవుతోంది. హక్కుల గురించి పదేపదే నొక్కి చెబుతూ మనమొక నూతన మనస్తత్వాన్ని నిర్మించు కొన్నాము. వర్కర్ దృష్టి తను చేయవలసిన పనీమీదగాక గడియారం మీద ఉంటోంది; తను చేసిన పనికి ప్రతిఫలం పుచ్చుకొంటున్నాననే భావన పూర్తిగా మాయమవుతోంది; గడియారం మీదనే అతని కళ్లు. ఈ దృక్పథం, వ్యక్తి స్వభావ నిర్మాణంలో ఒక భాగమై, మన ప్రజల భవిష్యత్తునీ, ఈ నాగరికత అదృష్టాన్నీ నిర్ణయింపనున్నది, భౌగోళిక స్థితిగతులకంటె, ప్రకృతి సంపదలకంటె ఈ దృకృథానికి బలపత్తరమైన శక్తి వుంది. ఇది మనకి 'చెరగని మచ్చ' అవుతోంది. ఈ దృక్పథాన్ని ఖండించి, వాస్తవికతని అల వరుచుకుంటే తప్ప, మనకి మోక్షం లేదు.

నైతిక జీవనం కొరకనే గాక, మన బ్రతుకుబాట పరి శుభ్రపడేందుకు, స్వతంత్రత అనేదానికి అర్థం మరికొంచెం విపులంగానూ వాస్తవికంగానూ తెలుసుకోవాలి. తరిచి తరిచి చూసినమీదట, స్వాతంత్ర్యమనేది మనకి మనముగా సంపా యించుకోవలసినదనే పరమసత్యం అవగతమవుతుంది. సంపాయించుకోకుండా మనకి లభించిన స్వాతంత్ర్యము

ఎండమావులుగా పరిణమించడం ఖాయం. నవీనయుగం లోని మాదకద్రవ్యాల (అల్కహాలిక్ డ్రింక్స్) ఖర్చు విష యం తీసుకోండి. కిండర్ గార్టెన్ నుంచి వృత్తి విద్యాలయం దాకా ప్రజల విద్యకోసం వెచ్చించేదానికంటె, ఎక్కువ వెచ్చిస్తున్నారు అమెరికాలో మాదక ద్రవ్యాలకోసం. మత్తు పానీయం సేవించడమా సేవించక పోవడమా అను స్వాతం త్ర్యం సామాన్య పౌరునికి వుంది. కాని, అమత్తు పానీయం పుచ్చుకోనిదే వుండలేక పానశాలకి వెళ్తున్నాడు సామాన్యుడు. కాని, యిక్కడ యితను, ఈ మత్తు పానీయం ఈ విధంగా పుచ్చుకోవడం, స్వతంత్రకి చిహ్నమా ? దుర్బలతకి చిహ్నమా? తాగకుండా వుండలేనివాడే కదా పానశాలకి వెళ్లేది! అతని యిష్టా యిష్టలతో ప్రమేయం లేనిదేదో అతనిని అక్కడికి తరుముతోంది. ఆ విధంగా తరమబడకుండా వున్నవాడే 'సంకల్పబలంగలవాడు' అని మనం వొప్పుకో వలసి వస్తుంది, అతనిదే క్రమబద్ధమైన జీవితమవుతోంది - అతనే నిజమైన స్వతంత్రుడు. శిక్షణవల్ల పొందే స్వతంత్రత మనం శ్రమపడితేగాని లభించదు. జిహ్వాని కోరికలనీ కట్టె సుకోలేనివాడు దుర్బలుడు - అతనికి స్వాతంత్ర్యా నిర్ణయావ కాశం ఎక్కడ? అతనెప్పుడూ బంధింపబడ్డ ఖైదీయే!

పాశ్చాత్య లోకంలో ఫ్రీడమ్ (స్వాతంత్ర్యము) అను పేరుతో చెలామణీ అవుతున్న నోట మాటకీ, ప్రాచ్య లోకం లోని ఫాటలిజమ్‌కీ (విధివాదము) దగ్గిర సంబంధం ఏర్పడు తోంది. ఈ రెండూ తమాషాగా కలుసుకొని నైతిక ధర్మ ప్రస్తావనకి తిలోదకాలిస్తున్నాయి. నైతిక ధర్మం ఒకటి వుం

దసి వొప్పుకొని, ఆ క్రమానికి కట్టుబడి ప్రవర్తించే మనిషికీ, అలాంటివి పట్టించుకోని మనిషికీ తేడా లేదూ? మన దుర దృష్ట వశాత్తూ, ఈ రెండో మనిషే ఎక్కువ స్వాతంత్ర్యంగల వానిగా మనకి పైకి కనిపిస్తాడు. ఏది సత్యాన్వేషణో, యేది ప్రచార సాధనో తెలుసుకోలేని వూబిలో యిరుక్కుని వున్నాము. నిజం మరుగుపడి, ప్రచారమే ప్రధానమైతే, రాజకీయవేత్తలు ఈ ప్రపంచాన్ని ఒక పిచ్చాసుపత్రిగా తయారు చేస్తారు. నిజాన్ని హత్యచేసిననాడు, పరస్పర విశ్వాసం నశించి, ఈ నాగరికత కూలిపోక తప్పదు.

ఇనపతెరకి చెరోవైపునా రెండు విధాలైన స్వాతంత్ర్యాలు వున్నాయి. స్థూలదృష్టితో చూసినప్పుడు యివి వేరువేరుగా కనిపించినా, ఈ రెండిటి గమనం ఒకే విధంగా ఉంది. స్టాలి నిజమ్‌వల్ల నిరంకుశత్వం వస్తుందని తేలికగా అనేస్తాం. కాని, ముందుగతి కానలేని మన జీవనవైఖరికూడా అటు వైపుకే పట్టుకెళ్తోందని తెలుసుకోలేకుండా వున్నాం. నైతిక ధర్మానికి కట్టుబడని ఏ మనిషైనా నిరంకుశునివలె ప్రవర్తిం చకతప్పదు. తన యిష్టారాజ్యంగా ("డు యాజ్ యు లైక్") భావించేవాడు నిరంకుశుడు (టైరంట్) అని 'ప్లేటో' ఏ నాడో అన్నాడు.

ఎవరికి వారు తమ స్వతంత్రత గురించి చెప్పుకోవడం 'ఫాషన్' అయిందిగాని, చాలామంది అదేమిటో ఆలోచించిన పాపానపోరు. స్వతంత్రత విషయంలో ప్రస్తుతంవున్న వాతా వరణం, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కబళించి, నిక్షేపమైన నిరంకు

శతకి దారితీయుగలదు. స్వతంత్రతలో మళ్లీ రెండు రకాలు వున్నాయి - విరుద్ధ స్వతంత్రత, ప్రబుద్ధస్వతంత్రత (నెగెటివ్ అండ్ పాజిటివ్). కష్టాల్లోవున్న మనుషులు సర్వసాధారణంగా నియంతృత్వప్రచారానికి దాసులవుతారు. తమకి తాముగా ఆలోచించి నిర్ణయాలుచేసుకోవలసిన నిమిత్తంలేకుండా, తమ జీవితాల్ని అధికారశక్తులకి అర్పితంచేస్తారు. ఆ విధంగా అర్పించడంవల్ల తమకేదో నూతనమైన బలం చేకూరినట్టు భావించి, తేనెటీగలవలె తేనెపట్టు వైపుకిసాగుతారు. అక్షరాలా తేనెటీగలే వారు - వారికి ముందుండే ముసుళ్లపండగ తెలీదు. లెక్క తప్పుగా ఎక్కించుకున్నప్పుడు, అన్సరు కరెక్టుగావస్తుందా ఎక్కడైనా ? హిట్లరు అంతరంగికులందరూ, ఒకనాడు సేచ్ఛావాయువులు పీలుస్తూ, స్వాతంత్ర్యగీతాలు ఆలాపించిన ధీరులేనని మనం మరవకూడదు. ఆ ఆలాపన కొన్నాళ్లయ్యేటప్పటికి అర్ధరహితంగా కనిపించి, హిట్లరిజమ్‌కి దాసులయారు.

అంచేత, విరుద్ధభావం గల స్వతంత్రత, పరిస్థితుల్ని కలగాపులగంచేసి, ఎందుకూ కొరగానిదవుతుందని మనం గ్రహించాలి. ప్రబుద్ధ స్వతంత్రతమీదనే మనం విశ్వాసం వుంచి, అది ఏ ప్రకారంగావుండాలో యోచనచేయవలసి వుంది. క్షణికోద్రేకాలకి లోబడకుండా, ఆమోదముద్ర పొందిన ఆదర్శానికి కట్టుబడ్డ నడతమాత్రమే నిజస్వాతంత్ర్యమనిపించుకుంటుంది. ఎవరిష్టమొచ్చినట్టు వారు ప్రవర్తించదలుచుకుంటే, ప్రపంచమే ఒక పిచ్చివాళ్ల సమూహంగా తయారవుతుంది. పాశ్చాత్యలోకంలోని సంప్రదాయానుగుణ

మైన స్వాతంత్ర్యత, మనం 'ఫ్రీడమ్, ఫ్రీడమ్' అని చెప్పు కునే 'బోలుమాట' కాదు - అది ఒక విశుద్ధక్రమంలో భాగమైఉంది, "స్వతంత్రమనగా ఎవరిష్టమొచ్చినట్టువారు చేయడంకాదు; తనుకోరిన ఉన్నతపథాన్ని అందుకోగల గడం," అంటాడు షిల్లర్. స్వాతంత్రేచ్ఛ, అధికారశక్తీ ఒకదానితో ఒకటి పోటాపోటీలుపడుతూంటాయి; కాని నిజ స్వాతంత్ర్యమనేది నైతికక్రమతనీ నైతికధర్మాన్నీ గుర్తిం చడంవల్ల లభిస్తోంది.

ఆ విధంగా గుర్తింపబడ్డ స్వాతంత్ర్యాలలో దాంపత్య బంధన ఒకటి. పురుషుడు ఫలానాస్త్రీ తనదని నిర్ణయించు కుని, తద్వారా విచ్చలవిడి జీవితంనుంచి స్వతంత్రత పొందాడు. ఒక స్త్రీకి కట్టుబడివుండటంవల్ల. ఎప్పటికప్పుడు అన్వేషించుకోవలసిన భారం తప్పింది. ఒక్కసారి నిర్ణయం చేసుకు, ఆ నిర్ణయానికి లోబడివుండటంతో, ఎప్పటికప్పుడు వెతుక్కోవడమనే యాతననుంచి విముక్తిపొందాడు. ప్రతి విషయానికీ అనుక్షణమూ మనం ఎంచుకోవలసివస్తే, మనకీ మతులుపోతాయి. ఎంచుకోగల సామర్థ్యం మానవుని ప్రజ్ఞ లలో ఒకటి - కాని ప్రతి చిన్నవిషయానికీ ఈ ప్రజ్ఞని విని యోగించపనిలేదు. కొన్ని ప్రధానవిషయాలు, అనేకమైన చిన్నవిషయాలని, వాటంతటవే నిర్ణయించేస్తాయి.

పరస్పరవిరుద్ధమూ వినాశకరమూ కాని స్వాతంత్ర్యం ఎటువంటిదంటే, స్త్రీ పురుషులు వారివారి పరిమితఅవకాశా లలో స్వయం నిర్ణయాలుచేసుకోగల స్వేచ్ఛవంటిది. నిజ

మైన స్వాతంత్ర్యం గలవ్యక్తి తాలూకు ప్రవర్తన, అతని హృదయబోధ ననుసరించివుంటుంది, మనిషిలో అనేకవిభాగాలువున్నాయి - వీటన్నిటికీ సమన్వయం కుదిరినప్పుడే పరిపూర్ణతఏర్పడుతుంది. ఒక లక్ష్యసిద్ధికోసం పాటుపడే వాని జీవితంలో ఉదాత్తత కనిపిస్తుంది; ఆ లక్ష్యంకోసం కష్టనిష్ఠూరాలని చిరునవ్వుతో ఎదుర్కొగల అతని గంభీరతపట్ల మనకి గౌరవంకలిగి తీరుతుంది.

'దేనినుంచి స్వాతంత్ర్యం' గాక 'దేనికొరకు స్వాతంత్ర్యం' అని అనిపించిన నాడే దానిలోని ఘనత అర్ధమై, 'శిక్షణ'ని శిరసావహిస్తాము. స్వాతంత్ర్యం అనే దాని కిమ్మత్తు 'శిక్షణ' - శిక్షణ అనుబాట వెంట నడిస్తేగాని ప్రయాణం ఫలప్రదమవదు. ఆధునికుడు ఈ పరమసత్యాన్ని అంత తొందరగా అర్థం చేసుకోడు - అంగీకరించడు. సనాతనత్వం (ప్యూరిటానిజం) నుంచి మనం ముందుకొచ్చేశాము కాబట్టి, గడియారం ముల్లులను మళ్లీ వెనక్కి తిప్పడమెందుకని ప్రశ్నిస్తారు చాలామంది. నిజానికి మనం గడియారం ముల్లులు ఎంత మాత్రం వెనక్కి తిప్పలేము. మానవ పరిణామ దశలో మనమే అఖండులమనుకోవడం పొరబాటు. మానవ విజ్ఞానమంతా మనతోటే పుట్టలేదు; మన పూర్వీకులకి కూడా కొన్ని తెలుసు; వారిదగ్గరనుంచి తెలుసుకోవలసినది ఎంతైనా వుంది. మన బుద్ధి విశేషంలోని చవకదనానికి మూల కారణం, పాతదన్న ప్రతిదీ తోసిపారేసి వేళాకోళం చేయడమే. 17-వ శతాబ్దపు ప్రజలకి ఆత్మనిగ్రహమూ క్రమ జీవనమూ ఉత్తమ లక్షణంగా అగుపడేవి; లక్షలాది ప్రజలకి అది ఆదర్శ జ్యోతిగా వెలుగొందింది అనాడు.

'శిక్షణ' (డిసిప్లిన్) అను మాట పైకి చెప్పేటప్పటికి మనం చీకాకుపడ్డా, శాస్త్రీయరంగంలో, కళారంగంలో, వ్యాయామ రంగంలో ప్రతి చోటా ఆ శిక్షణ లేనిదే ఒక్క అడుగుకూడా ముందుకి పడటం లేదు. సుశిక్షితుడు కాని వాడు శిఖరం చేరుకోలేడు. ఒక రచయిత పుస్తకం అచ్చు మొగం చూడటానికి ముందు, ఎన్నో సంవత్సరాలు అతను అజ్ఞాతంగా పడివుండి, సుశిక్షితమైన శైలిని అలవరుచుకో వలసి వుంటుంది. అదేవిధంగా సంగీత కళాకారుడు కూడాను. అతని పాటలను ప్రజలు ఆనందించేందుకు, ఎన్ని సంవత్సరాల శిక్షణ కావాలో!! ఇటువంటి శిక్షణ పొందిన వ్యక్తే, నిజ స్వతంత్రుడవుతున్నాడు. సుశిక్షితుడు కానివాడు పియానో ముందు కూచుని వాయిస్తే ఎవరు వింటారు? శిక్షణ అను ధర చెల్లించి, స్వతంత్రత పొందడ మవుతుంది యిలాటి విషయాలలో. స్వాతంత్ర్యమనునది జన్మతా వచ్చేదికాదనీ, కష్టపడి సంపాయించుకోవలసిన సంపద అనీ యిటువంటి ఉదాహరణలవల్ల మనకి మరింతగా స్పష్టమవుతుంది.

శాస్త్రపరిశోధనలతో పరిచయం వున్నవారికి, ఆ రంగంలో ఎటువంటి శిక్షణ కావాలో యిట్టే తెలుస్తుంది. సైన్సు అనగా కొన్ని నమ్మకాల పట్టిక, కొన్ని సిద్ధాంతాల సముహము కాదు – అది ఒక పద్ధతి. ప్రయత్నము, పరీక్ష, ప్రమాణము - ప్రమాణబద్ధం కానిది ఆమోదయోగ్యం కానేరదు. సుశిక్షణవల్లగాని సత్య సమ్మతమగు నిరూపణాదృష్టి అలవాటవదు. ప్రమాణం ఆధారంగా చేసుకు, గతుకుల రోడ్డమ్మట

ప్రయాణం చేయవలసి వుంటుంది సైంటిస్ట్. పరిశోధన ఎప్పుడూ తను అనుకున్న విధంగా రూపొందదు - దాని మార్గమేమిటో తను తెలుసుకోవాలి.

నైతిక ధర్మాలుకూడా యిదే విధంగా సాక్షాత్కరిస్తాయి. సైంటిఫిక్ నిర్ణయంలో భిన్నాభిప్రాయాలకి ఆస్కారం లేనట్టే నైతిక నిర్ణయాల సందర్భంలోకూడా వుండదు. సందర్భోచితమూ సమంజసమూ అయిన శిక్షణకి లోనైన వారి నిర్ణయాలెప్పుడూ గౌరవింపదగ్గవే! శిక్షణ ఎంత ఆవశ్యకమైనదో తెలుసుకోనప్పుడు, స్వాతంత్ర్యం (ఫ్రీడమ్) మానవ జాతికి మేలుచేయడం మాట అటుంచి, సమస్తమూ తలకిందులు చేస్తుంది.

శిక్షణ అనునది ఎంత అవసరమో, జనబాహుళ్యానికి విప్పి చెప్పగల ఫిలాసఫీ మనకి కావాలి ఈనాడు - చేతులు కాలక పూర్వం ఆకులు పట్టుకోవాలి, నియంతృత్వపాలన లోని కట్టుబాట్లకీ, ఈ శిక్షణకీగల తేడానికూడా ప్రజానీకం తెల్సుసుకోవాలి. కుడి ఎడమలలో పడకుండా మధ్యే మార్గం అవలంబిస్తూ, ఆత్మశిక్షణవైపు దృష్టిని కేంద్రీకరించాలి. అందరికోసం కష్టపడటంలోని గొప్పదనమూ, అందరికోసం పాటుబడటంలోని ఉత్కృష్టత స్త్రీ పురుషులు యావన్మందికీ అర్థమయేటట్టు చెప్పి, వారిని ఆ ఉదాత్త జీవనంవైపు మళ్లించాలి. రాగంలోకంటె త్యాగంలో విరాగంలో వున్న ఘనత మనుష్యులు గుర్తించాలి. తమ యిల్లే స్వర్గం, తమ కడుపే కైలాసం, అని తలపోసే మనుషులు, తమ స్వార్ధ చింతనకి

సిగ్గుపడి, ప్రయోజనకరమగు జీవితాలవైపు దృష్టి మళ్లించే టట్టు చేయాలి.

ఇది మంచి, యిది చెడు-అని గీయబడ్డ గీతలు మానవులు గీసినవికాదు; అతి నైతిక ధర్మ నిర్ణయాలు. సహజ న్యాయం (నాచురల్ లా) ఎంత నిజమో, నైతిక న్యాయం (మోరల్ లా) కూడా అంతే నిజం. ఏది యేమిటో విడమరిచి తెలుసు కునేందుకు కొంచెం శ్రమపడాలి. శిక్షణవల్లగాని నైతిక న్యాయమంటేనూ, నైతిక ధర్మమంటేనూ, నైతిక సూత్రా లంటేనూ అర్థం కావు. ప్రస్తుతంలో మనం, నైతిక విలువల మీద గౌరవం వుంచాలి. మనకి గౌరవం లోపించిందా, మనం యింత గొప్పగా చెప్పుకుంటున్న స్వాతంత్ర్యం కాస్తా చెయి జారిపోతుంది. 'నైతికం, నైతికం అని పదేపదే అంటున్నారు,- ఆ నైతికక్రమానికి అర్థమేమిటి?' అను ప్రశ్నకు సమాధానం తర్వాత ప్రకరణలో దొరుకుతుంది.

---

5

# వ్యక్తిపట్ల గౌరవం

"ఒక వ్యక్తుల కూటమిలో వ్యక్తివలె ప్రవర్తించడమే నీతికి మూలము - వ్యక్తిత్వాన్ని గౌరవించగలగడమే సమాజానికి పునాది."

— విలియమ్ టెంపుల్

బ్రతుకుతెరువుకోసం పోరాడుతున్న ప్రతివ్యక్తికీ తనచుట్టూ తనలాటివాళ్ళు వేలకొద్దీ కనిపిస్తారు - వాళ్ళు తనకి ఒక విధంగా పోటీదార్లు. మహమ్మారి జాడ్యమొకటి వచ్చి, మనుషులందరూ చనిపోయి, ఒకేఒక్కడు మిగిలివుంటే, అప్పుడు నీతి అనే మాటకి అర్థంలేదు. నీతి అనగా దగ్గిర వాళ్లతోటీ దూరపువాళ్లతోటీ మనకివుండే బాంధవ్యం. ఈదగ్గిర వాళ్లూ దూరపువాళ్ళే మనకి సుఖదుఃఖాలు కలిగిస్తున్నారు. అసమానమైన సుఖమూ అత్యంతమైన దుఃఖమూ మనకి యితరులవల్లనే కలుగుతున్నాయి. ఆ "యితర వ్యక్తులు" లేనిదే మనకి ఆనందమూలేదు, విషాదమూలేదు. ఇతరులు లేని జీవితంలో సమస్యలులేవు - జీవనమే అర్ధరహితంగా తోస్తుంది. ఇతరులతో మనకి గల సంబంధ బాంధవ్యాలే 'నీతి' అను పదంలోకి కొంతవరకూ యిముడుతాయి. మనిషి తనకి తానుగా చేసుకోవలసినవి కొన్నివున్నాయి - కాని యిత రులపట్ల అతనికిగల బరువు బాధ్యతలతో పోల్చిచూస్తే, తనకి చేసుకోవలసినవి బహుస్వల్పం.

జీవితంలో చాలాభాగం మనము ఏవో తయారుచేస్తూనో, తయారైనవి బాగుచేస్తూనో గడుపుతాము. యంత్రాగారాలలో (ఫ్యాక్టరీలు) మనుషులు సమూహపద్ధతిని పనిచేస్తారు. ఫిజిక్సు లోని రహస్యాలు తెలుసుకోవడం సామాన్యులకి కష్టమే; కాని

ఆ తెలుసుకున్న రహస్యాన్ని పదిమందీ పంచుకోవడం తేలిక. అణుశక్తి ఫాక్టరీలలో పనిచేసేవారికి అణువిచ్ఛేదన (అటామిక్ ఫిషన్) గురించి తెలియవలసిన పనిలేదు. యంత్ర సంబంధమైన సమస్యల్ని మనం అద్భుతంగా పరిష్కరించ గలిగాముగాని, మానవ సంబంధమైన సమస్యలదగ్గిరికి వచ్చే వేళకి, మన ప్రజ్ఞ వృధాఅయింది. సైంటిస్టులు లేకుండా సైన్సులేదు. కాని, ఈ సైంటిస్టులు కూడా మానవ మాత్రులవడంవల్ల తత్సంబంధమైన సమస్యలు వీరిని పీడిస్తున్నాయి. భౌతిక స్వభావానికి చెందిన సమస్యలని సులువుగా పరిష్కరించగలిగి, నైతిక స్వభావం దగ్గిరికి వచ్చేటప్పటికి విఫలుల మవడానికి కారణం, భౌతిక శక్తులది పైచేయి కావడముకాదు - రెండోవాటితో పోల్చిచూస్తే మొదటివి అంత కష్టతరమైనవికాదు.

నిత్యజీవితంలో ఒక క్రమ విధానం వుంటేనేగాని మనం యితరులతో సరిపెట్టుకోలేము. మానవజాతిలోని ప్రతిభావంతులు వివేకధర్మం గురించి ఎంతగానో ముచ్చటించారు. అనుభవజ్ఞులు చెప్పిన మాటలు అక్షరాలా పాటించలేక పోయినా, వాటిని వో చెవినేసుకు ముందుకు సాగుతోంది మానవ సంస్కృతి. మానవులందరూ ఒకటే అను సిద్ధాంతాన్ని అంగీకరించి, మానవాత్మకి గౌరవం యిచ్చి, బానిసత్వాన్ని చట్టరీత్యా రూపుమాపేందుకు 1800 సంవత్సరాలు పట్టింది - మానవుని సహజ గౌరవం గుర్తించేందుకు 1800 సంవత్సరాలు పట్టిందన్నమాట. ఈ భౌతిక ప్రపంచమూ నైతిక ప్రపంచమూ మనం అనుకునేదానికంటె చాలా పెద్దవి.

''జంతువులకి జ్ఞానలేమి సహజం - కాని మనుషుల్లో అది వుండకూడదు,'' అన్నాడు బొథియస్. మానవుడనగా ఎవరో తెలుసుకున్నమీదట, అతనిని గౌరవించడం మనకి చేతనవుతుంది. మానవుడనగా ఒక వ్యక్తి - మంచీ చెడూ నిర్ణయించుకోగల శక్తిగల వ్యక్తి. మిగతా ప్రాణికోటిలో మెదడువున్న జంతువులు చాలా ఉన్నాయి. హేతు పరిశీలన 'ప్రైమేట్'కికూడా ఉండేది. కాని మానవుడు హేతుపరిశీలనతో ఆగడు. హేతుపరిశీలనచేసే ప్రాణి, తన ఆకలి తీర్చుకునే మార్గం వెతికి, ఆకలి తీర్చుకోవడంతో తృప్తిపడుతుంది; మానవుడు తనకి ఆకలి అవుతోందా, అవతలి వస్తువు కావాలా? - అను ప్రశ్నతో ప్రారంభిస్తాడు. వెనక మనం చెప్పుకున్నట్టు 'అది నాకెలా వస్తుంది?' అనే తపనకీ, 'అది నాకు కావాలా?' అనే యోచనకీ సహస్రాంతం తేడా లేదూ? ఈ రెండూ వేరువేరు. ఈ రెండవ ప్రశ్న అడగడం నేర్చుకున్నాకనే, మనిషి మానవుడయాడు. ఆనాటినుంచే అతనిలో వ్యక్తిత్వమనునది ప్రకాశింప నారంభించింది.

మానవునికీ మిగతా జీవరాసులకీ గల ముఖ్యమైన తేడా అదొక్కటే. దేహ నిర్మాణంలో మానవుడేమంత ఘనుడు కాడు. పోతే, చేతులు వుపయోగించగల జంతువులూ, పెద్ద మెదడుగల జంతువులూ, నుంచుని నడవగల జంతువులూ అనేకం ఈ పృథ్వీమీద పుట్టాయి. కాని మానవుని గొప్పదనం అతనిలోగల వ్యక్తి ప్రకాశతే! ప్రాణికోటి అంతటిలోకీ నవ్వ గలిగినవాడు మానవుడొక్కడే! మానవునికి ప్రసాదింపబడ్డ వరమది. అలా అని, అయినప్పుడూ కానప్పుడూ నవ్వితే బావుంటుందా ?

వ్యక్తిత్వ పరిణామం ఒక్కరోజులో అభివృద్ధి చెందేదా, ఎంతకాలమో పట్టింది. ఈ భూమండల చరిత్రలో మానవోదయం నిన్నమొన్న జరిగిన సంగతి. మానవుడు పుట్టడానికి కొన్నికోట్ల సంవత్సరాల పూర్వంనుంచీ ఈ భూమి ఉంది. మానవుడు వుద్భవించేనాటికే, ఈ పృథ్వీతలంమీద రకరకాల జీవరాసులు వున్నాయి. శాస్త్రవేత్తలు చెప్పేదానినిబట్టిచూస్తే, ఈ భూమి మొట్టమొదట ఒక పెద్దముద్ద - పదార్ధపు ముద్ద. అందులో సముద్ర కెరటాలూ వెర్రిగాలులూ విపరీతంగా ఉండేవి - ప్రాణి అంటూ వుండేదికాదు. మొదట వృక్ష సంతానం జన్మించింది; ఆపైన జంతు సంతానం. జంతువులలో కదలిక, చైతన్యం వృద్ధిచెందాయి. ఇక్కడ చైతన్యమనగా కాన్షస్‌నెస్ - పరిసరాలు గుర్తించగల శక్తి. పదార్ధం తర్వాత ప్రాణము, ప్రాణం తర్వాత జంతువు, జంతువు తర్వాత వ్యక్తిప్రకాశతగల మానవుడు వుద్భవమందారు. ప్రాణికోటిలో వ్యక్తిత్వమనునది ఒక పైమెట్టుగా అంగీకరించక తప్పదు. మన భూమండలపు చరిత్ర వేరు వేరు అంతస్తులకి సంబంధించిన చరిత్రగా మనం భావించాలి. ఒక మెట్టుపైన ఒకమెట్టు, ఒక అంతస్తుపైన ఒక అంతస్తు ఉంటాయి. ఆరంతస్తుల మేడలో, కింద అయిదు అంతస్తులూ లేకుండా, మేడ ఎలా నిలబడుతుంది ? పై అంతస్తు గురించి మాట్లాడుతున్నపుడు కింద అంతస్తులన్నీ వున్న విషయం వొప్పుకుంటున్నట్టే ! అంతస్తులు ఈ విధంగా ఉంటాయి :

(1) చైతన్యలేమి (అన్‌కాన్షస్‌నెస్).

(2) చైతన్యము (కాన్షస్‌నెస్).

(3) వ్యక్తిచైతన్యము (సెల్ఫ్ కాన్షస్‌నెస్).

వ్యక్తిచైతన్యం విషయంలో కొంతలోతుకివెళ్లి పరిశీలిస్తే, మానవునిలోని త్యాగనిరతికీ అధఃపతనానికీగల కారణాలు కనిపిస్తాయి. వ్యక్తి చైతన్యంగలవాడే తనకోర్కెల విషయంలో సాటిలేని నిగ్రహం చూపగలుగుతాడు; అతనే అధికార తృష్ణకిలోబడి లక్షలాదిప్రజలని నరకకూపంలోకి దింప గలడు. నెమలివంటి వాటికి ఆడంబరము (వానిటి) మాత్రమేఉంది; కాని మానవునికి అహంకారంతో కూడిన గర్వం (ప్రైడ్) ఉంది. ప్రదర్శనవల్ల ఆడంబరము తృప్తి పడుతుంది; కాని 'అహం' (ప్రైడ్) వుందే, అది మానవుని ముందుకి తరుముతుంది. అనేకమైన శాస్త్రపరిశోధనలకి ఈ 'అహం' ('ప్రైడ్') - మూలం. అలాగే అనేకులు బాధలపా లయేందుకు కూడా యిదే కారణమవుతోంది. మానవుని వ్యక్తిత్వం గురించి ఒక్కముక్కలో చెప్పడం చాలాకష్టం - పరస్పర విరుద్ధాలకూటమి అతనిస్వభావం. మానవుని ఔన్నత్యం కొనియాడటం ఎంత పొరబాటో, అతని హీనత్వం చెప్పడం కూడా అంతే పొరబాటు. అతను ఉత్తమోత్తముడు, నీచాతినీచుడు కూడా - ఈ రెండూ తనే వొప్పుకుంటాడు; అక్కడేవుంది తమాషా. పాస్కల్ పలుకులు ఈ సంద ర్భంలో జ్ఞప్తికి తెచ్చుకోదగినవి :

"తనంత దౌర్భాగ్యుడులేడని తెలుసుకోవడమే అతని లోని గొప్పదనం. ఒకచెట్టు తను కష్టపడుతున్నానని తెలు

నుకోలేదు. మనం కష్టపడుతున్నామని మనం తెలుసు కోవడం దౌర్భాగ్యంకాక మరేమిటి? ఆ దౌర్భాగ్యం గుర్తిం చడంవల్లనే మానవుడు గొప్పవా డవుతున్నాడు."

వ్యక్తి ప్రకాశతవైపుగా సృష్టిపరిణామం, యిన్ని లక్షల సంవత్సరాలు ప్రయాణించేయడం, మానవాళికి ఆశ్చర్యకర మైన విషయం. ఇతర గ్రహాలలోనూ యితర సౌరమండ లాలలోనూ ప్రాణసంబంధమైన దేదైనావున్నదో లేదో మనకి తెలియదు. ఈ భూమండలంమీద ప్రాణంకంటె ఉన్నత మైన వ్యక్తిత్వం ఉద్భవమందినట్టే, వ్యక్తిత్వంకంటె ఉన్నత మైనది మరొక టేదైనా జనించవచ్చు - అది యివ్వాళ రేపట్లో అయేపనికాదు. ఏమైనా అది వ్యక్తిత్వధర్మానికి అతీ తమైవుంటుందిగాని వ్యతిరేకమైఉండదు. జడమునుంచి చేతనము, చేతనమునుంచి వ్యక్తిత్వము, వ్యక్తిత్వమునుంచి మరొకటి – యిలా మెట్లు వారీగానేఉంటాయి గాని మరొక విధంగా కాదు.

దైనందిన జీవితంలో వ్యక్తులకీ వస్తువులకీ బోలెడంత తేడావుందని మనందరికీ తెలుసు. వస్తువులని మన యిష్ట మొచ్చినట్టు వుపయోగించుకోవచ్చు; ఎంచేతనంటే, అవి చేతనారహితములు. రెండు మంచుగుట్టలు ఒకేవిధంగా ఉండవు; రెండుచెట్లు ఒకేవిధంగా ఉండవు; వాటిలో పోలి కలు ఉన్నప్పటికీ తేడాలుకూడా కనిపిస్తాయి. కాని, నిత్య కృత్యంలో వాటిలోని తేడాలు మనని అంతగా బాధించవు. రెండు బొగ్గుగడ్డలు చూపులకి వేరువేరుగా కనిపించినా,

వాటిలోవుండే రసాయనద్రవ్యాలు ఒకటే అవడంవల్ల, శాస్త్ర పరిశోధనా సందర్భంలో వాటి ఆకారాలతేడా, మనకి యిబ్బంది కలిగించదు. వాటికి 'అసలువిలువ' (ఇన్‌ట్రిన్‌సిక్ వాల్యూ) అంటూలేదు. మనకి ఉపయోగపడగల విలువే వాటి విలువ కాని మానవులదగ్గిరికి వచ్చేటప్పటికి ప్రతిమనిషికీ 'సహజవిలువ' అంటూఉంది. వస్తువులతోచేసిన ప్రయత్నాలవంటివి మనుషులతో చేయలేము కదా!

వేటిగురించి పరిశోధనజరపవచ్చు, వేటిగురించి జరపకూడదు - అని గీసుకునేగీత అతిముఖ్యమైనది. ఆ గీతకి అడుగునున్నవాటలో సమూహగుణం (గ్రూప్ కేరక్టరిస్టిక్) ప్రధానంగాని వ్యక్తిత్వంకాదు. ఆ గీత ఏ విధంగా గీయాలనే విషయమై వాదోపవాదాలు ఉన్నాయి. కాని ఎక్కడో ఒకచోట ఆ గీత గీయకతప్పదు. జంతువులనికోసి పరిశోధనలు సాగించడం (వివిసెక్షన్) తప్పు అని అనేవారు, మొక్కల విషయంలో ఆ దాక్షిణ్యం అనవసరమంటున్నారు. మరి, మొక్కలకి మాత్రం ప్రాణంలేదా? సాధుజీవనుడైన డాక్టర్ అల్బర్ట్‌ష్వైట్జర్, 'వివిసెక్షన్' కూడా కొన్ని సందర్భాలలో ఆమోదయోగ్యం - అని అంటున్నాడు.

జంతువులమీద మనం జరుపుతున్న ప్రయోగాలవిషయంలో, ఎవరికి ఎటువంటి అభిప్రాయాలువున్నప్పటికీ, మానవుల విషయంలో అదేవిధంగా పరిశోధనలు జరపదలుచుకున్నామని అంటే, ఎవరూ వొప్పుకోరు. ఏదైనా ఒక రుగ్మతకి సంబంధించిన పరిశోధనలో, ఎవడైనా సాహసించి

తనమీద ప్రయోగం జరిపేందుకు వొప్పుకున్నాడంటే, అతని ధైర్యసాహసాలకి మనం జోహారులర్పిస్తాము. అంతేగాని మానవులందరూ ప్రయోగశాలలోని వస్తువులు కానేరరు. అటువంటి దృక్పథం మానవ గౌరవాన్ని కించపరుస్తుంది. ప్రతిమనిషి సమస్య ఒక్కొక్క ప్రత్యేకతతో ఉంటుంది. ఒక మహాయంత్రంలోని భాగాలుగా మానవులని పరిగణించ లేము - అసలు మానవాళి యంత్రమువంటిది కానేకాదు. జనసమూహంలో తను 'మరొక మనిషికాదు' మానవు డన్న వాడు. ప్రతి మనిషిలోనూ పరిపూర్ణతఉంది. ప్రతి మనిషికీ వాంఛలూ ఆశలూ ఆశయాలూవుంటాయి. అడుగడుక్కీ అతని వ్యక్తిత్వమే, అతనిని ముందుకి వెనక్కి నెట్టుతూ వుంటుంది. యంత్రంలో ఒకభాగం పోయినప్పుడు, అలా టిదే మళ్లీ అతికిస్తే యంత్రం చక్కగా పనిచేస్తుంది - కాని మానవుడు అట్లాకాడు.

దేహనిర్మాణానికిచెందిన ఈ అవయవాలూ ఆకారమూ గాక, తను ఒక వ్యక్తిననే భావన, మానవునికి విలువనిచ్చి, విలువలు కల్పిస్తోంది. పరిశీలనాదృష్టి లేనిబ్రతుకు, అదీ ఒక బ్రతుకేనా - అన్న సోక్రటీస్ మాటలు మరుపురానివి. తమ జీవితాన్నివొడ్డి అయినా సరే, కాపాడుకోగల విలువలు కొన్నివున్నాయని, ఉచితజ్ఞులందరికీ తెలుసు. మన ప్రాణం కంటె ఉన్నతమూ ఉదాత్తమూ అయినవవి. అవే మనకీ మనతోటివారికీ వేగుజుక్కవంటివి.

మిలిటరీ అధికారులు కొందరు మనుషుల్ని వ్యయం చేసినా (ఎక్స్పెండబుల్), ఫరవాలేదని తేలికగా అనే

స్తారు. 'ఎక్స్‌పెండబుల్' అనేది మిలిటరీవారి పారిభాషిక పదం. మనుషులలో కొందరు దుష్టులు, కొందరు నీరసులు అంటే బాగావుంటుందిగాని, వారిని ఫిరంగులకి ఫలహారంగా వేయగల అధికారం మన కెవరిచ్చారు? ముఖ్యంగా యుద్ధ సమయాలలో మనిషిని మనిషిలాగాక, వస్తువు కంటె హీనంగా చూడవలసిరావడం మన దురదృష్టం.

మనం ప్రజాస్వామ్యం గురించి నొక్కి వక్కాణిస్తూంటాము. అదేమిటో తరిచితరిచి అర్థం చేసుకోకబోతే, మామూలు రాజకీయ నినాదాలకివలె అదికూడా బూజుపట్టి పోతుంది. అబ్రహిమ్ లింకన్‌వంటి మహానాయకుడు మానవునిలోని సహజఔన్నత్యాన్ని గుర్తించాడు కాబట్టే, ఘనవిజయాలు సాధించగలిగాడు. మనుషులందరూ సరిసమానులు అని ఆయన అన్నప్పుడు ప్రత్యర్థులు వేళాకోళంచేశారు. బుద్ధి విశేషంలో, ధైర్యసాహసాలలో, దేహబలంలో, సహజ సంపదలో మనుషులందరూ సమానులా? - అని ఎద్దేవా చేస్తూ ప్రశ్నించారు. నీగ్రోలు తెల్లవారికంటె తక్కువవారని వారి నమ్మకం. "మానవులందరూ సరిసమానులు అనడంలో, ఆత్మగౌరవం విషయంలో సరిసమానులు. సమర్థతలోనూ తెలివితేటలలోనూ తేడావుండవచ్చుగాని ఆత్మగౌరవం విషయంలో అందరూ ఒక్కటే" అంటూ లింకన్ నీగ్రోల గురించి యిలా అన్నాడు:

"తమకి తాముగా కష్టపడి సంపాయించుకున్న ఆహారం తినేందుకు తెల్లవాళ్లకైనా నల్లవాళ్లకైనా ఒకేమాదిరి హక్కు

వుంది. నల్లవాళ్ళు తాము పండించుకున్నదానిలో ఎక్కువ భాగం తెల్లవాళ్లకియిస్తూ, తమకని కొంచెమే వుంచుకుంటు న్నప్పటికీ, ఆ కొంచెంకూడా తినే హక్కు లేదా ?"

అని మొహం వాచేటట్లు అంటాడు ప్రత్యర్థులతో అబ్రహిమ్ లింకొన్.

పాశ్చాత్యలోకానికి నైతిక సూత్రావళి సమర్పించాడు ఇమాన్యుయల్ కాంట్. ఆయనకి మనమెంతగానో ఋణ పడివున్నాము. డ్యూటీ అనునది ప్రతిమనిషిలోనూ ఒకభాగ మన్నాడాయన. కొన్ని లక్ష్యాలకోసం మనం కొన్ని పనులు చేయవలసివుంటుంది - ఆ లక్ష్యాలమీద దృష్టిలేనప్పుడు ఆ పనులు చేయదగు అవసరం వుండదు. చక్కని ఆటగా డయేందుకు, ఒక మనిషి ఆ ఆటలో ప్రావీణ్యత పొందవల సిన అవసరముంది. చక్కని ఆటగాడు అవదలుచుకుం టేనే, ప్రావీణ్యత గురించిన ఈ అవశ్యకత. నైతిక కర్త వ్యాలుకూడా యిదేవిధంగా ఉంటాయి. మనుషుల్ని వస్తువ లుగా పరిగణించనీయదు నైతిక ధర్మం.

నైతిక సూత్రాలు జీవితానికి అవసరమని వొప్పుకుంటే, నైతికధర్మాన్ని వొప్పుకుంటున్నామన్నమాటే ! ప్రతి మనిషీ స్వయం సంపూర్ణుడు. అందరు మనుషుల్నీ స్వయం సంపూ ర్ణులుగా భావించిననాడే సుజీవనానికి (గుడ్‌లైఫ్) సావ కాశం కలుగుతుంది. ప్రతి ఒక్కరమూ మన వ్యక్తిత్వము గౌరవింపబడాలని కోరుకుంటాము. మనం నమ్మినవారూ, మనవల్ల సహాయం పొందినవారూ, మనని విస్మరించినపుడు

బాధ కలుగుతుంది. సంఘమనే నిచ్చెనలో రెండు మెట్లు పైకి వెళ్లగానే, వారు మనలను విస్మరించితీరుతారు. వారు ఆ విధంగా మనలను మర్చిపోయినట్టు ప్రవర్తించడానికి కారణం, వారిలోని నైతికపతనమని మనకు తెలుసు. తమ పురోభివృద్ధికి వారు మనని ఉపయోగించుకున్నారు - అంతే, అంతకంటె ఏమీలేదు. మనిషిని వస్తువవలె ఉపయోగించు కోవడంవల్లనే, మనం వారిని ఏవగించుకొనక తప్పదు. అంచేత ఉదాత్తజీవనానికి ప్రధానధర్మం ఏమిటంటే: మానవులని స్వయం సంపూర్ణులుగా చూడవలెనేగాని వస్తువుల మాదిరి పరిగణించకూడదు.

ఇది కొత్తగా పేర్కొన్న పరమసత్యమేమీకాదు - తరతరాలుగా మానవులు ఒకరికొకరు చెప్పుకుంటున్న సువర్ణనీతి. "నిన్ను నీవు ప్రేమించుకున్నట్టే నీ పొరుగువాడిని కూడా ప్రేమించు," అని ఇజర్‌లైట్స్ ఏనాడో అన్నారు. మనని మనం ఎంతగానో ప్రేమించుకుంటాము – ఆ సంగతి అందరికీ తెలిసినదే! మనక్షేమం మనం ఆలోచించుకుంటూ, యితరులు మనని స్వయం సంపూర్ణులుగా చూడాలని కాంక్షిస్తాము. తమ స్వభావానికి యితరులు మనలను ఉపయోగించుకోజూస్తే, వేదన కలుగుతుంది. 'నీతి' అనునది స్వపర అపర భేదాలు లేనిదిగా ఉండాలి. హేతువుకి అతీతమైనది నీతి. ఎలాగంటే, ఫలానా కారణాలవల్ల ఫలానా పని చేశానని చెప్పబూనడం అసందర్భం. మనక్షేమం ఎలా కోరుకుంటామో, అదేవిధంగా పరుల క్షేమంకూడా కోరగలిగిన నాడే, అది నీతి అనిపించుకుంటుంది. అటువంటి దృక్పథం

వల్ల మన ప్రవర్తనలో నైతికధర్మం కొంతవరకూ ప్రవేశిస్తుంది. ఒక సైంటిస్ట్ శాస్త్రపరిశోధన జరుపుతున్నపుడు తన యిష్టాయిష్టాలను తన స్వంత అభిప్రాయాలనీ దూరంగా అట్టే పెడతాడు. అతని మనసు అద్దంవలె ఉంటుంది. ప్రయోగ ఫలితమైన సత్యమే, ఆ అద్దంలో ప్రతిబింబిస్తుంది. నైతిక ధర్మమనునదికూడా ఆ మాదిరి అద్దంవలె ఉండాలి. నైతిక విషయాలలో తనదీ యితరులదీ అనే భేదబుద్ధి ఉండకూడదు. బయటివాళ్లకని సూచించే పడికట్టురాళ్ళు, మన ప్రవర్తన విషయంలో కూడా అన్వయింపజేసుకొని, నీతికి కొద్దీగొప్పలతో ప్రమేయంలేదని గ్రహించాలి. తనెంతో లోకమంత - అని సామాన్యుడు అనుకున్నా అనుకోకపోయినా సజ్జనుడు అనుకుంటాడు. తను ఆచరించలేనిది యితరులని చేయమని అడగడు ఉత్తముడైనవాడు. ఈ లెక్కన వ్యక్తి ప్రకాశతకి మూలస్తంభం ఎటువంటిదంటే, తను స్వలాభాలకీ స్వప్రయోజనాలకీ అతీతుడు కావాలనే ఆశయానికి కట్టుబడివుండటం.

పాశ్చాత్యలోకంలోని న్యాయధర్మం (జెస్టిస్) ఈ వ్యక్తి ప్రకాశతని గుర్తించింది; నిత్యకృత్యంలో యిది సాధ్యంగాకపోయినా, సిద్ధాంతరీత్యా ఆమోదించింది. ప్రతివ్యక్తీ స్వయం సంపూర్ణుడు – అతనికొక సహజవిలువ ఉంది. ఆ విలువ దగ్గిరికి వచ్చేటప్పటికి తరతమ భేదాలులేవు. న్యాయ చట్టం దృష్టిలో అందరు వ్యక్తులకీ ఒకే ప్రతిపత్తి ఉంది; అందరి విలువా ఒకటే. న్యాయచట్టానికి అందరూ సరిసమానులవడం వల్ల, న్యాయస్థానంలో నిష్పక్షపాతమైన విచారణ జరిగే అవ

కాశం ఎక్కువ ఉంది. కాని, ఈ న్యాయస్థానాలు అక్క డితో ఆగి లాభంలేదు. నీగ్రోలకి శ్వేతజాతీయులకీ, యూదుకీ యూదులు కానివారికీ, కాథొలిక్స్‌కీ ప్రొటెస్టెంట్స్‌కీ, కాపిట లిస్టులకీ కమ్యూనిస్టులకీ, భాగ్యవంతులకీ బీదవారికీ, స్త్రీలకీ పురుషులకీ, పండితులకీ పామరులకీ - ఒకేమాదిరి న్యాయం ప్రసాదించగల స్థితికి రావాలి. పాశ్చాత్య ప్రపంచపు ఆశ యాలమీద విశ్వాసంలేనివారి ప్రాథమిక హక్కులని కూడా కాపాడగలగాలి పైన జెప్పిన న్యాయస్థానాలు. కమ్యూనిస్టులు సర్వసమానతని అంగీకరించకపోవచ్చు; కాని వారిని మనం మనలో ఒకరిగా చూడగలగాలి.

జాతి విచక్షణా సమస్య (రేస్ ప్రాబ్లమ్) అనునది పాశ్చా త్యపౌరుని నిలవదీసి ప్రశ్నిస్తున్న విషమ సమస్యలలో ఒకటి. మన ప్రజానీకంలో కొందరిని రెండవ తరగతి పౌరులుగా (సెకండ్-క్లాస్ సిటిజెన్స్) విభజించడమనేటంత నీతిమాలిన పని - అదేగాని మరొకటి లేదు. ఇది పూర్తిగా నైతిక సంబంధ మైన వ్యవహారం; మన దృక్పథం మారితేగాని ఈ సమస్య పరిష్కారం కాదు. వ్యక్తులు స్వయం సంపూర్ణులు, సర్వస మానులు అని అంగీకరించిననాడు 'జాతి విచక్షణ' సహింప రానిదవుతోంది. మొదటి భాగం వొప్పుకు, రెండవ భాగం విష యమై ఆలోచించడం లేదు మనం. అటువంటప్పుడు మొదటి భాగంకూడా కాలక్రమేణా పంకిలము కాక తప్పదు. అంచేత, మనం రంగు భేదమూ జాతి భేదమూ పాటించ కుండా పౌరులకందరికీ సమానావకాశాలు యివ్వాలి. రంగు కారణంగా వారు ప్రవేశించ కూడని ప్రార్థనాస్థలాలుగానీ,

విద్యాలయాలుగానీ, ఉద్యోగ సంస్థలుగానీ, వినోద మందిరాలుగానీ, ఆహార శాలలుగానీ వుండకూడదు. ఫలానా చోటుకి తమని రానివ్వరేమో అను భయం వారికుండకూడదు. జాతివిచక్షణని నిర్మూలించి, 'అమెరికను పౌరులందరూ ఒకటే' - అను విషయాన్ని క్రియా రూపేణా చూపేదాకా మన ప్రగల్భాలు ఎవరూ నమ్మరు.

మనం అవలంబించవలసిన ఈ నైతిక దృక్పథం పదార్ధ వాదం (అల్ ట్రూ యిజమ్) అని ఏనాటికి అనిపించుకోదు. ఇతరులనిమట్టుకే ప్రేమించమనిగానీ, మననిమనం ప్రేమించుకునేకంటె యితరులని ఎక్కువగా ప్రేమించమనిగానీ అనడం లేదు. మనపట్ల మనకి కొన్ని బాధ్యతలు వున్నాయి. మన బాధ్యతలేమిటో తెలుసుకునేందుకు, హేతువాద ప్రకారం పోవాలేగాని, ఉద్రేకభరితులం కాకూడదు. నైతికవాద మెప్పుడూ 'అహం' అనుదానికీ పరార్ధ వాదానికీ పైగా వుంటుంది. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, నీతికి స్వపర అపర భేదాలుండవనడమే.

ఏది రైటు, యేది తప్పు ? - అని నిర్ణయించుకునేందుకు దైనందిన జీవితంలో నైతికసిద్ధాంతం ఎంతగానోవుపకరిస్తుంది. ఏ పని చేయడానికైనా సరే ముందు, "ఈ పనివల్ల యితరులకి యేమి జరుగుతుంది, నాకేమి జరుగుతుంది?" అని ప్రశ్నించుకోవాలి. సంప్రదాయబద్ధంగా కొన్ని పనులు 'చెడు' అన్నారు, ఆ చెడు పనులలో కొన్ని అతి స్వల్పమైనవి వుంటాయి, కొన్ని పెద్దవి వుంటాయి. వీటిలో కొన్ని నిజంగా

చెడువికాకపోవచ్చు. మనం ఆ పని చేయడంవల్ల యితరు లకి హానికలిగే పక్షంలో నిక్షేపంగా అది చెడే. కానప్పుడు మనకి మనముగా ఆలోచించుకు, మనకి తోచినట్లు చేయ వచ్చు. ప్రతి పనికీ నైతిక విలువ వుందని నీతికోవిదులు అంటారు గాని, అవి స్వల్ప విషయాలైనప్పుడు, యితరులకి హాని కలిగించని పరిణామం గలవి అయినప్పుడు, అంత రాత్మ సూచించిన బాటవెంట మనం నడవ వచ్చు. అంతకి మించి మరొక మార్గం లేదు.

ఈ పద్ధతి ప్రకారం నడవటంవల్ల స్త్రీ పురుషులు సంప్ర దాయ శృంఖలాలనుంచి కొద్దిగా బయటపడగలుగుతారు; సంఘ శ్రేయమగునది యేదో అభివృద్ధి నిరోధకమగునది యేదో వారికి వారుగా తెలుసుకోగలుగుతారు; సంఘపు ముద్ర పొందిన పాతకాలపు ఆచారాలనుంచి బయటపడగల అవ కాశం జనిస్తుంది. ఈ పద్ధతి అవలంబించడంవల్ల అద్భుత మైన క్రమత, నీతివర్తనా వుదయిస్తాయి. మంచి పనులవల్ల మంచి ఫలితాలు వెంటనే కనపడకపోవచ్చు - కాని, కాలాను సారంగా కనిపించి తీరుతాయి.

నైతిక నిర్ణయాలు సర్వసామాన్యమైనవి కాదు - అవి ఎంతో బలవత్తరమైనవి, సాటిలేని ప్రభావంగలవీను. 1914లో జరిగిన ఒక ఉదాహరణ చెబుతాను. బెల్జియమ్ దేశస్తుడొకడు తన భార్యా బిడ్డలతో, ఫ్రాన్సువైపుగా పారి పోయి వస్తున్నాడు. ప్రథమ ప్రపంచ యుద్ధం ప్రారంభ మయింది - అప్పటికప్పుడే జర్మన్ బలాలు బెల్జియమ్ మీదకి

విజృంభించుకొని వచ్చేస్తున్నాయి. యుద్ధ ప్రదేశంనుంచి తప్పుకొని, సురక్షిత స్థానంలో తలదాచుకోవాలని ఈ బెల్జియమ్ రైతు, భార్యా బిడ్డలతో పారిపోయి వస్తున్నాడు. దురదృష్టం కొద్దీ జర్మన్ అశ్వికదళాలు అతనిని అడ్డగించాయి. అడ్డగించడంతో సరిపోయిందా? మిలిటరీ సమాచారానికి సంబంధించిన కొన్ని విషయాలు అతనిని అడిగారు. "నీకు తెలిసినది చెబుతావా, లేక నీ పెళ్లాం బిడ్డలని కాల్చేయమన్నావా?" అని అడిగాడు జర్మన్ అధికారి. బెల్జియమ్‌రైతు అప్పుడు ఏంచేయాలి? అతని డ్యూటీ ఏమిటి? దేశద్రోహంతోగాని భార్యాబిడ్డల ప్రాణాలుదక్కవు. బెల్జియమ్ రైతు ఆనాడు ఏంచేశాడనేది యిప్పుడు మనకి అనవసరం. పరిస్థితులు వ్యక్తుల్ని ఒకొక్కప్పుడు ఆ విధంగా యిరుకున పెడతాయి. పిడుక్కీ బియ్యానికీ ఒకమంత్రం కానట్టే, అన్నిసందర్భాలకీ ఒకేమాదిరి నైతికసూత్రం నప్పదు. సౌందర్యాన్ని ఆస్వాదించేందుకు మనలో సౌందర్యకాంక్ష ఎంత తీవ్రంగా ఉండాలో, అలాగే నీతిని గ్రహించేందుకు మనలో నైతికాదర్శం అంత ఎక్కువగాఉండాలి. సున్నితస్వభావం మనలో పెరిగిన కొద్దీ నైతికధర్మం మనకి అవగాహన అవుతుంది.

దైనందిన జీవితంలోని నైతిక సందర్భాలు తమాషాగా ఉంటాయి. కొన్నిచోట్ల నిజం చెప్పడంవల్ల అపకారం జరుగుతుంది. మనం చెప్పే నిజం, యితరులని బాధపెట్టేదిగా ఉన్నప్పుడు, అది పైకి అనకపోవడమే మేలు. సాధారణంగా అంతరాత్మప్రబోధాన్ని ఆలకిస్తూ ముందుకిసాగడం మంచిది- ఆ విధంగానైతేనే, మనలోని వ్యక్తి ప్రకాశతని పెంపొం

దించుకోగలుగుతాము. న్యాయానికికట్టుబడివుండటం పౌర ధర్మం. ఒకొక్కప్పుడు సాంఘికన్యాయమూ, అంతరాత్మ - ఒకదానితో ఒకటి ఏకీభవించక పేచీ పెడతాయి. నైతిక సందర్భమనునది ఎప్పుడూ ఈ స్వరూపంలోనేఉంటుంది. "అన్ని ప్రశ్నలకీ సమాధానాలు చెప్పేశాం; యింక ప్రశ్నలు లేవు" అనేవారికి ఏ సమస్యా అర్థం కాలేదన్నమాట. ఎవరి సమస్యలు వారికి ఎప్పుడూఉంటాయి. నైతికధర్మవిశిష్టతని ఆమోదిస్తూ, ఎవరి సమస్యలు వారు ఆలోచించుకోగల సిద్ధాంతభాగం ప్రతిపాదించడమే, మనం చేయగలపని. అనినమాట నిలబెట్టుకునేవారూ నిజాయితీపరులూ అయిన వ్యక్తులమీద మనకి - గౌరవంఉంటుంది; అబద్ధాలకోరులని మనం గౌరవించము. పైజెప్పిన గౌరవం పొందాలనే అభిలాష ప్రతివారికీఉంటుంది. మన ప్రపంచమెప్పుడూ మనకిగల వ్యక్తిగత బాంధవ్యాలతో కూడివున్నదే కదా! ఈ వ్యక్తిగత బాంధవ్యాలలో నిజాయితీ ప్రదర్శించలేకపోవడమనేది, యితరుల మంచితనాన్ని మనం దుర్వినియోగంచేస్తే తప్పు ఏర్పడదు. అంచేత మనం నిజాయితీ పరులమైతే, అవతల వారి 'మంచి'ని కూడా కొంతవరకూ కాపాడగలుగుతాము. ఒడంబడికలు వుల్లంఘించడం నేరం ఎందుకవుతోందంటే, ఒడంబడిక లనేవి పరస్పరవిశ్వాసంతో ఏర్పాటుచేసుకున్న కట్టుబాట్లు గనక, వాటిని ఛేదించిన కొద్దీ హాని మరీ ఎక్కువవుతుంది.

సిద్ధాంతాలని మాత్రమే పట్టుకు దేవుళ్ళాడే నైతికవాది కర్కోటకుడుకావడంలో ఆశ్చర్యంలేదు. లోకం చెడిపోతోం

దని నీతులు ఏ కరువుపెట్టే కఠినహృదయులు మనకి చాలా మందితెలును; తప్పు లెన్నడంతో తమపని పూర్తయిందని భావించే తత్త్వం వీరిది. నైతికవాదులైనా, సామ్యవాదులైనా రాతిగుండెలవారు మానవుల్ని సుఖపెట్టలేరు. నీతికోవిదుడు తననీతులు వల్లించీ, సామ్యవాది తన సిద్ధాంతాలు వొప్పజెప్పి ప్రజాహృదయంలో నిజచైతన్యం తీసుకురాలేరు. సిద్ధాంతవాదులు మనుషులందరూ సిద్ధాంతాలకే కట్టుబడి జీవిస్తున్నట్టుగా భావిస్తారు; అది నిజం కాదేమో! పూర్ణపురుషులూ మహనీయులూ మానవాళిని తమవెంట తీసుకు వెళ్తున్నారు.

క్షమాగుణంలేని నీతికోవిదునితో చాలాకష్టం. తన సిద్ధాంతాలనే భద్రంగా ఎంచుకుంటూ, పొరబాటు చేసినవారిని మన్నించలేని నీతికోవిదుడు, తోటిప్రజలలో గొప్పగా రాణించలేకపోతాడు. కాని అతనిని ఏ విధంగానూ తప్పు బట్టలేము - ఎటొచ్చీ, సిద్ధాంతాలన్నిటికీ అతీతమైనది క్షమించగలగడమనే స్వభావం. ఆ రహస్యం అతను తెలుసుకోలేకపోయాడే అని విచారమేస్తుంది.

రాతిగుండె ఎంతచెడ్డదో, జావలా అయిపోయి ప్రతివారినీ క్షమింపబూనడం కూడా అంతేచెడ్డది. ఈ రెండు చివర్లకీ పోకుండా మాధ్యమికమార్గం తొక్కాలి. నైతికసమస్యలు పరిశీలిస్తున్నప్పుడు, మనుషులందరూ సత్ప్రవర్తనులనిగానీ దుష్ప్రవర్తనులనిగానీ ముందే అభిప్రాయం ఏర్పడకూడదు. కొందరు మంచివాళ్ళు, కొందరు చెడ్డవాళ్ళు అని విభజించడం

గాక, దుష్టులూ దుర్మార్గులూనుంచి సామాన్యులని కాపాడట మనే భావంతో ఉండాలి. పాశ్చాత్యలోకంలోని నేరస్థులని, ఈ నాడు మనం క్రోధంతో, వారిమీద కసితీర్చుకుందామనే టట్టు చూడటంలేదు. నేరమనునది ఒక రుగ్మత అనీ, వారిని సంస్కరించాలనీ అనుకుంటున్నాము.

సోక్రటీస్ అను మహాపురుషుని గురించి మానవ జాతికి ఎన్నిసార్లయినా జ్ఞాపకం చేయడం మంచిది - అన్నాడు జాన్ స్టూవార్ట్ మిల్. క్రీ. పూ. 5-వ శతాబ్దములో, ఏథెన్సు నగర నివాసి సోక్రటీస్, ఒక మనిషికి మరొక మనిషిని కష్ట పెట్టే (హార్మ్) హక్కు లేదని సిద్ధాంతీకరించాడు. "అవతల మనిషి ఎంత చెడ్డవాడైనా అతనికి నువ్వు హానిచేయకూడదు; నువ్వు హానిచేసి, అతని చెడ్డతనాన్ని విస్తృతపరుస్తున్నావు; ఆ చెడ్డతనం యింకా పెరుగుతుంది; ప్రపంచంలోని చెరుపు నువ్వు తగ్గించడానికి బదులు, ఎక్కువ చేసినవాడవవుతావు" అని వారిస్తాడు సోక్రటీస్. మనం ఆగ్రహావేశులమై వున్నప్పుడు, తప్పు చేసినవాడిని శిక్షిద్దామని అనుకుంటాము - అతను యితరులకి కష్టం కలిగించాడు గనక అతనూ కష్ట పడాలి; చెల్లుకి చెల్లు. కష్టపడటంవల్ల అతనికి బుద్ధి వస్తుం దంటే, అతను కష్టపడాల్సిందే. కాని బుద్ధి వస్తుందని నమ్మకం యేమిటి? హేతురీత్యా మనమా నిర్ణయానికి రాలేము. కష్టపెట్టాడు గనక కష్టపడాలనడం కక్షవంటిది. కక్షవల్ల మనిషికి కీడేగాని మేలు చేకూరదు. మనం మేలు గదా కాంక్షించవల్సింది!! ఇది కొందరికి విపరీతాధర్మంగా

కనిపిస్తుందిగాని నైతిక ధర్మానికి వొడబడ్డప్పుడు మనమీ మెట్టు మీదకి రాక తప్పదు.

దుష్టులనీ దుశ్చేష్టలనీ మనం మన శక్తి అంతటితో ఎదుర్కొనవలసిందే! కాని, ఇక్కడి 'నైతిక స్తితి' మనం సుస్పష్టంగా తెలుసుకోవాలి. దుష్టత్వాన్ని ఎదుర్కొబోయే ప్రతి వ్యక్తి తనకి తెలియకుండానే సుడిగుండంలో యిరుక్కుంటాడు. అది ఎలాగంటే, ఫలానా మనిషి చెడ్డవాడని అంటున్నప్పుడు, అతను 'మనకంటె చెడ్డవాడు' అనే డిగ్రీ విషయం మర్చిపోయి, 'చెడ్డ' మనలో అసలే లేనట్టు, అవతల తను పరమ కిరాతకుడైనట్టూ, మనమొక మహా పురుషులమైనట్టూ ఆలోచించబోతాము. ఆ ఆలోచనాక్రమం యిలా వుంటుంది :

జాన్ చెడ్డవాడు;

నేను జాన్‌కి వ్యతిరేకుణ్ణి;

అంచేత, నేను మంచివాణ్ణి.

'చెడ్డ'కి వ్యతిరేకమైనదంతా 'మంచి' కాదు; అది మరొక మాదిరి 'చెడ్డ' కావచ్చు. ఆ చెడ్డతనంలో కొంచెం ఎక్కువ తక్కువలు వుంటాయేమో - అంతే! మనమందరమూ మానవులమనీ, మానవులందరికీ కొన్ని క్లిష్ట సమయాలు వుంటాయనీ మరువకూడదు. 'చెడు'కి వ్యతిరేకమైనదంతా 'మంచి' కాదు. ఏదైనా సమస్యకి సరైన జవాబు ఒక్కటే; తప్పు అన్సర్లు లక్షోపలక్షలు. "దుష్టత్వం వివిధ రూపాలలో ప్రదర్శి

తం కావచ్చు; కాని మంచితనం ఒక పరిమితిలో వొదిగి వుంటుంది," అంటాడు అరిస్టోటిల్. గురిచూసికొట్టే బాణం అనుకున్నచోట తగిలేందుకు ఒకే మార్గం; లక్ష్యం (టార్గెట్) తప్పేందుకు లక్ష మార్గాలు. శత్రువులని మనం ద్వేషిస్తున్నామంటే, మనలో ఆత్మ పరివర్తన యింకా రాలేదన్నమాటే!

ప్రస్తుత ప్రపంచ పరిస్థితులలో ఈ సమస్యలని మనం ఎంతో జాగరూకతతో పరిశీలించాలి. మానవులు మానవుల వలె బతకనేర్చుకోవాలి; వస్తువులవలె చూడబడటం నిరసించాలి. చెడు పనులని మనం ఖండించాలి - అంతేగాని, మనుష్యుల మీద ద్వేషం పెంచుకోకూడదు. ద్వేషంవల్ల ద్వేషించేవాడూ ద్వేషింపబడ్డవాడూ కూడా దెబ్బ తింటున్నారు; మృత్యు ముఖంలో పరమ సత్యాలు స్పష్టంగా గోచరిస్తాయని 2500 సంవత్సరాలకి పూర్వం సోక్రటీస్ చెప్పినట్టే, 1915 అక్టోబరులో జర్మను తుపాకులకి ఎదురుగా నిలబడి ఎడిత్ కావెల్ అన్నది. ఆమె కడసారి మాటలు మానవాళికి శిలాక్షరాలు; అవి మానవ జాతికి పూజా ప్రసూనాలు. "తుపాకులకి ఎదురుగా నిలబడి, ఈ ఆఖరు క్షణాన నేను తెలుసుకున్నదేమిటంటే, దేశభక్తి ఒక్కటీ చాలదని. ఎవరిపట్ల నాకు ద్వేషంగానీ క్రోధంగానీ లేకుండా చేయి, భగవాన్!"

---

# 6

# వర్గరాహిత్య సమాజం

"జీవితంకంటె అతీతమైనదానికి జీవితాన్ని వొడ్డినప్పుడే దానికి అర్థం అగుపడుతుంది."

— *అంటూని డి సెయింట్ ఎక్సుపెరి*

పాశ్చాత్యలోకపు జీవన విధానాన్ని తరిచిచూసినకొద్దీ మనము ఎన్నివిధాల 'స్వర్ణస్వప్నానికి' దూరమైపోతున్నామో తలపుకివచ్చి బాధ కలుగుతుంది; మనలను మనం తీవ్రంగా విమర్శించుకో బుద్ధవుతుంది. ఆ ఆత్మవిమర్శలో కూడా మనం సాధించిన కొన్ని మంచి పనులని విస్మరించరాదు. పాశ్చాత్య జీవన విధానంలో కొన్ని సుగుణ పుంజాలు లేక పోలేదు. నిన్న మొన్నటిదాకా వేలాది గ్రామాలలోనూ చిన్న చిన్న పట్నాలలోనూ ఆర్థికంగానూ ఆధ్యాత్మికంగానూ స్వయం సంపూర్ణంకాగల ఉత్తమ జీవనానికి ఆస్కారం వుంటూండేది. కొన్ని ఊళ్లలోని ప్రజలు సాటిలేని సుఖ జీవనం గడిపేవారు. రాత్రివేళకూడా తలుపు గడియ వేసు కోవడం అలవాటులేని వూళ్లూ, పోలీసు అన్నవాణ్ణి ఎరగని వూళ్లూ, లక్షాధికారి పిల్లలనీ కావలివాని పిల్లలనీ సరసగా కూచోబెట్టి చదువుచెప్పే స్కూళ్లుగల వూళ్ళూ మొన్నిమధ్య దాకా ఉండేవి - ఇప్పుడుకూడా అక్కడక్కడ వున్నాయేమో! ఇటువంటి ఊళ్లలో కొయ్యపని చేసుకొని బతికే వడ్రంగీ, న్యాయపాలన గావించే న్యాయాధీశుడూ యిద్దరు సరిసమా నులు - భగవంతుని దృష్టిలో సరిసమానులు. ఇటు వడ్రం గికీ అటు న్యాయాధీశుడికీ యిద్దరికీ యిళ్ళు వుంటాయి. ఎవరి యింటినివారు బాగుచేసుకు అందంగా పెట్టుకుంటారు- యిద్దరి యిళ్లముందూ పచ్చటి మొక్కలు వుంటాయి. ఒక

రికి కష్టం వచ్చిందంటే వూళ్లో అందరూ ఆదుకుంటారు; వర్గ విభజన అనునది లేదు; భాగ్యవంతుల పిల్లలూ బీదవారి పిల్లలూ ఒకేబడికి వెళ్తారు; బూర్జువా, ప్రొలిటేరియట్ అను మాటలు మచ్చుకైనా వినిపించవక్కడ.

అటువంటి వూళ్లనిచూసి, వాటంతటవి పెరిగాయని భావి స్తామేగాని, ఆ పెరుగుదల ఎటువంటి నైతిక లక్ష్యసాధనకి చిహ్నమో ఆలోచించము. ఆ నైతిక విజయం పూర్తిగా పోగొట్టుకోవడం సంభవిస్తే, మనం విచారపడకతప్పదు. పైన జెప్పిన నైతిక విజయంలాటిది ఆర్థిక సంపదవల్ల చేకూరదు; కొన్ని సంప్రదాయాల ఫలితంగా, కొన్ని శతాబ్దుల సాధనతో లభ్యమైంది ఆ ఘనవిజయం. ఆ విజయంవల్లనే సామాన్య పౌరునికి ఉదాత్త జీవనావకాశం కలిగింది.

గతించిన కాలంలోగానీ, జరుగనున్న కాలంలోగానీ 'కార్యాసక్తత' (వర్క్) అనునది ఎటువంటి విజయానికైనా మూలహేతువు. 'వర్క్'తోగాని ఏదీ సాధించలేము. కొన్ని శతాబ్దులుగా 'వర్క్' గొప్పదనీ, కష్టించి పనిచేయడంలో ఆనందం వుందనీ, శ్రమతోటే స్వాంతమనునది (వర్క్, వోనర్ షిప్పు) ఏర్పడుతుందనీ, విడివిడివి కాదనీ, ఒకే ధర్మానికి చెందిన రెండు హంశలనీ భావిస్తూవచ్చాము. వర్కూ, వోనర్ షిప్పు ఒకటే అను దృక్పథానికి జీవంపోస్తూ, అనేక పరిశ్రమలు నెలకొల్పాము. పారిశ్రామికోత్పత్తివల్ల పెరిగేది ధన లాభంమట్టుకే అయినప్పటికీ, 'వర్క్' అంటే మనకి గల సదభిప్రాయంవల్ల, ఉత్పత్తి పెరుగుదల, వర్కూ ఒకటే

అను వంకరమెట్టుమీదకివచ్చి నిలబడ్డామీనాడు. ఆ రెండూ ఒకటి కానేరవు - రెండూ వేరువేరు.

'వర్క్' (కార్యాసక్తత) మీదున్న గౌరవంవల్ల యిన్నాళ్ల బట్టీ మనమీ పొరబాటు చేస్తూవచ్చాము. ఈ దృక్పథం నేడు మన జీవిత విలువలని తారుమారు చేయనుంది. పనితనం (క్రాఫ్ట్స్‌మేన్‌షిప్) క్షీణించడంవల్లగానీ, వర్క్ పట్ల మనకి వున్న పూర్వపు గౌరవం సన్నగిలడంవల్లగానీ మన జీవన విధానం చిన్నాభిన్నం కావచ్చు. మనని చేతిపనులకి (క్రాఫ్ట్స్) దూరంగాచేసిన విద్యాపద్ధతి యిందుకు దోహద కారి అవుతుంది. ఉన్న కొద్దిపాటి టెక్నికల్ స్కూల్సులో కూడా సామాన్య విద్యార్థులు నేర్చుకోదగినది ఎక్కువగా ఉండటంలేదు. ప్రతిచోటా యంత్రం ముందుకొచ్చి, పని తనాన్ని వెనక్కి నెట్టుతోంది. విద్యావిధానాన్ని అని లాభం లేదు - వర్క్‌పట్ల మన అభిప్రాయాలూ దృక్పథమూ మారాలి.

పాశ్చాత్య జీవన వైఖరికి అమెరికా దేశమొక నమూనా. పాశ్చాత్య నాగరికతలోని సుగుణాలూ దుర్గుణాలు కూడా యిక్కడ పెద్ద ఎత్తున కనబడతాయి - వీటితోబాటు ఆ నాగ రికతని క్రుంగదీస్తున్న సహజ లోపాలుకూడా ప్రత్యక్షమవు తాయి. అమెరికాలోని ఆస్తి హక్కులూ ఆస్తి విధానమూ తమాషాగా వుంటాయి. పెద్దపెద్ద ఫాక్టరీల పక్కన, కారులు నిలబెట్టుకునే పార్కింగ్ స్థలం, ఫాక్టరీలదిగాక వేరే యిత రులదై వుంటుంది. ఫాక్టరీ వుద్యోగులు తమ కార్లు అక్కడ

పోర్కు చేసినందుకుగాను, ఆ యితరులకి రుసుము చెల్లిస్తూ వుంటారు. మార్క్సిజమ్ అమెరికాలో గట్టిస్థానం సంపాయించుకో లేకపోవడానికి కారణం యేమిటంటే, అమెరికా లోని కార్మిక సంఘాలకి తమతమ ఫాక్టరీల నిర్వహణలో కొంత పలుకుబడి వుండటం మాట అట్టే పెట్టి, ప్రస్తుత స్థితిగతులు మారడం వారికి సుతరామూ యిష్టం లేక పోవడం.

యంత్రంద్వారా తయారయే వస్తువులు చవకగా పొందేందుకు, మనం చెల్లించిన విపరీతపు ధర చాలామందికి గుర్తు రాదు. ఆదర్శమూర్తి కాదగు శిల్పిని చెడగొట్టి సామాన్య కార్మికునిగా తయారుచేశాము. ఈ సామాన్యకార్మికుడు తన 'వర్క్'లో శిల్పి పొందదగు ఆనందోత్సాహాలు ఏ నాడూ పొందలేడు. ఒక వస్తువుని తయారు చేయగలిగాననే ఆత్మ తృప్తి కార్మికునికి ఎలా వస్తుంది? రిఫ్రీజిరేటర్లు తయారు చేసే ఫాక్టరీలోని మనిషికి, ఆ రిఫ్రీజిరేటర్లు తనవల్ల తయారవుతున్నాయనే భావం ఏ నాటికీఉండదు. ఆ రిఫ్రీజిరేటర్లు ఎవరు వాడుకుంటారో కూడా అతనికి అనవసరం - ఒక మహా యంత్రంలోని చిన్నయంత్రం తాను. తన 'షిఫ్ట్' అయిపోగానే మరొకడు తన స్థానంలో నుంచుంటాడు. అంచేత అతని దృష్టి ఎంతకీ గడియారం మీదనే!

మనుషులు జీతం రాళ్లకోసం పనిచేస్తున్నారని, ఈ నాడు మనందరికీ తెలుసు. ఆ నాలుగుడబ్బులూ సంపాయించుకో వలసిన అవశ్యకతలేనినాడు, ఫాక్టరీలదగ్గిరికి పొమ్మన్నా పోరు. ఉత్పత్తిమీద, తయారయే వస్తువులమీద వారి కెటు

వంటి అభిప్రాయమూలేదు. వారిదృష్టి వింతకీ జీతం డబ్బుల మీద. చేసేపనిమీద వారికి ఎటువంటి అభిప్రాయమూ వుండదు. కాబట్టి, అధికవేతనానికై వారు అందోళన సల్ప డంలో ఆశ్చర్యంలేదు. జీతాలు పెరుగుతాయి; జీతాలతో బాటు జీవితావసరవస్తువుల ధరలూ పెరుగుతాయి - యిదొక విషచక్రం. సామాన్యసదుపాయాలు యివ్వగల జీవనభృతి అందరికీ వుండవల్సిందే - కాని జీతం పెరుగుదలే జీవన లక్ష్యమవడం మంచిదికాదు. వేతనమే ప్రధాన లక్ష్యమైన నాడు, ఎంత తక్కువపనితో బయటపడగలమా అనుధోరణి అలవడుతుంది. సాధారణంగా అటువంటప్పుడు, కార్మికులవ నీయండి మరొకరవనీయండి, వొళ్ళువంచి పనిచెయ్యరు; తమ మనసుని ఆ పనిమీద లగ్నంచెయ్యరు; ఉద్యోగంవూడి పోకుండా వుండేందుకు, ఎంత తక్కువపని అవసరమో, అంతదాకానేచేసి వూరుకుంటారు. కష్టపడి పనిచేయదల్చు కున్నవాణ్ణి మిగతావారు ఈసడిస్తారు. అక్కడితో సామాన్య తకి (మెడియోక్రిటి) పట్టంగట్టి, ప్రతిభని పాతిపెడతారు. ఈనాడెంతకీ 'తక్కువపని - ఎక్కువవేతనం' మీదనే మన దృష్టి. తక్కువపనితో ఎక్కువవిశ్రాంతి లభ్యంకావాలి కదా! ఈ విశ్రాంతిని సృజనాత్మకకార్యాలకోసం వినియోగించ గలరా అంటే సున్న. 'తక్కువపని - ఎక్కువ వేతనం'తో పొందే, ఎక్కువ విశ్రాంతిని, ఎలా ఖర్చుబెట్టదలుచుకున్నా రనే విషయం దగ్గిరికివద్దాం.

వినోదకాలక్షేపం (ఎంటర్‌టెయిన్‌మెంటు) అంటే నేటి స్త్రీ పురుషులు చెవి కోసుకుంటారు. చేతినిండా పనివున్నప్పుడు

వినోదాలవైపుగాపోయే తీరికవుండదు మనసుకి, జీవితం స్వయంసంపూర్ణమూ ఉత్సాహభరితమూ కానివారికే సినీమాలూ నాటకాలూ క్లబ్బులూ మొదలైనవి ఎక్కువగా కావాలి. జీవితంలో సంపూర్ణత లోపించినవారే ఎక్కువగా కనపడుతున్నారీనాడు. వినోదాలు (ఎంటర్‌టెయిన్‌మెంటు) జీవితంలో ఒకభాగమైపోయాయి. ఆధునికయుగంలోని స్త్రీ పురుషులు ఎంతకాలాన్నీ ఎంతశక్తినీ ఎంతధనాన్నీ 'ఎంటర్‌టెయిన్‌మెంటు' (సినీమాలు నాటకాలువగైరా) కోసం వెచ్చిస్తారో లెక్కగట్టి చెప్పేందుకు సరియైన అంచనాలు లేవు మనదగ్గిర. కాని వినోదాలకోసం ఖర్చుయేపైకం, విద్యావ్యాప్తికోసం ఖర్చుపెట్టే దానికంటె ఎక్కువ అని మాత్రం ఖచ్చితంగా చెప్పగలము. ఏ కారణంవల్లనైనా మన నాగరికతశిథిలమై, అంతా భూగర్భంలోకిపోవడం తటస్థిస్తే, కొన్ని శతాబ్దుల తర్వాత యివి బయటికి తవ్వితీసే పురాతత్వపరిశోధకులు, మన బ్రహ్మాండమైన సినీమా తెరలుచూసి,- "యిటువంటి మందిరాలలో కూచుని ఆ నాటి ప్రజలు ప్రార్థన సలిపేవారు కాబోలు" – అని అనుకుంటారు. ఆ తెర లేవో మతసంబంధమైనవిగా భావిస్తారు. ఎంచేతనంటే, అంత మంది ప్రజలు ప్రార్థనకోసంగాని ఒకచోట గుమిగూడరుగా!

పురాతత్వపరిశోధకుడు ఆ విధంగా అనుకోవడంలో పొరబాటేముంది? 'ఎంటర్‌టెయిన్‌మెంటు' నేటి ప్రజలకి ఒక విధంగా మతమువంటిది. ప్రజలకి కాలక్షేపం కలిగించేందుకని వినోదవ్యాపారాలు భారీఎత్తున పెరిగాయి. పట్నవాసపు జీవితంతో అలిసిపోయిన స్త్రీ పురుషులకి 'నైట్‌క్లబ్' ఉత్తేజం

ప్రసాదిస్తుంది. అందరూ నైట్ క్లబ్స్‌కి వెళ్లలేరుగా! అంచేత ఎవరి తాహతునిబట్టి వారికి అనువైన వినోదం సమకూర్చ బడుతుంది. నైట్ క్లబ్స్‌కీ, సినీమాలకీ, నాటకాలకీ వెళ్లనివారు యింటి దగ్గిరేవుండి టెలివిజన్‌చూడవచ్చు; లేదా రేడియో విని ఆనందించవచ్చు. మీరు మీ బాధలు మర్చిపోయేందుకు గాను, రకరకాల భారీ వ్యాపారసంస్థలు నిరంతరం శ్రమిస్తూ వుంటాయి. వినోదకాలక్షేపం యింత విపరీతంగాపెరగడం మనకొక నూతనసత్యాన్ని తెలియబరుస్తోంది. ప్రజలకి తమద్వా నందిన కార్యక్రమంతో సంతుష్టికలగడంలేదు. 'వర్క్' యివ్వలేకపోతున్న ఉత్సాహం, 'ఎంటర్‌టెయిన్‌మెంటు'లో కనపడుతుందేమోనని వెతుకుతున్నాడు సామాన్యమానవుడు.

మన మీ అసాధారణసమస్యని వాస్తవదృక్పథంతో ఎదు ర్కోవాలి. ఇది పారిశ్రామికయుగం - ఈ పారిశ్రామికకాల మానాన్ని వెనకకు తిప్పలేముకదా! సమిష్టిధర్మం అంగీక రించాలి - గడిచిన దినాలు తలుచుకువాపోతూకూచుంటే ప్రయోజనంలేదు. మానవజాతిని సుఖపెట్టగల సంపద లనేకం, పారిశ్రామికయుగం మనకి సమర్పించింది. వాటిని సక్రమంగా ఉపయోగించుకు ప్రజలు సుఖపడవచ్చు. 'నూతినీళ్ళు తోడుకోవడంకంటె వంటయింట్లో పంపువుండటం హాయి' అని ఏ గృహిణి అనుకోదు? ఎటొచ్చీ, ఆ అవకాశం అందరు గృహిణులకీవుండాలని మనం అనుకోవాలి.

పారిశ్రామిక సమాజంనుంచి మనమిప్పుడు పాతకాలపు సమాజానికివెళ్లలేము – జీవితాన్ని నేడంత 'సింపుల్'గా

చేసుకోలేము. నేటి జీవనవిధానం బహుముఖప్రజ్ఞావంత మైనది. కాని మానవునిలోని సృజనాత్మకశక్తులు మాత్రం నీరసించకుండా చూసుకోవాలి. నేటి పరిస్థితి నిరాశాపూరిత మనీ, కాంతిరేఖకానరాని కారుచీకటి అనీ భావించనక్క ర్లేదు. మన పూర్వీకులుకూడా యిటువంటి కష్టసమయాలని తప్పని సరిగా ఎదుర్కొనవలసివచ్చింది. ఏ సమస్యకైనా పరిష్కారమార్గం ఉండకపోదు - ఆ మార్గం తెలుసుకునేం దుకు మన మేధస్సుని ఉపయోగించాలి. మనప్రస్తుత కర్తవ్యమేమిటంటే, మానవుని మనోభావాల్ని కొంతవరకూ సంస్కరించేందుకు ప్రయత్నించడం.

గత రెండువేలయేళ్ళుగా మానవజాతి వివిధసిద్ధాంతా లని అవలంబించి వేరువేరుమార్గాలు తొక్కింది. వీటిలో కొన్ని మన హృదంతరాళంలో జీర్ణించివున్నాయి. ఈ శిథిల జలాశయాలలోకి నీరువచ్చిందంటే, మానవుని భవిష్యత్తు బాగుపడుతుంది.

(1) శిల్పనైపుణ్యమనునది 'వర్క్' (పని)లో ఒకభాగము. సుఖసంతోషాలెప్పుడూ వాటంతటవి సాక్షాత్కరించవు - మనం పడే పరిశ్రమలో అంతర్భాగాలుగా రూపొందుతాయి! వెతు క్కునివెళ్లడంవల్ల ఆనందం లభ్యంకాదనీ, మన పరిశ్రమే (వర్క్) ఆనందంగా పుష్పిస్తుందనీ గ్రీకులు ఏనాటినుంచో చెబుతున్నారు.

సృజనశక్తి మానవునిలో అంతర్భాగంగా జీవిస్తూవుం టుంది. అంచేతనే, సృజనధర్మం గల పనులలోగాని మాన

వుడు తనని తానుమరిచి పోలేకుండా ఉన్నాడు. సృజనధర్మం గల కార్యాలలో నిమగ్నులైనవారు తాదాత్మ్యంపొంది, తమ కష్టనిష్ఠూరాలు మర్చి పోగలుగుతున్నారు. మన చీకాకులు మరిచిపోయి జీవించగలసమయాలే ఉత్తమమైనవి. "మానవ జీవితానికిగల పరమప్రయోజనమేమిటంటే, ఈ జీవితాన్ని యింతకంటె ఉన్నతమైన దానికోసం వినియోగించగల గడం," అని అంటాడు విలియమ్ జేమ్సు.

స్త్రీ పురుషులిరువురూ సృజన స్వభావం గలవారు. పురుషుడు స్వతహాగా వర్కర్ - తనకి విశ్రాంతివల్ల సుఖమొస్తుందని పొరపడతాడేగాని, ఆ సుఖమతనికి కార్యనిమగ్నుడై వున్నప్పుడు మాత్రమే కలుగుతోంది. ఒక తోట నాటుతున్నప్పుడూ, ఒక మందిరం కడుతున్నప్పుడూ, ఒక దేశాన్ని నడిపిస్తున్నప్పుడూ, ఒక ఫాక్టరీ నిర్మిస్తున్నప్పుడూ, ఒక కావ్యం సృష్టిస్తున్నప్పుడూ మానవుడు పొందేది ఆనందంగాక మరేమిటి ? ఆ పని తనకితాను చేతులతో చేయనక్కర్లేదు - మెదడుతో చేసినా చాలు. సైంటిస్టులూ తత్వకోవిదులూ చేసే పనంతా మెదడుతోటేకదా ! చింతనా సాగరంలో ఈదులాడటమనేది అన్నిటికంటె గొప్ప విషయం.

ఏకాగ్రతవల్ల మానవుడు తనని తాను మర్చిపోగలుగుతున్నాడు. ఒక చక్కటి భవనం నిర్మించాలనుకునే శిల్పి, భవన సౌందర్యం గురించీ, భవన విశాలత గురించీ ఆలోచిస్తాడేగానీ తన గురించి ఆలోచించుకోడు. భవన సంబంధమైన భావనలో 'తను' మాయమవుతుంది. ఆ భవన నిర్మా

ఖం పూర్తి అయేదాకా అతనికి వూపిరాడదు; సగం దాకా చేసి, తను గొప్పగా చేశానని అనుకోడు - అది పూర్తి అయిన మీదటనే అతనికి తృప్తి. తన యింటికి నిప్పంటుకున్నదని విన్న మనిషి, వెంటనే పరిగెడతాడేగాని, తను ఎంత వేగంగా పరిగెత్తవలసినదీ లెక్కలుకడుతూ కూచోడు. అదేవిధంగా శిల్పి, తన పని పూర్తయేదాకా ముందుకి సాగుతూవుంటాడు. సంతోషమనునది ఆతనికి ఏకాగ్రతవల్ల లభిస్తోంది.

మనమందరి జీవితాలలోనూ కొన్ని ఉత్తమ ఘడియలు కనిపిస్తాయి. అవి సర్వసాధారణంగా మనం సృజనాత్మక వ్యాపకంలో నిమగ్నమై వున్నప్పటి ఘడియలే! రచన సాగిద్దామని కూచునే రచయితకి కలం కాయితం మీద పెట్టడానికి పూర్వం లక్ష ప్రతిబంధకాలు కనిపిస్తాయి; ఆ పని ఆ పూటకి తప్పించుకునేందుకు వెయ్యి మార్గాలు వెతుకుతాడు. తీరా మొదలెట్టాక, అది పూర్తయితేగాని విశ్రమించడు. ఇది చాలామంది రచయితలకి అనుభవంలోని విషయమే!

తాము చేయదలుచుకున్న కార్యాన్ని ఉత్తమంగా చేదామనీ విశిష్టంగా చేదామనీ అనిపించే వాంఛితమే అనంద హేతువు అవుతోంది. కళాకారుల జీవితము సామాన్యులకి అకర్షవంతంగా కనిపించేందుకు మూలకారణం అ కళాకారులలో గల సృజనాత్మక సంపదే! కవి ఏకాంతాన్ని కాంక్షిస్తాడు. కాని ఆ ఏకాంత సమయంలో 'కనిపించని సౌందర్యదేవత' అతనిని వేధిస్తూ వుంటుంది. పాతికే మాట, అతికే రాగం ఆ దేవత ప్రసాదించేవే! ఎవరినైతే ఈ దేవత వెన్నా

డుతుందో, వారి జీవితం మహోజ్జ్వలంగా ప్రకాశిస్తుంది. వైణికుని వేళ్లమీద నృత్యం సలిపేది ఈ సౌందర్య దేవతే!

పాటగాళ్లంటేనూ, రచయితలంటేనూ, చిత్రకారులంటేనూ, కళాకారులంటేనూ సామాన్య ప్రజకి ఎంతో అభిమానం. ఆ సామాన్య ప్రజకి ఈ అసామాన్య వ్యక్తులు తమ తమ రంగాలలో విశిష్టత సంపాయించుకునేందుకు పడే పాట్లు తెలియవు. రొప్పుతూ కొండ ఎక్కినట్లు, వీరు ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ వస్తారు. వారు ఏ రంగంలో కృషి చేసినా, ఒక్కొక్క మెట్టే ఆయాసపడుతూ ఎక్కక తప్పదు. కళారంగంలోని స్త్రీ పురుషులు సుఖపడగలరా అంటే అది వేరే ప్రశ్న. సుఖమనునది సంతృప్త జీవనంలో ఒక భాగం; కాని, కళా స్వభావులు నిరంతరాన్వేషకులు - ఏదో అద్భుత సౌందర్యం వైపుగా అడుగులు వేసుకుంటూ పోతారు వారు. ఉన్నతాత్ములందరూ పరిసరాలతో రాజీపడలేని మహనీయులే!

విశిష్టత సంపాయించుకునేందుకు పడే శ్రమలో ఆత్మాభిమానమూ ఆత్మ గౌరవమూ (ప్రైడ్) ఒక భాగంగా వుంటాయి. ఈ 'ప్రయిడే' మనుషులచేత మంచి పనులూ, చెడ్డ పనులూ కూడా చేయిస్తుంది. తను నిర్మించిన కళాఖండం ప్రజల మెప్పుని పొందాలనే గాఢతర వాంఛే (ప్రయిడ్) శిల్పిచేత అద్భుతమైన కట్టడాలు కట్టిస్తోంది. తను నిర్మించినది పదిమందీ దృష్టిలో చక్కగా కనపడకపోతే తన కీర్తి ప్రతిష్టలు యేంగాను ? - అని అనిపిస్తుంది శిల్పికి. అందుకనే అతను తను నిర్మాణ కౌశలాన్ని నేర్పుతో ప్రదర్శింపబోతాడు.

సామ్యూల్ జాన్సన్ వ్యాసాలూ పద్యాలూ అంత గొప్పగా వుండటానికి కారణం యేమిటంటే, తను రాసినవి విశిష్టతని అందుకున్నాయని నమ్మకం కలిగేదాకా వాటిని బయటపెట్టే వాడు కాదట ఆయన. అర్థికంగా కష్టాలుపడనీగాక, రచనల విషయం దగ్గిరికి వచ్చేటప్పటికి ఆత్మాభిమానం (ప్రయిడ్) అతనిని అవిధంగా కాపాడుతూ వుండేది.

అరిస్టాటిల్ సిద్ధాంతాలు మనం మాట మాత్రంగా వొప్పు కుంటాము గాని కార్యాచరణ సందర్భంలో, అవి ఈ యిర వయ్యో శతాబ్దపు ప్రజలకి వుపకరించవని నరిపెట్టుకో జూస్తాము. అదే మనలోని పతనబీజం. ఫాక్టరీలు పెరిగిన ప్పటికీ శిల్పులకి (క్రాఫ్ట్స్‌మెన్) ఈనాడు మనం తగు అవ కాశం యివ్వవచ్చు. నవీన పారిశ్రామిక యుగం పనివారికి ఎక్కువ విశ్రాంతిని ప్రసాదిస్తోంది. ఆ విశ్రాంతి కాలాన్ని సద్వినియోగం చేసుకోకలిగితే, మానవునిలోని శిల్ప చాతు ర్యం అతి రమణీయంగా పెరుగుతుంది.

సృజనాత్మక శక్తి వుపయోగకారి అయేందుకు, మానవు లందరికీ స్వాతంత్ర్యం కావాలి. ఆ సహజ స్వాతంత్ర్యం నుంచే సృజన వెలువడుతుంది. పొగల స్తమానం ఫాక్టరీలో పనిచేసి వచ్చే కార్మికుడు, సాయంత్రం యింటికి వచ్చాక తన విశ్రాంతికి అర్థం కల్పించుకు, సృజనాత్మక విషయాల వైపు మనసుని మళ్ళించుకోవాలి. అంటే యేమిటనికదూ అడుగుతున్నారు? చిన్న పూలతోట వేయడం, పిల్లలతో తనూ వారిలో ఒకడై ఆడుకోవడం, సంగీత సాధన, మనసుకి శాంతినిచ్చే మహా కావ్యాలు చదువుకోవడం - యిలా బోలె

డన్ని వున్నాయి. తన వర్కు, వేతనాల సమస్యా మర్చి పోయి యితర కార్యాలవైపు మనసుని తిప్పుకోవాలి. ఇలా తిప్పుకోగలిగిన ప్రజలే మనకి ఆరోగ్యవంతులవలె కనిపిస్తు న్నారు. యంత్రాలవల్ల తయారయే సరకులు వేరు; చేతి పనులవల్ల తయారయేవి వేరు. ఈమధ్యనిలాగే, ఒక బ్రహ్మాం డమైన టేబుల్ తయారు చేయవలసి వచ్చింది. కొంత కల పని ఒక కాలేజీకి ఒకరు ధర్మం చేశారు – అది చాలా మంచి కలప. దానితో పెద్ద టేబుల్ చేయించమని, ఆ ధర్మం చేసినవారు చెప్పారు. వారు కోరినవిధంగా టేబుల్ చేయగల ఫాక్టరీ అమెరికాలో ఒక్కటి కూడా లేదు. అప్పుడు, యిద్దరు కార్పెంటర్స్‌కి (వడ్రంగులు) ఆ పని వొప్పజెప్పారు. సర్వసామాన్య ప్రతిభకల ఆ కార్పెంటర్స్ ఆ టేబుల్‌ని ఎంత అందంగా తయారు చేశారో చెప్పలేము. అంత విశాలమైన టేబుల్, అంత అందంగా తయారు చేయడమనేది వారిద్దరికే సాధ్యమైంది – చేతి పనివల్లనే అది సాధ్యమైంది. యంత్రాలు యిటువంటి అపురూప సౌందర్యాన్ని సాధించలేవు. ఆ టేబుల్ తయారు చేసిన పనివారు, అరిస్టోటిల్ సిద్ధాంతాలు పొరబాటున కూడ విని వుండరు. కాని ఆ అద్భుతమైన వస్తువు సృష్టించడంలో వారు పొందిన ఆనందం వర్ణనాతీతం. సామాన్యమైన చేతి పని చేసేవారైనప్పటికీ వారు శిల్ప నిపుణులు. వారే నిజ మైన 'అరిస్టోక్రాట్స్'. వర్కు కోసం వర్కు చేసే ప్రతి ఒక్కడూ అంతర్యంలో 'అరిస్టొక్రాట్' (రాచ బిడ్డ).

పారిశ్రామిక సమాజంలో అనేకులకి తమ శిల్పనైపుణిని ప్రదర్శించగల అవకాశం లభించడంలేదు. యంత్రాల గౌర

వాన్నిగాక మనుషుల గౌరవాన్ని పెంచేందుకు మనం కృషి చేయాలి. అప్పుడుగాని మానవుని సహజ ప్రతిభ యినుమడించదు - అనాడుగాని మానవునికి ఆత్మతృప్తి కలగదు. వెనకటి దేవాలయ నిర్మాణాలలో మానవుడు పొందిన తృప్తి వంటిది, ఈనాడతను తిరిగీ పొందగలగాలి. ఆధునిక యుగంలో అటువంటి శిల్పఖండాలకి అవకాశంలేకపోయినా, మానవునిలో సహజంగావుండే సృజనశక్తి వెల్లడి అయేందుకు మార్గమగుపించాలి. ఆ మార్గాన్వేషణే మన యుగధర్మం. మనం అనుకున్న లక్ష్యాలు అందుకోలేకపోవడంవల్ల పెద్ద నష్టం లేదు. అసలు లక్ష్యాలేలేక, స్వప్నాలేలేక జడత్వంగల జీవితాలకి అలవాటైపోవడంవల్ల వస్తోంది ఉపద్రవమంతా.

తమ పనులూ తమ ఉద్యోగాలూ నిరుత్సాహపూరితములని గోలపెట్టేవారు, అవతలవాళ్లకి అద్భుతమైన అవకాశాలు వచ్చాయనీ తమకా చక్కటి అవకాశాలు సంప్రాప్తం కాలేదనీ అనడంకూడా రివాజు. అవకాశాలలో తేడా వుండేమాట నిజమే - కాని, మనంచేసే పనులలో ఏ ఒక్కటీ 'గ్లామరస్' (ఆకర్షణీయం) అయినదికాదు. తయారై బయటికివచ్చే వస్తువునే మనం చూస్తాముగానీ, తయారీలోపడ్డ తిప్పలు మన కంటి కగపడవు. ప్రతిపనిలోనూ 'డల్‌నెస్' (మందకొండితనం) ఉంది. ఆ 'డల్‌నెస్'ని నివారించగలమా అని ఎవరికివారు తలపోస్తూనే ఉంటారు. ప్రతి వృత్తిలోనూ ప్రతి ఉద్యోగంలోనూ యిది ఒక భాగం. ఆ విషయం మర్చిపోయి చాలామంది, 'తాము చేసేవే మందకొడి ఉద్యోగాలు' అని అనుకుంటారు. ప్రొఫెసరుకి పరీక్ష పేపర్లు దిద్దడమూ, చిన్న

వ్యాపారికి అకవుంట్ పుస్తకాలు రాసుకోవడమూ, పిల్లలతల్లికి యింటిపనులు చూసుకోవడమూ - ఎంత కష్టంగాఉంటాయో ఆలోచించారూ ?

ప్రతి వ్యాపకంలోనూ 'డల్‌నెస్' ఉంది; కాని ఎక్కడి కక్కడ వ్యక్తి, దానిని నెమ్మదిగా అతిక్రమించుకుంటూ రావాలి. సామాన్య కార్మికునికి, తమ ఫాక్టరీలో తయారయే వస్తువులవల్ల ప్రజానీకం సుఖపడుతుందనీ, ఆ వస్తువుల తయారీలో తనకీ కొంతభాగం వుందనీ అనుకోగల భావన కొద్దిపాటి ఆత్మతృప్తిని యిస్తుంది. అటువంటిభావన ఈనాటి కార్మిక వర్గంలో ఉందా అంటే, - లేదు. కాని, ఆమాదిరి భావన కార్మికులకి మేలు చేస్తుంది.

"మహనీయత గురించీ గొప్పదనం గురించీ కలలులేని నాడు, నైతిక పురోగమనం అసాధ్యమైన విషయం" అన్నాడు ప్రొఫెసరు వైట్‌హెడ్. గొప్పదనం ఎప్పుడూ నీతిబద్ధమైనది - స్వల్పత్వాలని అది ఏవగించుకుంటుంది. కొందరికీ గొప్ప దనపు ఛాయ (విజన్ ఆఫ్ గ్రేట్‌నెస్) మహాకావ్యాలలో కని పిస్తుంది; కొందరికి ఉత్తమ కళలలోనూ మహోన్నత భావా లలోనూ సాక్షాత్కరిస్తుంది. కాని, మనకి పూజనీయులైనవారి జీవితాలలో, ఈ గొప్పదనం అడుగడుగునా కనిపిస్తుంది. సామాన్య సన్నివేశాలలోకూడా వారి జీవితపు మెరుగులు కని పిస్తాయి. నిత్యకృత్యంనుంచి, దైనందిన జీవితానుభవాల నుంచి పారిపోయి, వారు "అంతవారు" అవలేదు - సామాన్య ఘట్టాలలో గొప్పగా ప్రవర్తిస్తూనే వారు ఆ "స్థితి"కి వచ్చారు.

ప్రతి వ్యక్తి తనకి హితవైనదీ అనువైనదీ అగు వ్యాపకం ఎలా వెతుక్కోవడమా అను ప్రశ్న దగ్గిరికి వద్దాం. కొందరికి కొన్ని పనులమీదనే యిష్టం ఉంటుంది. ఒకతను యింజనీరు అవాలనుకుంటే, మరొకతను డాక్టరు అవాలనుకుంటాడు; మరొకతను మెకానిక్ అవుదామనుకుంటాడు. భగవన్నిర్ణయమనండి, జీవన నిర్ణయమనండి - ఒకమనిషి ఒకే పని చేయగలుగుతాడు; అందుకనే అతను ఉద్దేశింపబడుతాడు. తను ఏ వ్యాపకానికి అర్హుడో తెలుసుకోవడమనేది వ్యక్తిగత సమస్య. "తన స్వయంశక్తి ఎంతదాకా ఉంది, తను ఎంతవరకూ రాణించగలడు?" - అనే ప్రశ్నలు తనకి తాను వేసుకోవాలి. ఏ వ్యాపకంవల్ల, ఏ వృత్తివల్ల తను సాంఘికంగానూ ఆర్థికంగానూ ముందుకి సాగగలడో, అదే తను ఏరుకోవలసి వుంటుంది.

మేజర్ బార్బరా నాటకంలో జార్జి బెర్నార్డ్‌షా, "మతి వున్నవాడెవడూ డబ్బు అక్కర్లేదనడు, అనేక శక్తుల్ని సమకూర్చిపెట్టగల ఆయుధమది," అని అంటాడు. ధన మూలమిదం జగత్ అంటే వొప్పుకోవచ్చుగాని, అన్నిటికంటె ముఖ్యం డబ్బు అంటే వొప్పుకునేందుకు మనసు అంగీకరించదు. బెర్నార్డ్‌షా తన సహజ చమత్కార ధోరణిలో అలా చెప్పాడనుకోండి. ధనంతో అనేక సదుపాయాలు సమకూర్చుకోవచ్చు. డబ్బు అనునది వ్యక్తికిగల కోర్కెలు తీర్చే సాధనం. ధనము ఎంత ముఖ్యమో మనకాలమూ మనశక్తీ కూడా అంతే ముఖ్యం.

"ఆమాత్రం మనకో అయిదారు లక్షల రూపాయిలు వచ్చి, అర్జన అనునది యింక జీవితానికి అవసరంలేనప్పుడు, మనకాలాన్నీ శక్తినీ ఏ విధంగా వినియోగిస్తాము?" అను ప్రశ్న ఎవరికి వారు తరుచూవేసుకుంటూవుండటం మంచిది. ప్రస్తుతం చేస్తున్నపనినే యింకొంచెం స్తిమితంగా చేసుకుంటూపోతాం – అని అంటారు కొందరైనా. సైంటిస్టులూ, డాక్టర్లూ, రచయితలూ మొదలైనవారు తమకి లక్షలు వొచ్చి వొళ్ళోపడినా, తాము చేస్తున్నపనులు మానేందుకు వొప్పుకోరు. ధనం వచ్చినంతమాత్రాన స్తిమితంచిక్కదు చాలా మందికి. 'వర్క్' అంటే అందరికీ యిష్టం వుండకపోవచ్చుగాని, 'వర్క్' వుంటేగాని తోచదు కూడాను. కార్యాసక్తతని ఏవగించుకోవడం మానవ ధర్మంకాదు.

ఆదర్శపరిస్తితులంటూ మానవజీవితంలో ఏ నాడూ వుండవు. ప్రతి విద్యాలయంలోనూ, ప్రతి ఆఫీసులోనూ ప్రతి కర్మాగారంలోనూ ప్రతి కమిటీమీటింగులోనూ వారి వారి వైరాలు విధిగావుంటాయి. కొందరు ముందుకి అడుగు వేస్తే, మరికొందరు వెనక్కిలాగుతారు. పోరాటగుణమనునది మానవస్వభావంలో ఒకభాగం. మంచికైనా చెడ్డకైనా, అతను పోరాడుతూనేవుంటాడు. పెళ్ళిచేసుకున్నాక, పేచీలురాకుండా వుంటాయా? పేచీలువచ్చినా సరే, వాటిని నివారించుకోలేమా ? అను ధైర్యంతోటే కదా పెళ్ళిచేసుకుంటారు! ఆరోగ్యంగావున్నా అనారోగ్యంగావున్నా, సంపదలమధ్యనున్నా బీదతనంలోవున్నా ఒకరికొకరు కట్టుబడివుంటామనే వాగ్దానంతోటేకదా వివాహంచేసుకుంటారు!! ఆ వాగ్దానాలప్రకారం

నడుచుకున్న నాడే స్త్రీ పురుషులు నీతిపథం అందుకో గలుగుతున్నారు.

మననుని బాధించే ఉద్యోగంచేయడం మంచిపనికాదు. ఒకానొక యడ్వర్టయిజింగ్ కంపెనీలో పనిచేస్తున్న ఒకపెద్ద మనిషికి, తను చేస్తున్న ఉద్యోగంమీద విముఖతకలిగింది. ఎంచేతననగా, అతను చేయవలసినపని ప్రకటనలు వ్రాసి యివ్వడం - ఏ కంపెనీ విస్కీ ప్రజలకి మంచిదో వ్రాసి యివ్వడం. విస్కీ వొంటికి మంచిదికాదని అతనికితెలుసు. కాని పొట్టకోసం ఉద్యోగరీత్యా విస్కీలోనిఘనతా, అది దేహా రోగ్యాన్ని ఏ విధంగా కాపాడేదీ మొదలైన కాకమ్మకబుర్ల ప్రకటనలు వ్రాసియివ్వడం అతనికి ప్రాణసంకటంగావుండి, చివరికి ఆ ఉద్యోగానికి రాజీనామాయిచ్చి, మరొక చోటికి వెళ్లిపోయి, సర్వసామాన్యమైన పనివాడుగా చేరాడు. ఆ రకంగా వ్యక్తిత్వాన్ని కాపాడుకోగలవారు అరుదు.

ప్రపంచంలో అసంపూర్ణంగావున్నవి అనేకంఉన్నాయి. "ఏమిచేయాలో నాకు తోచడంలేదు; నాకుదగ్గ పనిలేదు" - అని అనడం సిగ్గుచేటు. వ్యాపారస్థుడు తన వ్యాపారధర్మమే గాక యితర విషయాలుకూడా కొంచెమో గొప్పో తెలును కోవాలి. నిరంతరం లాభాలకోసమే దేవుళ్లాడే బదులు, యితర విషయాలవైపు దృష్టి మరలించడంతో మనసుకి విశ్రాంతి లభిస్తుంది.

అరవై అయిదోఏట స్కూలు టీచరుగా రిటైరై, ఆ పైన లాకాలేజీకివెళ్ళి, లా పరీక్షపాసై, డెబ్బయిలలో న్యాయవాద

వృత్తి స్వీకరించి నాయన నాకుతెలుసు. జీవితం అవకాశాల పుట్ట. ఎటొచ్చీ, మనం వాటిని సద్వినియోగంచేసుకోలేక నిరుత్సాహపడుతూవుంటాము. విశాలమైన ఈ మానవజీవితాన్ని ప్రకరణలుగా విభజించి, ఆ ప్రకరణాలప్రకారం బతకనేర్చుకోవాలి. లార్డ్ ట్వీడ్స్‌మూర్ జీవితం అట్లాంటిక్ యిరుపక్కల నున్నవారిని విభ్రాంతపరిచింది. ఆయన సైనికుడు, రచయిత, వ్యాపారప్రముఖుడు, రాజకీయ ప్రజ్ఞానిధి - యిన్నీ ఒకే జీవితంలో పెనవేసుకునివుండటమే గాకుండా జీవిత మొత్తానికి ఏకత్వం సమకూర్చాయి. అవన్నీ ఆయన జీవితంలోని వివిధఅధ్యాయాలు. ఒకదాని తర్వాత ఒకటిచొప్పున ఆ అధ్యాయాలు పఠించాలి.

సృజనాత్మకవిషయాల గురించి మాట్లాడుతున్నప్పుడు స్త్రీలని మొట్టమొదట పేర్కొవాలి. మాతృత్వం వారికి ఆనందాన్నిచ్చే మాటనిజమే; కాని పిల్లలు పెరిగి పెద్దవాళ్లయే నాటికి, వీరికి, అనగా తల్లులకి, తమది అను వ్యాపకం ఏమీ కనబడదు. ఆఖరు పిల్లవాడు బడికివెళ్లడం మొదలు పెట్టినప్పట్నుంచీ, తల్లికి తనజీవితంనుంచి ఏదో రాలిపోతున్నట్టుతోస్తుంది. అదే టైములో స్త్రీలు తమదృష్టిని యితర వ్యాపకాలవైపు మళ్ళించాలి. ఆ పనిచెయ్యక, చాలామంది తమజీవితం నిరాశాజనకమవుతున్నదని వాపోతారు. ఇన్నాళ్లబట్టీ పిల్లల్ని పెంచడంలో టైము గడిచిందనీ, యిప్పుడు తమకి తీరికలభించిందనీ, ఆ తీరికని సక్రమంగా వినియోగించుకోవలసిన అవసరమున్నదనీ యోచించరు.

ఆపైన వోనర్ షిప్ గురించి చెప్పుకుందాం. వోనర్ షిప్ అనగా స్థిరాస్తి అయితేనేం, చరాస్తి అయితేనేం ఆస్తి హక్కు. "ఇది నాది" అనిపించుమేటే ఆస్తి హక్కు. పురాతన సంస్కృతులూ, వెనకటి నాగరికతలూ ఈ "ఆస్తి హక్కు" మానవ పురోభివృద్ధిలో ఒక భాగంగా గుర్తించాయి. ఈ యిల్లు నాది, ఈ వస్తువులు నావి, ఈ మనుషులు నా వాళ్లు - అను భావన మూల బీజంగా కుటుంబ వ్యవస్థ నిర్మితమైంది. ఆస్తి హక్కు కుటుంబ రీత్యా సంక్రమిస్తూ వుండేది. 'వోనర్ షిప్' మంచిదే - అది ఎంతమందికి పంచగలిగితే అంత మరీ మంచిది. 'వోనర్ షిప్' (ఆస్తి) మానవునికి తేజాన్నీ బలాన్నీ యిస్తోందని మనం మర్చిపోకూడదు.

'ఓనర్‌షిప్' విషయంలో రష్యనుల దృక్పథం వేరు. స్వంత వ్యాపారమూ, కార్మిక వినియోగమూ ('ఎంగేజ్ ఇన్ ట్రేడ్ అండ్ ఎంప్లాయ్ లేబర్') మంచివి కావని వారి అభిప్రాయం. స్వంత ఆస్తి అనునది అసలే వుండకూడదని వారు ప్రారంభించారు గాని, కాలక్రమేణా ప్రయివేటు ఆస్తిదారులు, సాంఘిక నిర్మాణంలో ఒక భాగంగా వారుకూడా అంగీకరించక తప్పలేదు. అమెరికాలో 'బూర్జువా' ఏదో 'ప్రొలిటేరియట్' ఏదో విడమరిచి చెప్పడం కష్టం. మోటారు కారులూ, స్వంత యిళ్లూ, తమ కంపెనీలలో షేర్లూగల అమెరికను కార్మికులని 'బూర్జువా' అనడమూ కష్టమే, ప్రొలిటేరియట్ అనడమూ కష్టమే !

పాశ్చాత్య ప్రపంచపు ఆదర్శధర్మ ప్రకారం, - వివరైతే ఫలానా భూమిమీద పనిచేస్తారో, వారిదే ఆ భూమి ('ది మేన్ హు వర్క్స్ ద లేండ్ హి ఓన్స్'). భూమిని నమ్ముకు, భూమికి కట్టుబడి జీవించే పెద్ద మనుషులు అమెరికాలో అక్కడక్కడ వున్నారు. క్రుంగిపోతున్న సంస్కృతిని తమ చేతనైన విధంగా నిలబెడుతున్న మహామహులువారే ; తాము జీతపురాళ్లకోసమే పాటుపడుతున్నామను దురభిప్రాయం లక్షలాది స్త్రీ పురుషుల హృదయాలనుంచి మాయమవాలి.

ఆస్తి భావన పెద్దలలోకంటె పిల్లలమీద ఎక్కువగా పని చేస్తుంది. పిల్లలెప్పుడూ చుట్టూ పరిసరాలు తమవి - అనే భావంతో పెరుగుతారు. మన వస్తువులకీ పరాయివాళ్ల వస్తువులకీ ఎంత తేడావో, మన యిల్లూ పరాయి యిల్లూ విషయంలో, బాల బాలికలు అదేవిధంగా ఫీలవుతారు. నిజానికి 'తమది' అను భావన, పిల్లలకి వున్నంతగా పెద్దలకి వుండనే వుండదు.

సంపదలు ఎంతమాత్రం చెడ్డవి కాదు; కాని సంపద యావత్తూ కొద్దిమంది చేతులలోవుండి పోవడమనేది చెడ్డదే కాదు, ప్రమాదకరం కూడాను. సిరి సంపదలు మానవుల కెప్పుడూ భోగభాగ్యాలని యిస్తాయి. అవి మానవులందరూ సమంగా పంచుకోగలగాలి.

దేశ సంపద కొద్దిమంది భాగ్యవంతుల హస్తగతమై వుండటంవల్ల కాపిటలిజమ్ రూపొందుతోంది - అదీ మనకొద్దు.

ఆస్తిహక్కు వ్యక్తికి లేకపోవడమనేది సోషలిజమ్ అంటు న్నారు - అదీ మనకొద్దు. కాపిటలిజమ్, సోషలిజమ్ రెండూ కూడా వికృతాకారంతో మనముందు నాట్యమాడుతున్నాయి. ఆ రెండూ మనకొద్దు. బుర్రతోగాని చేతితోగాని కష్టపడి పని చేసే ప్రతిమనిషికీ "యిదుగో - యిది నీది" అని చెప్పగలిగే సాంఘిక వ్యవస్థ మనకి కావాలి. మన మీ ఆదర్శాన్ని యివ్వాళ రేపట్లో అందుకోలేకపోవచ్చు; కాని అటువైపుగా ప్రయాణంచేస్తున్నామంటే మనసుకి తృప్తి.

---

# 7

# వ్యక్తిత్వం

ఘనంగా చెప్పుకోబడాలనే కాంక్షవల్ల ఘనత రాదు.

— *యాడమ్ స్మిత్*

త్రన చుట్టూవున్న పదిమందీ తనని గురించి మంచిగా అనుకోవాలనే అభిప్రాయంలో బతుకుతాడు మానవుడు. తనని నిర్లక్ష్యంచేసినా, తనని హీనంగా చూసినా అతను పడే బాధ దేహబాధకంటె ఎక్కువది. నలుగురూ తనని ఉత్తముడు అని చెప్పుకోవాలనే చింతన మానవ స్వభావధర్మంలో ఒక ప్రధానాంశం - పలుకుబడి పట్ల గల అపేక్ష యింతా అంతాకాదు. పలుకుబడి అంటే ఎలా ఉంటుంది, ఏది ప్రతిష్ట ఏది అప్రతిష్ట అనే విషయాలు - అయా సంఘాలని బట్టీ, అయాదేశాలనిబట్టీ వుంటాయి. ప్రతిష్టమీద మక్కువ లేని ప్రజలు ఎక్కడా వుండరు.

పదిమందీ తలవూపే పనులుచేసి, వారి మెప్పుని పొందడమనేది నాగరికతలో ఒకభాగము. నాగరికత వివిధ స్థాయిలలో అనేక విధాలుగా కాపాడబడుతుంది - అందులో 'ప్రతిష్ట' అనునది ప్రధానమైన విషయం. మనుషులు యుద్ధభూమినుంచి పారిపోకపోవడానికి కారణం, వారికి భయం వెయ్యకనూ కాదు, పారిపోయేందుకు కాళ్ళురాకనూ కాదు - పారిపోతే తమని భీరువులంటారనే (కవర్డ్స్) భయంవల్ల, ఆమాటపడటం యిష్టంలేక, ప్రాణాలకి తెగించిపోరాడుతారు యుద్ధరంగంలో. కంటినిండా నిద్ర, కడుపునిండా భోజనం దేహానికి శాంతినిస్తాయి - కాని, మనసు వాటితో తృప్తిపడదు. పది మందిచేత తను చేస్తున్న పనులు బావున్నాయని అనిపించుకోవాలని వుంటుంది దానికి, - అనగా అ మనసుకి.

మన ప్రవర్తన అందరికీ అంగీకార సూచకంగావుండాలని మహతపన పడతాము. ఎవరైనా 'వెలి'వేసినట్టుగా చూస్తే మనకి కలిగే బాధని మాటలలో చెప్పలేము - దానంతటి శిక్ష అదేగాని మరొకటిలేదు. మనం నిర్గమించిన తర్వాత కూడా మన గురించి మనుషులు మంచిగా అనుకోవాలని భావిస్తాము; మరణానంతరం కూడా మనధవళకీర్తి చెడకూడదు.

మన గురించి పదిమందీ మంచిగా అనుకోవాలనే భావన వల్ల సాంఘికంగా చాలా మేలు చేకూరుతోంది. న్యాయస్థానాలూ పోలీసువారూ ఆచరణలో పెట్టలేనివి, ఈభావనవల్ల సాధ్యమవుతున్నాయి. నలుగురికీ తెలిస్తే ఏమనుకుంటారో అను భయంవల్ల చాలామంది చెడ్డపనులు చేయడానికి వెనకాడుతారు. ఒకనికి జైలుశిక్ష పడటంగానీ జరిమానాపడటంగానీ అంతపెద్ద విషయంకాదు – అది పదిమందికీ తెలియడం బాధావహం. వార్తాపత్రికలు ఆ విషయాన్ని పెద్దగా ప్రచురించడంవల్ల వ్యక్తికిగల శీలసంపద దెబ్బ తింటుంది. బాతాఖానీ కబుర్లలో మనిషి ప్రతిష్ఠని క్రిందకి లాగుతారు. బాధ్యతా రహితంగా అనే అప్రదిష్టపు మాటలు మనిషిని కూలదీస్తాయి.

పరిస్థితుల మార్పుతో పదిమంది అంగీకారమూ పొందాలనే భావనకూడా మారుతుంది. గ్రామ జీవనంలోనూ పట్నవాసపు జీవనంలోనూ ఈ తేడా కనిపిస్తుంది. పదిమంది నైతిక అంగీకారమూ పొందనటువంటిపని పల్లెటూళ్ళో చేయలేము; అదే పట్నవాసంలో అయితే వేరు. అక్కడి విమర్శకులు వేరు, యిక్కడి విమర్శకులు వేరు. మనిషికి శీలసంపదవల్ల

లభ్యమయే గౌరవమూ, పదిమంది మెప్పువల్ల పొందదగు ప్రతిష్టా ఒకదానితో ఒకటి పెనవేసుకుని వుంటాయి.

కీర్తి ప్రతిష్టలనునవి నాగరికతాభివృద్ధికి ఎంతో అవసరం. వాటిని పునాదిరాళ్ళుగా చేసుకుంటే తప్ప ఏ నాగరికతా నిలబడలేదు. కీర్తి ప్రతిష్ఠలనండి, గౌరవ ప్రతిష్ఠలనండి - ఈ పలుకుబడివల్ల మానవుడు శక్తివంతుడవుతున్నాడు. అన్ని శక్తులకిమల్లే దీనినికూడా మంచికీ చెడుకీ కూడా వినియోగించవచ్చు. పలుకుబడిని సద్వినియోగం చేయనప్పుడు 'చెడు' జరుగుతుంది. పేరు ప్రఖ్యాతులవల్ల మనిషికి సుఖం కలుగుతుందని చెప్పలేము; అవి శాంతి సుఖాలకీ స్వభావోన్నతికీ ఎంతమాత్రం చిహ్నం కానేరవు. ప్రఖ్యాతవ్యక్తి అందరికి వలెగాక భిన్నంగా ఉంటాడు. ఆ భిన్నత అతనిని నిలకడగా వుండనీయక, కుడి ఎడమలకి పదేపదే తిప్పుతుంటుంది.

పేరు ప్రఖ్యాతులు గల మనిషి, వాటిని నిలబెట్టుకునేందుకు పడే తాపత్రయం, విచిత్రంగా ఉంటుంది. అతనిజీవితమొక ఉద్రేకాల పుట్టగా మారుతుంది. పేరు ప్రఖ్యాతుల మీద తృష్ణ వుండటం వ్యక్తికి మంచిదికాదు; ఎంచేతనంటే, ఆ నిప్పు రాజేసినకొద్దీ మండుతుంది. ఎంత పేరొచ్చినా యింకా రావాలనే ఉంటుంది; దానికి అంతు అంటూ లేదు. శక్తిగల వ్యక్తిచుట్టూ పొగిడేవాళ్ళు తయారవుతారు. పొగడ్తలకి అలవాటైన చెవులు, యింకా మంచి పొగడ్తలు వినాలని వాంఛిస్తాయి. అంచేత, శక్తిగల వ్యక్తులచుట్టూ భట్రాజులు తయారవుతున్నారంటే, అందులో ఆశ్చర్యపడవలసినదేమీ

లేదు. అధికార తృష్ణకి తృప్తి ఏనాడూ కలగదు. పొడి కట్టెలు వేసినకొద్దీ అది యింకా బాగా మండుతుంది. అధికార దేవతకి బ్రహ్మరాక్షసి కున్నంత ఆకలి - మరణంతో గాని తీరని ఆకలి.

కీర్తికాంత ఆకలి తీర్చినకొద్దీ ఆకలి ఎక్కువవుతూ వుండటం సంతోష హేతువుగాక విచారకారణం. ప్లూటర్క్ రచన చదివినవారికి మారియస్ ఉదాహరణ చక్కగా అవగతమవుతుంది. మారియస్ ఏడుసార్లు రోము నగరానికి కాన్సల్‌గా ఎన్నుకోబడతాడు - అప్పటికీ అతని అధికార వాంఛ చల్లారదు. అతని అధికార తృష్ణ ఎటువంటి వెర్రి తలలు వేస్తుందంటే, చివరి రోజులలో అతను పూర్తిగా పిచ్చివాడవుతాడు.

పేరు రావడంలో (పాపులారిటీ - జనప్రీతి), రావడమెంత నిజమో, పోవడంకూడా అంతే నిజం. కీర్తికాంతది నిలకడ లేని స్వభావమని, మన పూర్వీకులు ఏనాడో అన్నారు. ఒక వ్యక్తిని ఈనాడు పైకెత్తిన ప్రజలే, రేపు కిందకి దిగలాగుతారు. ఇవ్వాళ జయజయ ధ్వానాలు పలికిన కంఠాలే, రేపు అనరానిమాట లంటాయి. పొగడ్తలకి వుబ్బిపోయిన మనిషి, తిట్లకి కుంగిపోకమానడు. జనప్రియత్వమే ఘనంగా భావించడంవల్ల, అనేక యిక్కట్టులకి లోనవక తప్పదు. పోనీ, యిన్నికష్టాలుపడ్డా, అది లభిస్తుందా అంటే, ఆ సంగతి కూడా విస్పష్టంగా చెప్పలేము.

ప్రతిభావంతులగువారు కఠిన పరీక్షలకీ కఠిన విమర్శలకీ గురికాక తప్పదు. ప్రతిభ (ఎక్సెలెన్స్) ఎక్కడ కనపడ్డా,

వానిని సామాన్యులు (మీడియోక్రిటి) ఎదుర్కొని తీరుతారు. సామాన్యతకి ప్రతిభ అంటే ఏవగింపు వుండటం సహజము. సామాన్యులు అసామాన్యులని క్షమించలేరు. ఆ కారణం వల్లనే వారు అసామాన్యులని తమదగ్గిరున్న అయుధాలన్నిటి తోటీ ఎదుర్కొంటారు. ఒక ఆదర్శానికి కట్టుబడిన మనిషి కఠినునివలె, రాతిగుండె గలవానివలె కనిపిస్తాడు సామాన్యులకి. జనబాహుళ్యంతో కలిసిపోక, కొంగమెడ జాపే ప్రతి ఒక్కడూ, సామాన్యుని ఆగ్రహావేశానికి గురికాక తప్పదు. ఆ కారణంవల్లనే కొందరు సుకుమార హృదయులు ప్రతిభావంతులవడమూ, అశేష ప్రజానీకం అనామకంగా వుండటమూ సంభవ మవుతోంది.

దూషణభూషణాలకి అతీతుడు కాగలిగినవాడే ఈ ప్రమాదకర పరిస్థితులను తెంచుకు బయటికి రాగలుగుతున్నాడు. విమర్శలు తమగురించి కాదన్నట్టు ప్రవర్తిస్తూ, స్తోత్ర పాఠాలకి వుబ్బితబ్బిబయేవారు కష్టసముద్రంలో ఈదులాడవలసి వస్తుంది. పొగుడుతున్నప్పుడు బావుండి, తిడుతున్నప్పుడు బాధగా వుండటం మానవ సహజం. కాని, ఈ దూషణభూషణాలు తనని అంటనట్టు ప్రవర్తించగలిగినవాడే, మనకి గౌరవ పాత్రుడవుతున్నాడు. డాక్టర్ జాన్సన్‌కి ఈ విషయం బాగా తెలుసు - అందుకనే తిట్లూ దీవనలూ తనని అంటకుండా వుండాలని కోరాడు.

ఒక కార్యంలో నిమగ్నులై, ఆ కార్యసాధనకి కృషిచేసే వారిని బయటివారి అభిప్రాయాలు అంతగా బాధించవు. "అనుకోనీ, వాళ్ల యిష్టమొచ్చినట్టు అనుకోనీ - నాపనే నాకు

ముఖ్యం,'' అని సంతృప్తిచెందుతారు. అబ్రహిమ్ లింకొన్ తన జీవితంలోని అఖరు నాలుగుసంవత్సరాలలో చూపిన ఓర్పు వర్ణనాతీతం. తనకి అనేకమంది శత్రువులువున్నారనీ, తనని దూషించేవారూ తనమీద నిష్కారణద్వేషం కురిపించే వారూ లెక్కలేనంతమందివున్నారనీ ఆయనకి తెలుసు. కాని, వారందరికీ సమాధానం చెప్పగలిగే పాటి వ్యవధిలేదు - వున్నకాలమా స్వల్పం, యూనియనునా ప్రాణాధికంగా కాపాడాలి. అంచేత, తనలక్ష్యమే ప్రధానంగా ఎంచుకుంటూ దూషించే వారిమాటలు లెక్కజేయకుండా, ముందుకి సాగి పోయాడు. ఒకానొక ఉద్యోగి ప్రెసిడెంట్ లింకొన్‌ని అడిగాడు: "ఉన్న విషయమేదోచెప్పి, ఈ పత్రికవారువేస్తున్న అభాండాలనుంచి తప్పించుకోనడం మంచిది కాదా?''

"అ... ఇప్పుడుకాదు. యిప్పుడు తొందరేమివచ్చింది? తలకిమించిన పని యింతవుండగా, వాళ్లకి జవాబులు చెబుతూ కూచోడందేనికి? వాళ్లు అనదలుచుకున్నది అననీ-నా చేతనైనంతవరకూ, నేను మంచిచేసేందుకే ప్రయత్నిస్తున్నా. చివరిదాకా ఈ ప్రజలకి మేలుచేసేందుకే కృషి చేస్తా. వారు నన్ను మాటలు అననీగాక - వొచ్చిన నష్టమేమిటి? నా కృషి ఫలవంతమైనప్పుడు, వారు యిప్పుడు అన్నమాటలు, ఎలానూ మర్చిపోతారు, నా ప్రయత్నం విఫలమైందా, పదిమంది దేవకన్యకలువచ్చి నన్ను కీర్తించినా, వారు వినరు,'' అన్నాడు అబ్రహిమ్ లింకొన్.

ఇప్పుడు అబ్రహిమ్ లింకొన్ ఎంత గొప్పవాడో పాశ్చాత్య లోకం వేనోళ్లపొగుడుతుంది. 19 వ శతాబ్దం మానవజాతికి

ప్రసాదించిన పూజా ప్రసూనంగా అయన భావింపబడతాడు. తన ఆశయసిద్ధికిగాను దూషణభూషణాలు అయన లక్ష్య పెట్టలేదను విషయం చాలామంది గమనించరు. 1865 వసంతకాలంలో 'పంచ్' అనుపత్రిక అయన గురించిచేసిన ఆరోపణలకి పబ్లిక్‌గా క్షమార్పణచెప్పుకుంది; అటువంటి ఉన్నతాత్మునిగురించి, తను వేళాకోళంచేసినందుకు, ఎంతో నొచ్చుకుంది. లింకొన్ యింకో సంవత్సరానికి హత్యచేయ బడుతాడనగా, 1864 జులై 9 వ తేదీ 'న్యూయార్క్ వరల్డ్' అయునగురించి ఈ విధంగా వ్రాసింది:

"రాజనీతిజ్ఞులకాలం వెళ్ళిపోయి, దర్జీలూ, వడ్రంగులూ, బఫూన్లూ, వెర్రి వెంగళప్పలూ, మూఢమతులూ - వీళ్లకాలం వచ్చింది......దేశం యావత్తూ ప్రమాదకరమైన ప్రతిష్టంభ నలో మునిగిపోగా, నాగరికతావాసనలేనివారూ, మూడవతర గతి మారుమూలన్యాయవాదులూ అయిన యిద్దరు జ్ఞాన శూన్యులలో ఎవరో ఒకరిని, అన్నిపదవులలోకి పెద్దదైన ప్రెసి డెంటుపదవికి ఎన్నుకోవలసిరావడం మన దౌర్భాగ్యం...... భగవంతుడే ఈ రిపబ్లిక్‌ని రక్షించుగాక!"

తన్ను గురించి యిలా వ్రాస్తున్నప్పుడు, ఒక్కముక్క జవాబుచెప్పకుండా, నిశ్చలమార్గాన్ని అనుసరించి నడవడం, లింకొన్ గొప్పదనానికి చిహ్నంకాదా? ఆ ధీరోదాత్తతే అయ నని అంతవాడిగాచేసింది. పత్రికలలోపడే ఈ వెర్రి మొర్రి కబుర్లకి తను సమాధానంచెబుతూ కూచుంటే, తను కిందికి దిగిపోయినట్టు అవదూ? ఇంతకంటె అవసరవిషయాలనేకం,

తను పరిశీలించవలసివుంది. మనలో నిజాయితీవున్నప్పుడు, యితరులు ఏ మనుకుంటారో అనుభయం, మనని పీడించదు.

ఒకసారి జనరల్ 'లి' తనసేనను శత్రువశం (సరన్డర్) చేయవలసివచ్చినప్పుడు విషమావస్థలో పడ్డాడు. శత్రు సైన్యాలు అసంఖ్యాకంగాఉన్నాయి - పోరాటంవల్ల తన సైని కుల ప్రాణాలుపోతాయే గాని ప్రయోజనమేమీ సిద్ధించదు. అకారణంగా వారిప్రాణాలు బలిపెట్టడం నీతి బాహ్యంగా తోచింది జనరల్ 'లి'కి. శత్రువశమవడం గురించిన ప్రస్తా వనరాగానే ఒక అఫీసరు అన్నాడు: "జనరల్, జనరల్ - చరిత్ర మీ గురించి ఏమనుకుంటుంది?"

"నాకుతెలుసు - చరిత్ర నా గురించి కఠినవాక్కులు పలుకుతుంది. మన శత్రువు సంఖ్యాబలం వాళ్లకితెలియదు, చరిత్ర ఏమనుకుంటుందో నేను ఆలోచించడం లేదు - లోబడటం మంచిదా చెడ్డదా అని ఆలోచిస్తున్నా. ఈ పరి స్థితులలో లోబడటం (సరన్డర్) రైటు అయినప్పుడు, ఆ బాధ్యత నా భుజాలమీద వేసుకుంటాను."

జనరల్ 'లి'కి వలె ఆలోచించే వారికి ఆత్మశాంతి ఉంటుంది. ఆత్మ ఆంగీకరిస్తేగాని వారు ఆ పనికిపూనుకోరు. రైటు, తప్పు అనునవి వారు విశ్వజనీనదృష్టితో చూడగలుగు తారు. ఈ మహానాటకంలో తమదొక స్వల్పపాత్ర అని, వారికి అంతర్యంలో తెలిసివుండబట్టే, ఏ సమస్యనైనా కరుణాపూరితదృష్టితో పరిశీలించగలుగుతారు.

విమర్శనీ, విమర్శకులనీ మనం ఎల్లప్పుడూ కాదనడానికి వీలులేదు. ఒకొక్కప్పుడు విమర్శకులు మనం లోపరహితు లము కాదనేవిషయం జ్ఞాపకం చేస్తుంటారు. సర్వజ్ఞులమనే భావనతో మనకి తల తిరిగిపోతే మరీకష్టం.

నైతిక లక్ష్యంమాట అటుంచి, ప్రతి జీవితానికీ ఒక సుందర స్వప్నంఉండాలి. ఆ స్వప్నమూ ఈ జీవితమూ కలిసి ఏకత్వంగా రూపొందుతాయి. ఆశలూ ఆశయాలూ సన్నిహితమైనవి. అవి రెండూ లేనినాడు జీవితమేదో ఎడారి వలె కన్పడుతుంది. లక్ష్యసాధనకోసం కష్టించడంలోనే మానవుని ఔన్నత్యం ప్రకాశిస్తుంది.

"ఉదాత్తగుణసంపన్నుడైనవాడు, పదిమందీ ఫలానా విషయం బావుందని అన్నంతమాత్రాన, తనూ వారితో కంఠంకలపడు. సంఘం తప్పుదారిపడితే, 'నీది తప్పుదారి సుమా' అని చెప్పగలుగుతాడు. తను వారించిన ఉత్తర క్షణంలో ప్రజలందరూ తనమాట వేదవాక్యంగా భావిస్తారనే అపోహచెందదు. తనకి నిజమనితోచినది, పదేపదే చెప్పేం దుకు, ప్రయత్నిస్తాడు. ఆ మాటలు ఎంత అనునయంగా చెబుతాడంటే, ఒకరోజున ఈ ప్రజలు - అయనగారుచెప్పి నది నిజమల్లేఉంది – అని అనుకోగలిగేటంత చక్కగాచెబు తాడు. పూర్ణపురుషుడు అనుపించుకునే వ్యక్తి, తను నమ్మిన సత్యాన్ని పదిమందికీ చెప్పడంలో వెనకాడక ముందుకి దూసుకుపోతాడు" - వుడ్రోవిల్సన్ వ్యక్తిత్వమనగా ఏమిటో వివరిస్తూ పై విధంగా చెప్పాడు.

విల్సన్ నిర్వచించిన వ్యక్తి తనకి సంభవించే కష్టసుఖా లని పాటించడు - తనకంటె తనలక్ష్యం గొప్పదని తలపోసిన నాడే, అది వ్యక్తిత్వంగా భాసిల్లుతుంది. తన గురించి లోకులు ఏమనుకుంటున్నారో లెక్క జేయకుండా వుందా మనుకోవడంకంటె అవి తనని అంటవనీ ఈ గాలి కబుర్ల కంటె లక్ష్యసాధన ఘనతరమైనదనీ అనుకోవడం యింకొక మెట్టు పైకికదా!!

---

విమర్శనీ, విమర్శకులనీ మనం విల్లప్పుడూ కాదనడానికి వీలులేదు. ఒకొక్కప్పుడు విమర్శకులు మనం లోపరహితు లము కాదనేవిషయం జ్ఞాపకం చేస్తుంటారు. సర్వజ్ఞులమనే భావనతో మనకి తల తిరిగిపోతే మరీకష్టం.

నైతిక లక్ష్యంమాట అటుంచి, ప్రతి జీవితానికీ ఒక సుందర స్వప్నంఉండాలి. ఆ స్వప్నమూ ఈ జీవితమూ కలిసి ఏకత్వంగా రూపొందుతాయి. ఆశలూ ఆశయాలూ సన్నిహితమైనవి. అవి రెండూ లేనినాడు జీవితమేదో ఎడారి వలె కన్పడుతుంది. లక్ష్యసాధనకోసం కష్టించడంలోనే మానవుని ఔన్నత్యం ప్రకాశిస్తుంది.

"ఉదాత్తగుణసంపన్నుడైనవాడు, పదిమందీ ఫలానా విషయం బావుందని అన్నంతమాత్రాన, తనూ వారితో కంఠంకలపడు. సంఘం తప్పుదారిపడితే, 'నీది తప్పుదారి సుమా' అని చెప్పగలుగుతాడు. తను వారించిన ఉత్తర క్షణంలో ప్రజలందరూ తనమాట వేదవాక్యంగా భావిస్తారనే అపోహచెందదు. తనకి నిజమనితోచినది, పదేపదే చెప్పేం దుకు, ప్రయత్నిస్తాడు. ఆ మాటలు ఎంత అనునయంగా చెబుతాడంటే, ఒకరోజున ఈ ప్రజలు - అయనగారుచెప్పి నది నిజమల్లేఉంది - అని అనుకోగలిగేటంత చక్కగాచెబు తాడు. పూర్ణపురుషుడు అనుపించుకునే వ్యక్తి, తను నమ్మిన సత్యాన్ని పదిమందికీ చెప్పడంలో వెనకాడక ముందుకి దూసుకుపోతాడు" - వుడ్రోవిల్సన్ వ్యక్తిత్వమనగా ఏమిటో వివరిస్తూ పై విధంగా చెప్పాడు.

విల్సన్ నిర్వచించిన వ్యక్తి తనకి సంభవించే కష్టసుఖా లని పాటించదు - తనకంటె తనలక్ష్యం గొప్పదని తలపోసిన నాడే, అది వ్యక్తిత్వంగా భాసిల్లుతుంది. తన గురించి లోకులు ఏమనుకుంటున్నారో లెక్క జేయకుండా వుందా మనుకోవడంకంటె అవి తనని అంటవనీ ఈ గాలి కబుర్ల కంటె లక్ష్యసాధన ఘనతరమైనదనీ అనుకోవడం యింకొక మెట్టు పైకికదా!!

---

# 8

# ధైర్యగుణం

అవును, పందెం వేయాలి. పందెము వేయనంటే కుదరదు. వొడ్డవలసిందే, ముందుకి వురకవలసిందే - వురకనంటే ఎలా ?

- బ్లెయిజి పాస్కల్

గ్రీకు మేధావులు మానవ స్వభావాన్నీ ప్రవర్తననీ పరిశీలిస్తూ ధర్మవర్తనవేరు, వివేకవర్తన వేరు అని రెండుగా విభజించి చూడగలిగారు. వివేకమార్గం అవలంబించినా, ధర్మమార్గం వెంట నడిచినా ముఖ్యమైన సద్గుణాలు నాలుగు - అని అన్నారు. అవి ఏవంటే: ప్రాజ్ఞత, ధైర్యము, సహనము, న్యాయము (విస్‌డమ్, కరేజ్, టెమ్‌పరెన్స్ అండ్ జస్టిస్) పాశ్చాత్యసంస్కృతి ఈ నాలుగింటినీ సద్గుణాలుగా భావిస్తుంది. వీటితోపాటు యూదులపద్దనుంచి (పాలెస్టయిన్) కూడా మనం కొన్ని నేర్చుకున్నాము.

వ్యక్తులని వ్యక్తులుగా గౌరవించవలెనను భావన, పాశ్చాత్య సంప్రదాయంలోని ప్రధానధర్మాలలో ఒకటి. మన నైతిక జీవనంలో అదొక ముఖ్యఘట్టం. "జీవితానిదేముంది - జీవితంలోకి తీసుకురాగల ధైర్యం ప్రధానంగాని!" అని అంటాడు హ్యు వాల్‌పోల్ 'ఫార్టిట్యూడ్' అను గ్రంథంలో. జీవితానికీ ఉత్తమజీవితానికీ మధ్య సహస్రాంతం తేడా ఉంది. మన సమాజంలో అనునిత్యం కనిపించే నిరాశకి అతీతంగా బ్రతకగలుగుతారు కొందరు స్త్రీ పురుషులు - వారే నిజమైన ధైర్యవంతులుగా ఉత్తమజీవనులుగా కనిపిస్తారు.

ఉత్తమజీవనం అలవరుచుకునేందుకు 'మాజిక్' అంటూ ఏమీలేదు. సాటిలేని ధైర్యస్థయిర్యాలతో జీవించినవారే,

ఉదాత్తపురుషులుగా వ్యవహరింపబడుతున్నారు. ఒక సమస్యవున్నదంటే, ఆ సమస్యాపరిష్కారానికి గల భిన్న భిన్నమార్గాలను, వారు ఓర్పుతో పరికిస్తారు. ప్రతి పరిష్కార మార్గం గురించీ సావధానంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వస్తారు. వారి ఆలోచన అంతా నిర్ణయానికి రాకముందే గాని, నిర్ణయాని కంటూ వచ్చాక, యిక ఆ విషయం తల పెట్టరు - నిర్ణయప్రకారం నడుస్తారు.

నిశ్చయానికంటూ వెంటనే రాలేకపోవడమనేది, కొన్ని విషయాలలో కొంతవరకూ నిజమే. ఆ సమస్యాస్వరూపాన్ని బట్టీవుంటుంది - మనం వెంటనే నిశ్చయంచేసుకోవలసినదీ, అక్కరలేనిదీ. ఏ సమస్యాపరిష్కారానికైనా కొన్ని ఊహలు మనం ఆధారంగాచేసుకు, ముందుకిసాగుతాం. మన ఊహ రైటుకావచ్చు, కాకపోవచ్చు - ఆ ప్రమాదం ఎప్పుడూవుంది. వాస్తవవిషయాలు ఆధారంగాచేసుకు, వాస్తవపరిజ్ఞానంతో మన ఊహలకి జీవంపోసి, ఏదో ఒకమార్గం తొక్కడం తప్పనిసరి అవుతుంది. అంతదాకా మన సమస్యగురించి ఎంతయినా ఆలోచించవచ్చు. ఒకమార్గం తొక్కామా, యింక ఆ విషయం గురించిన ఆలోచనలేదు - ముందుకి చొచ్చుకుపోవడమే మనకర్తవ్యం. మానవవిజ్ఞానవృక్షం, యిటువంటి ధీరపురుషుల కృషివల్లనే పెరిగి, కాయలుకాసి, మనకి పళ్లనిస్తోంది. కర్తవ్యతావిముఖులై, దూరాననిలబడి చూసే వారివల్ల, మానవజాతి ఏ విధమైన లబ్ధిపొందలేదు. తప్పో రైటో తను అనుకున్నప్రకారం, కొలంబస్ ముందుకి వెళ్లగలిగాడు కాబట్టే, అనేక కొత్తవిషయాలు తెలిశాయి.

మహామహుల జీవితచరిత్రలు చదివితే, అపూర్వమైన సంగతులనేకం తెలుస్తాయి. నీతిశాస్త్రమనగా (ఎతిక్స్) వారి జీవితాలలోని ముత్యాలసరాలు. బుద్ధి బలమెప్పుడూ మానసికశక్తులమీద ఆధారపడివుంటుంది. నిర్ణయజ్ఞానంవున్నప్పుడే బుద్ధి బలం రాణిస్తుంది. అంచేత, ఒక వ్యక్తికి మానసికపరిశీలనలో అద్భుత ప్రావీణ్యంవున్నా, నిర్ణయశక్తి లేనప్పుడు అదంతా బూడిదలోపోసిన పన్నీరే. నిశ్చయం చేసుకోవడమనేది అలవాటవాలి. వ్యక్తిలోని నిశ్చయాత్మక గుణం, వ్యక్తికి శాంతినివ్వడమేగాకుండా, లోకవ్యవహారాన్ని సాఫీగా సాగనిస్తుంది. ఒక వ్యక్తిచేసే నిర్ణయాలు ఒకొక్కప్పుడు తప్పవచ్చు - అలా అని, ఏ నిర్ణయమూలేకుండా కూచోడం మంచిపని కాదు. పరీక్ష పేపర్లోయిచ్చే 'ఛాయిస్' లా ఉంటాయి జీవితంలోని సమస్యలు. ఇదో అదో వ్రాయక తప్పదు. మన ముందువుంచిన వాటిలో ఏదో ఒకదానిని ఎన్నుకోకతప్పదు - మనం ఎన్నుకోకుండా మొరాయించినంత మాత్రాన, నిర్ణయం జరగకుండాఉండదు. ఎటొచ్చీ, మన ప్రమేయంలేని నిర్ణయం జరుగుతుంది - అవతలవస్తువే మనని ఎన్నుకుంటుంది. ఎలాగంటే, మా యింటి ముందు వున్న చక్కనితోటలో చీడ మొక్కలు (వీడ్స్) పెరిగితే, వాటిని తీయించెయ్యడం గురించి నేను శ్రద్ధతీసుకోకపోతే, తోట ఏమవుతుంది? మన జీవితాలు కూడా అంతే.

1950 వేసవికాలంలో అమెరికా ప్రెసిడెంట్ ట్రూమన్ భుజాలమీద దక్షిణ కొరియా సమస్య పడింది. అది తాను కల్పించుకోవలసిన విషయంగా భావించింది అమెరికా

ప్రభుత్వం. ట్రూమన్ ఆనాడు తీసుకున్న నిశ్చయాన్ని ఈనాటికీ కొందరు 'దురాక్రమణ' అనీ, మరి కొందరు ధైర్యగుణమనీ భావిస్తున్నారు. జరిగిపోయాక, జరిగినదాని గురించి

మహామహుల జీవితచరిత్రలు చదివితే, అపూర్వమైన సంగతులనేకం తెలుస్తాయి. నీతిశాస్త్రమనగా (ఎతిక్స్) వారి జీవితాలలోని ముత్యాలసరాలు. బుద్ధి బలమెప్పుడూ మానసికశక్తులమీద అధారపడివుంటుంది. నిర్ణయజ్ఞానంవున్నప్పుడే బుద్ధి బలం రాణిస్తుంది. అంచేత, ఒక వ్యక్తికి మానసికపరిశీలనలో అద్భుత ప్రావీణ్యంవున్నా, నిర్ణయశక్తి లేనప్పుడు అదంతా బూడిదలోపోసిన పన్నీరే. నిశ్చయం చేసుకోవడమనేది అలవాటవాలి. వ్యక్తిలోని నిశ్చయాత్మక గుణం, వ్యక్తికి శాంతినివ్వడమేగాకుండా, లోకవ్యవహారాన్ని సాఫీగా సాగనిస్తుంది. ఒక వ్యక్తిచేసే నిర్ణయాలు ఒకొక్కప్పుడు తప్పవచ్చు - అలా అని, ఏ నిర్ణయమూలేకుండా కూచోడం మంచిపని కాదు. పరీక్ష పేపర్లోయిచ్చే 'ఛాయిస్' లా ఉంటాయి జీవితంలోని సమస్యలు. ఇదో అదో వ్రాయక తప్పదు. మన ముందువుంచిన వాటిలో ఏదో ఒకదానిని ఎన్నుకోకతప్పదు - మనం ఎన్నుకోకుండా మొరాయించినంత మాత్రాన, నిర్ణయం జరగకుండాఉండదు. ఎటొచ్చీ, మన ప్రమేయంలేని నిర్ణయం జరుగుతుంది - అవతలవస్తువే మనని ఎన్నుకుంటుంది. ఎలాగంటే, మా యింటి ముందు వున్న చక్కనితోటలో చీడ మొక్కలు (వీడ్స్) పెరిగితే, వాటిని తీయించెయ్యడం గురించి నేను శ్రద్ధతీసుకోకపోతే, తోట ఏమవుతుంది? మన జీవితాలు కూడా అంతే.

1950 వేసవికాలంలో అమెరికా ప్రెసిడెంట్ ట్రూమన్ భుజాలమీద దక్షిణ కొరియా సమస్య పడింది. అది తాను కల్పించుకోవలసిన విషయంగా భావించింది అమెరికా

ప్రభుత్వం. ట్రూమన్ ఆనాడు తీసుకున్న నిశ్చయాన్ని ఈనాటికీ కొందరు 'దురాక్రమణ' అనీ, మరి కొందరు ధైర్యగుణమనీ భావిస్తున్నారు. జరిగిపోయాక, జరిగినదాని గురించి విమర్శించడం తేలిక. అప్పుడు ఆ క్షణాన ఆ నిశ్చయం తీసుకోకపోవడం పిరికితనంగా పరిగణింపబడవచ్చు. ఆ నిశ్చయాన్ని ఆనాడు తీసుకోక వాయిదా వేయవచ్చు - వాయిదా ద్వారా నిర్ణయ స్వరూపాన్ని మరొకవిధంగా మార్చినవారమవుతాము. దేన్నిగురించి అయినా, అందులో మనం నెగ్గుతామో వోడుతామో తెలియక పూర్వమే అందువిషయమైన నిర్ణయం మనం తీసుకోవలసిన అవసర పరిస్థితి ఏర్పడుతుంది. అంతా అయిపోయాక యిలా చేసివుండవచ్చు, అలా చేసివుండవచ్చు - అని బడాయిలు చెప్పడానికేం! - అది చాలా సులువు. జయాపజయా లెప్పుడూ పరిస్థితులకి కట్టుబడి వుండే మానవ నిర్ణయంలో దాక్కొని వుంటాయి.

అమెరికా ప్రెసిడెంట్ అంతర్జాతీయ రంగానికి చెందిన సమస్య విషయమై నిర్ణయం తీసుకోవలసి వచ్చిందనుకోండి- కాని, నైతికదృష్ట్యా నిత్యజీవితంలో మనం తీసుకోవలసిన నిర్ణయాలుకూడా అదేస్థాయిలో ఉంటాయి. లక్షలాది స్త్రీ పురుషుల్ని దినదినమూ రకరకాల సమస్యలు వేధిస్తూ వుంటాయి. కార్యాచరణ దగ్గిరికి వచ్చేటప్పటికి - పోనీ, రేపు చేదాంలే - అనుకుంటారు చాలామంది. 'రేపు చూసుకుందాములే' అనుకోవడంకూడా, 'కార్యాచరణ'లో ఒక భాగమని చాలామంది గ్రహించరు. తప్పనిసరిగా నెత్తిని పడితేగాని

(ఫోర్స్‌డ్ ఆప్షన్) తమంత తాముగా ఏ పనీ చెయ్యకపోవడం చాలామంది స్వభావం.

జూదగాని ధోరణి కొంత, జీవన ధర్మంలో ఉన్నదా, అని పిస్తుంది. జూదరి మెదడుని వినియోగించక అదృష్టాన్ని నమ్ముకుంటాడు. జూదమాడేందుకు మొండితనంగాని తెలివి తేటలేం గావాలి ? సామాన్యమైనవాటిని వొడ్డిగాని ఉదాత్త మైనవి పొందలేము. వొడ్డటం (వేజర్) అనునది సామాన్య జీవితంలో సుగుణంలాగానే కనిపిస్తుంది. ఏదీ వొడ్డనప్పుడు ఏదీ పోదు, ఏదీ రాదు - ఎక్కడ పడవేసిన గొంగళి అక్కడే ఉంటుంది.

ఏ సమస్యలూ మనని బాధించనట్టూ, మనకి పట్టనట్టూ, అంటీ ముట్టనివిధంగా ప్రవర్తించడమే నేటి ప్రజల ఫిలాసఫీ. "నువ్వు అందులో వేలు పెట్టకు", "నీకెందుకు - నువ్వు దూరంగా వుండు" - యివే ప్రజలు ఒకరికొకరు చెప్పుకునే హితోపదేశాలు. దేన్నిగురించీ వుద్రేకం చెందకుండా ప్రశాం తంగా ఉండటం, లోక వ్యవహారం దూరంనుంచి కనిపెడు తూ వుండటం, మనకెందుకు లెద్దూ అని వీపు చరుచుకోవ డం – ఈ కాలపు ప్రజలకి ఎంతో యిష్టం. అదే వారి ఫిలా సఫీ. కాని, ఆ ఫిలాసఫీకి పునాదిరాయి పిరికితనం.

పై జెప్పిన తత్వంవల్ల మానవుడు తనని తాను కట్టేసు కున్నవాడవుతాడు. బయటికి రావడానికే భయంగావున్న వాడికి, వూరుచివర చెట్లతోపులోని చక్కని ఫలం ఎలా లభ్య మవుతుంది ? లోకానికి అంధుడు కాదలుచుకున్నవాడికి

లోకం యేమి ప్రసాదించగలదు? వోడిపోతామేమో, అపజయం కలుగుతుందేమో అను వెర్రిమొర్రి భయాలులేకుండా ధైర్యోత్సాహంతో ముందుకి సాగడమే ఉత్తమ లక్షణం. తటస్థ విధానం సుగుణమనిపించుకోదు.

తమ్ము గురించిన చింత, భవిష్యత్తు గురించిన బాధలూ లేకుండా నిష్కల్మష హృదయంతో పురోగమించే వ్యక్తుల వల్ల ప్రపంచానికి ఎక్కువ మేలు సమకూరుతోంది. మనకి జీవితంలో సహాయంచేసిన వారిని జ్ఞాపకం చేసుకుంటే, వారు చేసిన ఆ సహాయం, తాము సహాయం చేస్తున్నామనేభావనతో చేసినది కాదని స్పష్టమవుతుంది. వారిలో సహజంగావుండే, సంతోషోత్సాహాలే, మన పట్ల సహాయంగా పరిణమించి వుంటాయి. యేదో మనకి పట్టం కడదామనే ధోరణితో వారు చేసివుండరు. మనని వుద్ధరిస్తున్నట్టు సహాయంచేసే వారిపట్ల మనకి కృతజ్ఞతాభావం వుంటుందేమోగాని, వారిని మనం జ్ఞాపకంపెట్టుకోలేకపోతాము. తెచ్చిపెట్టుకున్న గొప్పలకిపోక సహజంగావున్నప్పుడే మనుష్యులు ఆకర్షణీయులవుతారు.

ఎప్పటికప్పుడు 'వొడ్డటం' (వేజర్) అనేగుణం మనకి సర్వసామాన్యజీవితాలలో మరీ ఎక్కువగా కనిపిస్తుంది. పెళ్ళిచేసుకు గృహజీవనం ప్రారంభించడం సంగతే ఆలోచించండి. పిల్లలూ, రోగాలూ, ఆర్థిక మానసికబాధలూ మొదలైన కష్టాలన్నీ ముందు కాచుకొని కూచున్నాయని తెలిసి యువకుడు ఎందుకు ఈ గోతిలో పడుతున్నాడు? వీటిగురించి తెలియకనా? తనకి ప్రత్యక్షంగా తెలియక

పోయినా, తెలిసినవారు 'తస్మాత్ జాగ్రత, జాగ్రత' అని అంటున్నారుగా! అదే విధంగా పెళ్ళిచేసుకోదలుచుకున్న ప్రతియువతీ, పెళ్ళినాటి అందంతో ఆ కలలతో ఆ సహనంతో చివరంటా ఉండగలదా? చెప్పలేము. అయినప్పటికీ యువతీయువకులు ముందుకి వురక్కుండా అగుతున్నారా? ఊరుకుతారు. బుద్ధికి అతీతమైన జీవనధర్మం వారిచేత ఆ పరుగులు తీయిస్తుంది. త్యాగమనండి, మరొకపేరుతో పిలవండి – జీవితంలో ఎంత వొడ్డగలిగితే అంత పొందగలుగుతాము. ఏమీ వొడ్డలేనప్పుడు, ఏమీరాదు.

శిశుజననం ఎంత తమాషా అవుతుందో ఆలోచించండి. ఇద్దరివల్ల మూడవజీవి ఈ లోకంలోకివస్తోంది - ఆ రాబోయే శిశువు మొగపిల్లవాడే ఆడపిల్లో చెప్పలేము; ఆ శిశువు స్వభావమూ భవిష్యత్తూ ఎలా ఉంటుందో అంతకంటెచెప్పలేము. ఆ శిశువు అంగవైకల్యంతో పుట్టవచ్చు, మనోవైకల్యంతో పుట్టవచ్చు; ఆ శిశువు పెద్దయాకచేసే దుర్మార్గాలవల్ల తల్లితండ్రులు క్షోభపడవచ్చు. ఈ లోకంలోకి రాకపూర్వమే మృత్యువుపట్టుకుపోవచ్చు ఆ శిశువుని.

ఇన్ని ప్రమాదాలూ యిన్ని అవరోధాలూవున్నాయి కదా అని స్త్రీ పురుషులు పిల్లల్నికనడం మానుతున్నారా? శాస్త్ర పరిశోధనలు, పిల్లల్నికనే అవసరంలేకుండా స్త్రీ పురుషులు సుఖించగల అవకాశం కలిగించినప్పటికీ, సాలీనా లక్షోపలక్షలశిశువులు జన్మిస్తున్నారు. ఈ జనాభా పెరుగుదల, వెనకబడ్డ దేశాలలోనే జరుగుతోందనడానికి వీలులేదు. రెండు

మహాయుద్ధాలుచూసి, తమపిల్లలు పురఫిరంగులకి ఆహార మవుతారేమో నను భీతిలేకుండా, పిల్లల్ని కంటున్నారు ప్రజలు. హేతువాదం ప్రకారంచూస్తే యిది నిక్షేపంగా దౌర్బల్యమే! ఇది 'యిద'ని తెలిసివుండి కూడా, సృజనాత్మక ధర్మం వైపుకిసాగడం, మానవునిలోని అపూర్వవిశేషం. హేతువుతో తృప్తిపడడు మానవుడు - హేతువుకి అతీతమైన దేదో అతన్ని నడిపిస్తుంది.

కోర్కెలూ మమతలూ మనని కార్యాచరణనుంచి వెనక్కి లాగకూడదు - వాస్తవవిషయాలు (ఫాక్ట్స్) పరిశీలించి మన కర్తవ్యమేదో తెలుసుకోవాలి. మనం ఒక్కొక్కప్పుడు పొర బడవచ్చు, తప్పుదారిని నడవవచ్చు - అందువల్ల కలిగేనష్ట మేమీలేదు. ఆ పొరబాటు తెలుసుకు ముందడుగువేయాలి. 'విశిష్టపథం కనిపించేదాకా వున్నచోటనేవుంటాను' అనువారు, కాలాన్నీ శక్తినీ వృధాచేస్తున్నారన్నమాట. ఆ విశిష్టపథం కనిపించేనాటికి మనకాలం వెళ్ళిపోయి, మన కాళ్లలో శక్తి నశించిపోవచ్చు. మనకైమూ మనశక్తీ సాటిలేని పెట్టుబడి వంటివి.

"కొన్ని అతిగా ఉండటం గొప్పదనంలో ఒక భాగం" అంటాడు ప్రొఫెసరు వైట్‌హెడ్. మితవాద పద్ధతి (మోడ రేషన్) ఉత్తమమని అన్నికాలాల్లో ప్రజలూ చెబుతూ వచ్చారు. మితధోరణి మంచిదేగాని కొన్నాళ్లకది వూసర క్షేత్రంగా రూపొందుతుంది. అన్నిటికీ సరిపెట్టుకోవడమే మిగిలి, క్రియశూన్యమవుతుంది. మంచి జరిగినా చెడు జరి

గినా 'అతి'వల్ల జరుగుతోందిగాని 'మితం'వల్ల ఏమీ జరగడంలేదు.

రెండు కొసలకూ మధ్య నున్నదే ఉత్తమ జీవనంగా అరిస్టోటిల్ తన నైతిక పరిశీలనా గ్రంథంలో పేర్కొన్నాడు. ధైర్యమనునది తొందరబాటుతనమూకాదు, పిరికిదనమూ కాదు – ఈ రెంటికీ మధ్యనున్నది. అదే మధ్యేమార్గమూ, మూడవ మార్గమూను. అరిస్టోటిల్ దృక్పథంలో మితస్వభావి మంచివాడు. కాని, ఈ విషయాన్ని మనమీనాడు అంగీక రించడం కష్టం. క్రిస్టియన్ సుగుణాలలో మితస్వభావం ఒక టిగా ఎక్కడా ఉదహరింపబడలేదు - బైబిల్‌లో 'మోడరేషన్' అను మాటే లేదు.

మితస్వభావము గొప్పదికాదని నిరూపించేందుకు, ఉదార గుణం సంగతి (జెనెరాసిటీ) చెప్పవచ్చు, మాటవరసకి. ఔదార్యం డబ్బు విషయంలోనేగాక యితరుల గురించి తమ అభిప్రాయాలు వ్యక్తపరచడంలోకూడా కనబరుస్తారు చాలా మంది. ఔదార్యమెప్పుడూ మితస్వభావం కంటె గొప్పదే కదా - అందుకు సంశయ మేముంది ?

వుడ్రో విల్సన్ జీవితగాథని రచించిన బేకర్ అంటాడు : "'అతి'గా వుండటంవల్లనే మంచివనేకం సంభవమవు తున్నాయి. ఎక్కువ గురి, ఎక్కువ భక్తి, ఎక్కువఉత్సాహం- యిటువంటి 'ఎక్కువ'లు వల్లనే మంచివన్నవి పెరుగు తున్నాయి." వుడ్రో విల్సన్ నానాజాతి సమితి విషయంలో

(లీగ్ ఆఫ్ నేషన్స్) ఎక్కువ పట్టుదల చూపిన సంగతి మనందరికీ తెలిసినదే.

మానవుని పురోగమనం సరళరేఖ ననుసరించి సాగడం లేదనీ, అది వంకర టింకరగా పరువులెత్తుతోందనీ, లీలగా కనిపించే వెలుగుకోసం కర్పూరనివాళు లర్పించే ప్రజలు దానికి ఆకృతి కల్పిస్తున్నారనీ మనం వొప్పుకోక తప్పదు. ప్రజల అట్టహాసంలో పైకి అర్థం కనిపించకపోయినా, లోపల సామరస్యం వుండితీరాలి. ఇటూ అటూ వంగి అడుగులు వేయడమే నడక - కదలక నిలబడితే నడక అవుతుందా ? చారిత్రక ధర్మంకూడా అటువంటిదే.

వీటన్నిటినీ మనసులో పెట్టుకుని సామాన్య మానవుల జీవన పద్ధతి గమనిస్తే ధైర్యమనగా యేమిటో చక్కగా బోధ పడుతుంది. పరుల విషయంలో జాలిగా వున్నవారు ధైర్య వంతులు కాకపోరు. మనలో అందరిగుణాలూ కొంతవరకూ వుండి, మన ప్రత్యేక గుణం మళ్లీ వేరుగా ఉంటుంది. ఎవరి జీవితం వారికి ప్రసాదింపబడ్డ కానుక. ఎవరి బతుకు వారు బతకడం నేర్చుకోవాలి. తమ జీవితాన్ని ఎలా వినియోగించ దలుచుకున్నదీ, ఎవరికివారు తెలుసుకోగలగాలి. వినియోగం వల్లనే రాణిస్తుంది జీవితం.

ప్రతి ఒక్కరూ మరణించక తప్పదు. అది అందరికీ తెలిసిన విషయమే. అలా అని జీవితాన్ని తృణప్రాయంగా భావించలేము. మరణించడం తప్పదు కాబట్టే, బతికిన నాలుగురోజులూ చక్కగా బతకాలని అనిపిస్తుంది. ఎక్కువ

సంవత్సరాలు జీవించినంత మాత్రాన జీవికి ఘనత అబ్బదు. హంసఅయి ఆరునెలలు బతకడం గురించే పెక్కుమంది కాంక్షిస్తారు. నిజానికి చావు అనునది అంత దుఃఖభాజనం కాదు - సరిగ్గా జీవించలేకపోవడమే విచారకరం. ఆపదలు వస్తాయేమో అని అనుక్షణం భయపడటంవల్ల అనేకులు నీరసులు అవుతున్నారు. మనం నమ్మిన ఆదర్శానికి ఈ జీవితాన్ని వొడ్డటంకంటె ఆనందకరమైన విషయం మరొకటి లేదు. ఆదర్శ ధర్మంకోసం వెచ్చింపబడ్డ జీవితాలే జీవితాలు- మిగతావి చచ్చు బ్రతుకులు.

ఈ ఫిలాసఫీ వ్యక్తులమీదను, సాముదాయికంగానూ గట్టిగా పనిచేస్తోంది. పాశ్చాత్య పౌరుడు ధైర్యగుణ సంప్ర దాయాన్ని నమ్ముకునివున్నాడు. పిరికివాళ్లు వెనక నిలబడి పోగా, దుర్బలులు మార్గమధ్యంలో ప్రాణాలు వొదలగా, సాహసోపేతులు సప్తసముద్రాలూ గాలించి వచ్చారు తమ చిన్న చిన్న వోడలలో. మన పూర్వీకులు దొంగతనాలు చేసి వుండవచ్చు, యితరులు ఆస్తులు అపహరించివుండవచ్చు - కాని, భీరువులు మట్టుకు కాదు.

మన మీనాడు ప్రపంచ జనాభాకి స్థిరపడిపోయిన మను షులవలె (సెటిల్డ్ పీపుల్) కనిపిస్తాము; మనకివున్న సిరి సంపదలనీ, అధికారాన్నీ, గౌరవాన్నీ, సంస్కృతినీ కాపాడు కునే స్థిరనివాసులవలె కనిపిస్తాము. ఆ 'స్థిరత్వం' మనలో రాలేదనేందుకు వీల్లేదు. 'స్థిరత్వం' వల్లనే సంఘ స్వరూపం జడత్వం దాలుస్తుంది. నాగరికుడైనవాడు తన నిజనివాసం

ఏర్పరుచుకోవడమే కాకుండా, దానిని విస్తృత పరచడం కూడా నేర్చుకోవాలి - అన్నాడు సెయింట్ ఎగ్జుపెరి. స్వయం రక్షణలోనే మన సర్వశక్తులూ వుడిగిపోకూడదు. మనం విప్లవం తీసుకురావాలి, భావ ప్రపంచంలో ఒక వినూత్న విప్లవం తీసుకురావాలి. దేశపుటెల్లలు మర్చిపోగల భావ సామ్రాజ్యమూ, భావ సౌందర్యమూ నిర్మించాలి. ఆ నిర్మాణ కృషి వైపుగా మానవ మేధస్సుని తిప్పితేగాని ఈ భూమండలంమీది ప్రజలు సుఖపడలేరు. ప్రపంచ ప్రజలు తిండీ బట్టకీ తడుముకోవలసిన అగత్యం లేనంతగా శాస్త్రపరిశోధన పెరిగింది. ఎటొచ్చీ, శాస్త్రవిజ్ఞానం మానవాళికి మేలుకూర్చే విధంగా, భావ పరిణామం తీసుకురావలసిన బాధ్యత మన మీద ఉంది.

గత ముప్ఫయ్యేళ్లుగా రష్యనులు ప్రపంచ ప్రజలకి ఒక సుందర స్వప్నాన్ని కల్పించి చూపిస్తున్నారు. ఆ స్వప్నసీమలో కరువు కాటకాలు వుండవనీ, జనులందరూ సుఖోపవిష్టులై వుండగలరనీ బహుళ సంఖ్యాకుల్ని నమ్మిస్తున్నారు. పాశ్చాత్య సంస్కృతి మనకు అందించిన జీవధాతువుల సాయంతో, మనం అంతకంటె అందమైన స్వప్నాన్ని ప్రపంచ ప్రజలకి సమర్పించవచ్చు. ఇది భావ పరిణామంవల్ల రావల్సిందేగాని, మిలిటరీ పన్నాగాలవల్ల అయేపనికాదు.

మనము ప్రపంచ ప్రజానీకానికి ఒక అద్భుతమైన 'విజన్' (మనో సృష్టి) యివ్వగలగాలి. ఆకలిదప్పులూ, అనారోగ్యమూ రూపుమాపి సామాన్య ప్రజలకి కొంత ఆర్థిక స్థిరత్వం చూప

గలగాలి. రక్షణ వ్యయంకంటె 'పాయింట్ ఫోర్ ప్రోగ్రామ్' విషయంలో ఎక్కువ ఆసక్తి కనబరచి, ప్రపంచప్రజానీకాన్ని ఈతిబాధలనుంచి కాపాడాలి. అనాడే మన కల నిజమవుతుంది - ప్రపంచ కల్యాణానికి నిజమైన కృషి చేశామని అనిపించుకునేది కూడా ఆనాడే.

యుద్ధ సామర్థ్యంకంటె శాంతి సామర్థ్యానికి ఊహాపోహలు ఎక్కువ కావాలి. ప్రస్తుత ప్రచ్ఛన్న యుద్ధం భరింపరానిది- మానవుల మధ్య నుండవలసిన విశ్వాసాన్ని అపహరించి భయభ్రాంతులుగా అనుమానాస్పదులుగా తయారుచేస్తోంది. రష్యనులలో మార్పు వస్తుందా రాదా అను విషయం మనకి అనవసరం - ముందు మనం మారాలి. మనవి ఉన్నత ఆశయాలు అయితేతప్ప, అవి ప్రజాహృదయ వీణని మోగించలేవు. ఆ ఉన్నత ఆశయాలకోసం, అవి కార్యరూపం దాల్చగల మార్గాలకోసం మనందరమూ పాటుపడదాం.

---

# 9

# బాధల కన్నీరు

స్వీయానుభవముతో వేదనలూ బాధలూ అర్థం చేసుకున్నవారికే 'తనువు' అనగా ఏమిటో తెలుస్తుంది - కష్టాలు పడ్డవారికే యితరుల కష్టాలు తెలుస్తాయి.

— అల్బర్ట్ ష్వైట్జర్

మనకృషి ఎంత సక్రమమైనదైనా, జీవితమొకొకప్పుడు వంకరదారులు తిరుగుతుందనే వాస్తవవిషయాన్ని ఆమోదించని ఫిలాసఫీ ఫిలాసఫీయే కాదు. అస్వస్థతనీ, వ్యాధినీ జయించాలని మనం నిరంతరం శ్రమపడుతూనేవుంటాం; కాని, అవి మనని చివరంటా వెన్నాడుతూనేవుంటాయి. దుర్బలులూ, అంగవికలులూ, మనోవైకల్యంగలవారూ మనకి ప్రతి తరంలోనూ అగుపడుతూనేవున్నారు. వంశపారంపర్యంగావచ్చే మనోవైకల్యం కొందరి విషయంలో ఉన్మాదంగా పరిణమించవచ్చు. జీవితం తమకి తగు అవకాశాలు కల్పించలేదనే క్రోధంతో ఉంటారు కొందరు. దుఃఖము అను నది ఎంత తగ్గిద్దామనుకున్నా ఏదో ఒకమూల, ఏదో ఒక రూపంలో, ప్రత్యక్షమవుతూనేవుంటుంది. జీవనధర్మంలో 'మిజరీ' ఒక భాగమేమో అనిపిస్తుంది చివరికి.

ఎవరిబాధ వారికి కొండంతగా కనిపించవచ్చుగాని ప్రపంచమొత్తంమీద ఎందరు ఎన్నివిధాల బాధపడుతున్నారో తల్చుకుంటే, కొంచెం ఉపశమనంగా ఉంటుంది. ప్రతిరోజూ కొన్నివేలమంది 'కాన్సర్'వల్ల మరణిస్తున్నారు; కొన్నివేలమంది అనేక కారణాలఫలితంగా అంగవిహీనులవుతున్నారు. అయినప్పటికీ, యిన్ఫెన్టైల్ పెరాలిసిస్‌తో చచ్చుకాళ్ళుబడ్డ తనకొడుకు, ఏ నాటికైనా పరిగెత్తలేక పోతాడా అను ఆశలేని తలితండ్రులువుండరు కదా! ఆ

పుత్రుడు అడుగులువేయడం గురించిన కలలు కంటుండా వుంటారా ఆ తలిదండ్రులు? అది సాధ్యంగాకపోయినా, ఆశ ఆ విధంగా పట్టుకుపీడిస్తుంది. యుద్ధరంగంలో మరణించే వారిసంఖ్య చెప్పలేము - చనిపోయిన వారిమాట అటుంచి బతికివున్నవారి బతుకులు మరీ దుర్భరం; బుర్రలు చెడి పోయినవారూ, కాళ్లూ చేతులూ పోగొట్టుకున్నవారూ వేలాది వేలు. వారి జీవితశేష మొక పీడకలకదా!

స్వాతంత్ర్యోపాసనచేస్తున్నప్పుడు మానవులందరూ సర్వ సమానులు అని అంటాము - అది మాటవరసకి అనేమాట. కొంచెం ఆలోచించిచూస్తే, బుద్ధిలో శక్తిలో, ప్రతిభలో అవ కాశాలలో మానవులందరూ సమానులుకారని యిట్టే తెలు స్తుంది. లక్షోపలక్షల ప్రజలు దురదృష్టవంతులై దౌర్భాగ్యంలో మగ్గుతూవుండగా, కొందరికోసమే మాజిక్ కార్పెట్ పరచ బడిందా అనిపిస్తుంది. లక్షలాది ప్రజలు బక్కచిక్కినదేహా లతో నిరంతర దారిద్ర్యవేదనలో సమసిపోతూండగా, కొందరు మాత్రమే నాగరికతాసుఖాలని అనుభవించగలుగుతున్నారు. చక్కటి ఫవుంటెన్ పెన్నూ, రోల్డ్‌గోల్డ్ రిస్టువాచీ లాటివి ప్రపంచ ప్రజానీకంలో నూటికి తొంభయిమందికి అందుబాటు గాని ఐశ్వర్యాలు. సుష్టుగా విందుభోజనంచేశాక, డైనింగ్ టేబుల్‌వద్దకూచుని, ప్రపంచ పరిస్థితులు సమీక్షిస్తాము - ప్రపంచ ప్రజానీకంలో చాలాభాగం ఆకలి గీతకి అవలపక్క నున్నదనే విషయం మనకి తట్టదు.

నిష్పాక్షికపరిశీలన చేయదలుచుకున్నప్పుడు వాస్తవవిష యాలు శ్రద్ధగా గమనించాలి. ఈ ప్రపంచంలో మనం తుడి

చెయ్యలేనంత వేదనఉంది. మిథ్యావాదులు కానీయండి, వాస్తవికవాదులు కానీయండి - లోకంలోగల విషాదాన్ని కాదనలేరు - అది సుస్పష్టంగా అక్కడ మన కళ్లకి కట్టినట్టు కనిపిస్తోంది. ఈ ప్రపంచంలోగల ఆనందం పరిమితమేమో గాని, విషాదంమట్టుకు అపరిమితం. కష్టపడి పనిచేసే వ్యక్తుల్ని విజయలక్ష్మి (సక్సెస్) వరించి తీరుతుందనే సూత్రంకూడా నిజంకాదు. ప్రజాబాహుళ్యానికిగల విశ్వాసాలలో అదొకటి. కష్టపడి పనిచేసిన వారందరికీ విజయం సిద్ధించదు. 'సక్సెస్'ని పొందగల అదృష్టవంతులు అరుదు. ఈ కారణంవల్లనే ప్రజలకి కామిడీలకంటె ట్రాజడీలు ఎక్కువనచ్చుతాయి కాబోలు! మనలోని విషాదభావాలని చెప్పగలిగేవే మధురగేయాలు - అని ఎవరో కవి అన్నాడుగా!

చెడు అనునది (ఈవిల్) ఈ ప్రపంచంలో ఎందుకు వుండాలని విచారించి లాభంలేదు - అదివుంది, వుంటుంది. కష్టాలనునవి జీవితంలో ఒకభాగంగా ఆమోదిస్తూ, బ్రతకనేర్చుకోవాలి స్త్రీ పురుషులు - అవి తమ నొక్కరినే గాక అందరినీ హింసిస్తున్నాయని గ్రహించాలి. చెడుపూ కష్టాలూ ఎందుకువుండాలని అడిగితే మనకెవరూ సమాధానంచెప్పరు-చెప్పలేరు. వాటిని విజయవంతంగా ఎదుర్కొగలశక్తి మనం అలవరుచుకోవాలి. ప్రతితరమూ కొన్ని కష్టాలని రూపుమాపగలుగుతుంది - వాటిస్థానే సరి కొత్తవి మళ్లీ ఉద్భవిస్తూ వుంటాయి. ఏ బాధలూలేకుండా బతకాలనుకోవడం వెర్రికల.

ప్రపంచంలోని ఈ ఆక్రందనలూ, అన్యాయాలూ, అధర్మాలూ చూచిచూచి విసుగెత్తిన కొందరు మహామహులు, తాము మానవజాతికి అందించగల మహోపదేశంగా కొన్ని మంచి మాటలు చెప్పారు. అదే మన తత్వజ్ఞానసంపద. కష్టాలుపడ్డమీదట ప్రతివ్యక్తికీ లోకంమీద కోపం జనించి, కసిగా మారుతుంది. ఆ కసి మనసులోపెట్టుకు లాభంలేదు- లోకంతో రాజీపడుతూ ఆత్మశాంతిని పొందవలసివస్తుంది. మానసికబాధకి మందులు లేవుగాని, మాటలు కొంతవరకూ ఉపశాంతిని యివ్వగలుగుతాయి. మంచి మాటలనగా ఏమిటో తెలుసుకునేందుకు పెద్దల హితవచనాలు చాలా ఉపకరిస్తాయి.

పెద్దల హితవచనాలనగానే పాతకాలపు నీతులవైపుకి పోయి, వొట్టి మాటలతో కుస్తీపట్టకూడదు. గాయపడ్డ మనిషి వద్దకు వెళ్లి, - 'నీ గాయం నెమ్మదించకపోదులే, నెమ్మదిస్తుంది' - అని అంటే, అతనికి వొళ్ళుమండదూ? మననుంచి అతను కోరేది సానుభూతి గాని యిటువంటి అసందర్భపు సలహా కాదు, ఆమాదిరి చచ్చు మాటలు ఎప్పుడూ చెప్పకూడదు. మన మాటలు అతనికి మనోధైర్యాన్ని యిస్తూ, మన స్తాపాన్ని పోగొట్టేవిగా వుండాలి. మన అనుభవమూ మన వివేకమూ, మూడు ముఖ్య విషయాలని గుర్తించుకోవాలి.

మొదటి విషయం : బాధలు కలకాలం వుండవని తెలుసుకోగలగడం. సుఖాల మధ్య పెరిగిన వ్యక్తికి అపజయాల అర్థం తెలియదు. కష్టాలు మనిషికి మెరుగుపెడతాయి -

ఎక్కడ వున్నామో, మన పరిస్థితి ఏమిటో ప్రతి మనిషీ తెలుసుకోవాలి. మంచి ఆరోగ్యం కలిగి, వ్యాపారంలో విజయం సాధించి, పదిమంది మెప్పు పొందే వ్యక్తి పైకి సుఖంగా కనపడవచ్చుగాని, లోపల సుఖపడుతున్నాడని నమ్మకం ఏమిటి ? అలా అని, నిరంతర కష్టవాహినిలో ఈదులాడ లేరు. మనం పై అడంబరాలు వున్నంత మాత్రాన మానవ హృదయానికి సుఖానుభూతి కలగదు. ఆత్మ విశ్వాసం కొన్నాళ్లయేటప్పటికి ఆత్మగర్వంగా మారుతుంది చాలా మందిలో. ఆత్మగర్వంవల్ల, మనిషి తన చుట్టూ గోడలు కట్టేసుకుంటాడు; అనుభవరూపంగా సాక్షాత్కరించవలసిన జీవన సత్యాలకి అతను దూరమవుతాడు. కష్టపడ్డవారికే జీవిత రహస్యాలు తెలుస్తాయి; వారికే యితరుల కష్టాలు అర్ధమవుతాయి. బాధకీ, ప్రేమకీ సన్నిహిత సంబంధం వుంది. ప్రేమానుభవం చాలా గొప్ప విషయం - అది అందరికీ అవగతమవదు. హృదయమందిరంలో ప్రేమామృతం వుండటం అన్ని సుగుణాలకీ మించిన విషయం - అని అంటారు. ఎన్ని బాధలోపడితేగాని ప్రేమని అవిధంగా నిలబెట్టుకోలేము. బాధలే ప్రేమ బంధాన్ని పెంచుతాయి.

బాధలు పడటంవల్ల మనుషులు కఠినులవుతారను అభిప్రాయం పూర్తి - నిజం కాదు. బాధలు మనిషిలోని అసలు స్వరూపాన్ని బయటికి తీస్తాయి. వ్యక్తి జీవితంలో అపరిమితమైన కష్టానికి గురి అయి, పరిస్థితులకి తలవొగ్గి, నూతన మనశ్శాంతితో ముందుకి సాగిన మహామహులు అనేకులు కనిపిస్తారు మనకి. విషాదమనునది కొందరి జీవితాలలో

ఎక్కువ వుంటుంది, కొందరి జీవితాలలో తక్కువ వుంటుంది. అసలు విషాదమే లేకుండా లోకం ఉండకూడదా అంటే, అది సాధ్యం కాదు. మానవ హృదయంలోని రత్నాలనీ రాళ్లనీ బయటికి తీయగలుగుతున్నది ఈ విషాద చక్రమే. మానవ పురోగమనం చైతన్యంవైపు, మనసువైపు, ఆత్మవైపు సాగుతున్నది - ఈ గమనంలో ఆత్మానుభవభావం (సెన్స్ ఆఫ్ ది సెల్ఫ్-కాన్షస్) ప్రముఖపాత్ర వహిస్తోంది. సత్‌శీలుడైన వ్యక్తి మరకతమాణిక్యాలని మించిన విలువ గలవాడు. సత్‌శీలు రయేందుకు బాధలు పడటం, అపజయాలు పొందటం తప్పనిసరేమో చెప్పలేము.

నిప్పుతో చెలగాటమాడుతూ జీవించే వ్యక్తుల ముఖాల లోని శాంతి కాంతులు, సామాన్య సుఖజీవనులలో కనిపిస్తాయా ? - కనిపించవు. నిప్పుతో చెలగాటమాడే వ్యక్తులుకూడా బాధలుపడటం ఒక ఘనకార్యంగా పేర్కొనరు. దుర్మార్గాన్ని వారు ఎదిరిస్తారు – తత్ప్రయత్నంలో బాధలకి లోనవుతారు. చెడుపును ఎదుర్కొని జయించాలేగాని మరొక మార్గంలేదు. ప్రపంచపు బాధలు తగ్గించాలని అమితంగా కృషిచేసేవారే, బాధలపాలవుతూ వుండటం లోక వైపరీత్యాలలో ఒకటి.

మానవ వేదన తగ్గించడానికి తమశక్తి ధారపోసినవారిలో డాక్టర్ అల్బర్ట్ ష్విట్జర్‌ని మొదట చెప్పాలి. కోటానుకోట్ల ప్రజలకి ఆధునిక యుగం ప్రసాదించిన అద్భుత పరిశోధనల గురించీ, మందుల గురించీ తెలియనే తెలియదు. వైద్య సహాయం అతి స్వల్పంగా లభించే ఆఫ్రికా ఖండం వెళ్ళి,

అక్కడి సోదరుల దేహబాధలూ వేదనలూ తగ్గించేందుకు తన జీవిత మంకితంచేశాడు ఆల్బర్ట్ ష్వైట్జర్. ప్రపంచంలోని బాధలూ వేదనలూ చాలావరకు మానవ నిర్మితాలు. వాటిని పోగొట్టగల అవకాశం వుండికూడా, అందు గురించి శ్రమ పడేవారు అరుదు. పాశ్చాత్య ప్రపంచం చాలా వ్యాధుల్ని రూపుమాప గలిగింది – వెనకటికీ యిప్పటికీ మాతా శిశు సంరక్షణలో ఎంతో మార్పు వచ్చింది. శిశు వైద్య విధానం పెరిగి, సుఖప్రసవం సాధ్యమవడంతో సామాన్య ప్రజలు ఎంతో సుఖపడగలుగుతున్నారు. ఈ వైద్య సంపదకి మనమే గాక ప్రపంచ ప్రజలందరూ వారసులే! అనేకులకి భీతి కలిగిస్తున్న కాన్సర్ వ్యాధిని మనము తొందరలోనే జయించ గలుగుతాము.

ఎవరి హృదయమైతే యితరుల బాధలకి స్పందిస్తుందో, వారే జీవన సౌందర్యమూ జీవన సౌభాగ్యమూ పొందగలుగుతున్నారు. వారే పూర్ణ పురుషులుగా రాణించి, సువిశాల జీవితం అనుభవించ గలుగుతున్నారు. తమకి సంభవించిన యిక్కట్టులకీ, బాధలకీ వాపోయే మనుషులు స్వార్థపరులై లోకాన్ని ఆడిపోసుకుంటున్నారు. 'ఎవరి బాధలు వారికి వుంటాయి, బాధలు లేనివారెవరు' - అను ఆత్మసంతృప్తి అలవరుచుకొని, విశ్వగానంతో తమ కంఠం కలపగలుగుతూ లోక వేదనని తగ్గించాలని తాపత్రయపడేవారు ఉన్నతులూ ఉత్తములూగా భాసిల్లుతున్నారు.

తిరిగి తిరిగి మనం వ్యక్తి స్వభావం దగ్గిరికివస్తూ వుంటాము. వ్యక్తిలోని శీలసంపద గొప్పదైన కొద్దీ, అతను

తన వ్యక్తిగత కష్టనష్టాలని విస్మరించగలుగుతాడు - యితరుల కష్టాలవైపే తనదృష్టిని తిప్పుతాడు. అతని మనోభావం స్వార్ధచింతనతో గాక పరచింతనతో ఉంటుంది కాబట్టి మొత్తంమీద ఒక సామరస్యం ఏర్పడుతుంది. ఇతరుల బాధలపట్ల తన మనసు కేంద్రీకరించడంవల్ల, మొట్టమొదట తనబాధలు మర్చిపోవడం జరుగుతుంది. అవతల వారి బాధలేతనవైనట్టుగా భావన కలుగుతుంది.

పంచుకోవడంవల్ల సంతోషం ద్విగుణీకృతమైనట్టు, పంచుకోవడంవల్ల బాధలు అంతకంతకు చిన్నవవుతాయి. సంతోషానికి మనని ఏకోన్ముఖులుగా చేయగల శక్తిలేదు – కాని, బాధలు మనని ఏకోన్ముఖులుగాచేస్తాయి. తరతరాల ప్రజలు తెలుసుకున్న జీవన రహస్యమిదే!

17 వ శతాబ్దంలో జాన్ డానీ అను ప్రఖ్యాతపురుషుడు వ్రాసిన పలుకు లివి :

"ఏ ఒక్కడూ స్వయం సంపూర్ణుడు కాదు. ద్వీప మెప్పుడూ చుట్టూ సముద్రానికీ, దూరంగావున్న నేలకీ సన్నిహితురాలై ఉంటుంది. అదే విధంగా నేనూ నా స్నేహితులూ మీ స్నేహితులూ కూడా. చర్చిగంటలు ఎవరికోసం మోగుతున్నాయని అడక్కండి - మానవునికోసం."

వందేళ్ళు గడిచాక జాన్ ఫూల్‌మాన్ అను అమెరికన్ వ్యక్తి 1772లో ఈ ప్రకారం వ్రాశాడు :

"రెండున్నర సంవత్సరాలక్రితం నాకు జబ్బుచేసి పక్క మీదపడ్డాను. మృత్యుద్వారపు తలుపులు తెరుచుకున్నాయి. అక్కడికి వెళ్లేటప్పటికి నా పేరేమిటో మర్చిపోయాను. నేనెవరో తెలుసుకోవాలని మహ తంటాలుపడ్డాను. రంగు కగ్గిపోయిన ఒక పదార్థపుముద్దని నేను - దక్షిణంనుంచి తూర్పువైపుగా పడివున్నాను. బహు సంఖ్యాకంగావున్న పదార్థపు ముద్దలలో యిది ఒకటి. నే నెవరు - నేను ఏమీకాదు. నాకు ప్రత్యేకత అంటూ ఏమీలేదు. అన్నిముద్దలలో నే నొక ముద్దని. అప్పుడు నా కొక అమరగానం వినిపించింది. స్వచ్ఛమూ, శ్రావ్యమూ, మృదులమూ అయిన గాన మాధురిగా నా చెవులమీద పడింది ... 'జాన్ వూల్‌మాన్ చనిపోయాడు' అవే ఆ పాటలోని మాటలు...ఆక్షణాన నాకేదో పరమ రహస్యం తెలిసినట్టయింది. వెనకటి జాన్ వూల్‌మాన్ చనిపోయాడు."

**19** వ శతాబ్దంలో వాల్ట్ విట్‌మాన్ 'సాంగ్ అఫ్ మైసెల్ఫ్' అను గేయంలో మానవుల బాధలనీ, మానవులు ఏకోన్ముఖులై వుండవలసిన ఆవశ్యకతనీ చిత్రించాడు :

"ఎవరు మరొకరిని కించపరిచినా నన్ను కించపరిచినట్టే; ఏదిచెప్పినా, ఏదిచేసినా చివరకది నన్ను చేరుకుంటుంది."

ఈ శతాబ్దంలో యుజిని వి. డెబ్స్ ఒక సిద్ధాంతకారణంగా జైలులో ఉంచబడ్డాడు. జైలులో వున్నప్పుడే ఆయన అమెరికా ప్రెసిడెంట్ పదవికి పోటీచేసి, పదిలక్షల వోట్లు సంపా

యించుకున్నాడు. అయన అంటాడు: "జైలు గోడలమధ్య ఒక్క మనిషి వున్నప్పటికీ స్వేచ్ఛ అనునది నాకులేదు."

నాలుగు శతాబ్దులలోని నలుగురు ప్రముఖవ్యక్తులు మానవజీవితం గురించి వారికి అనుభవమైన పరమసత్యాలు, అటువంటి చక్కటి మాటలలో ఎంతో అందంగాచెప్పారు. ఇతరుల బాధలు తగ్గించేందుకు కృషిచేసి, ఆ బాధలలో భాగం పంచుకోవడంకంటె అనందదాయకమైనది మరొకటి లేదు. ప్రపంచంలో యింతటి దుర్దశ, యిన్ని అపదలూ ఎందుకున్నాయో మనకి తెలియదుగాని వాటిని ఎదుర్కొని జయించడంలో సామాన్యులు ఉదాత్తులవుతున్నారనుసంగతి మన అనుభవంలోని విషయం. అపదలకి సంబంధించిన సమస్యని అందరు మనుషులూ ఒకే విధంగా పరిష్కరించ గలరు - పరులకొచ్చిన కష్టం తమదిగా భావించి, వారికష్టాన్ని పంచుకోవడమే పరిష్కారమార్గం. అన్ని అడ్డంకులూఛేదించి మానవత్వం నిలబెట్టేందుకు అదే రాజబాట.

మరొక విషయం మన మిప్పుడు గమనించాలి. దైహికంగా కానీయండి, మానసికంగా కానీయండి ఒక దుర్బలతకి లోనైవున్నవ్యక్తి, మిగతా వారినిచూసి అసూయపడకుండా ఎలా వుండగలడు? కుంటివాళ్లనీ పిక్కబలంగల వాళ్లనీ ఒకే పందెంలో పోటీ చేయమనడం ధర్మమా? గుడ్డివాణ్ణి కూలిపని చేయమనడం న్యాయమా? వంకరమూతి వాడిచేత ఉపన్యాసం యిప్పిస్తే ప్రేక్షకులు నవ్వరూ?

ఈ ప్రశ్నలన్నిటికీ ఒక అతిపురాతనమైన జవాబువుంది. మనము ఏ విధంగా సృష్టింపబడవలసివుందో ఆ విధంగా సృష్టింపబడుతాము – అందులో మన జోక్యంలేదు. ఎటొచ్చీ, మన ప్రవర్తనకి మాత్రం మనం జవాబుదారీ వహించవలసి వుంటుంది. మనశక్తిలో లేని వాటిగురించి వాపోవడంగానీ, వాదించడంగానీ నిరర్థకం. మనకి ప్రసాదింపబడ్డ శక్తులని మనం ఏ విధంగా వినియోగిస్తున్నామనేదే మన సమస్య. ఆ పవిత్రభారంపట్ల మనం జాగరూకులమైవుంటూ, మన జీవితాన్ని శోభాయమానంగా చేసుకోగలగాలి.

ఈ నాగరిక ప్రపంచంలో నీగ్రోజన్మ ఎత్తినవాడికి కొన్ని యిబ్బందులువున్నాయి. తను తెల్లవాడినై పుట్టలేదే - అని విచారించడంవల్ల కలిసివచ్చేదేమీలేదు. రంగుభేదంవల్ల ఏర్పడే అవరోధాలని నేర్పుతో జయించుకుంటూ రావాలి. అదే విధంగా అంధుడు తనకి కనిపించని ప్రపంచంగురించి శోకించడంకంటె, దృగ్గోచరం కాని అందాలతో తృప్తిపడాలి. సామాన్యనేత్రాలకి కనపడని అద్భుతసౌందర్యాలు అంధులకి కనిపిస్తాయట. బక్కచిక్కిన రోగిష్టి మనుషులకే కొన్ని ప్రామాణికసత్యాలు అవగతమయాయి - సంతృప్తజీవనులకి ఆ సత్యాలు సాక్షాత్కారమవలేదు.

జ్ఞానేంద్రియాలలో ఒకటి నశిస్తే దాని తాలూకుశక్తి మరొక విధంగా ప్రజ్వలిస్తుందనే నమ్మకం అబద్ధం ఎంత మాత్రంకాదు - అది సూత్రన్యాయం. పక్కమీద పడుండి, అస్వస్థురాలుగావున్న స్త్రీ, దైనందిన జీవనభారంలో మునిగి

తేలే భర్తకంటె ఎక్కువ పుస్తకాలు చదవగలుగుతుంది. చదివేందుకు ఆమెకి టైము మిగులుతుందికద! ఊకదంపు కబుర్లలో పాల్గొనవలసిన అవసరంవుండదు కాబట్టి, మూగ వారు ఏకాగ్రతని అలవరుకోగలుగుతారు.

ప్రతిజీవితమూ కొన్ని పరిమితులకి లోనైవుంటుంది. మనలోగల అన్నిశక్తులూ ఏకకాలమందు పెంపొందించుకునేందుకు సావకాశంవుండదు. అంచేత, కొన్నిశక్తులే పెంచుకు కొన్నిటిని విస్మరించవలసివస్తుంది. మూకబధిరాంధులు, దుర్బలులూ, వికలాంగులూ మొదలైన వారి విషయంలో ఈ నిర్ణయాన్ని ప్రకృతిచేస్తుంది.

జీవితంలో గల అన్ని శత్రుత్వాలమాట అటుంచి, మరొక ముఖ్యమైన అపదఉంది. ఆ అపద వీటన్నిటినీ మించినది - అది తిరుగులేనిది. ఈ స్త్రీ పురుషులందరికీ 'మరణం' అంటూ ఒకటిఉంది. ఏవి నిజాలైనా, యేవి నిజాలుకాకపోయినా మానవులకి మరణం తథ్యం. అందరూ చనిపోక తప్పదు. దీనిగురించి మనం ఆలోచించముగాని మానవుని అంతరాంతరంలో యిది ఎప్పుడూ వుంటుంది. మనం మన సమకాలికులకంటె మరికొన్ని సంవత్సరాలు ఎక్కువ బతకవచ్చు - అంతకంటే యేమీలేదు. ఒక వందేళ్లలోపున ఈ పుస్తకం చదువుతున్న వారిలో యే ఒక్కరూ మిగలరు.

మరణం గురించి భయపడదగ్గది ఏమీలేదుగాని ఆ ఆలోచన మనని అప్రమత్తులుగా చేస్తుంది. మనం చనిపోవాలి - చనిపోక తప్పదు. ఎందుకు చనిపోవాలని ప్రశ్నించడం అర్ధ

రహితం. చనిపోయే మనుషులు వుండని ప్రపంచంకంటె, చావు అందరినీ సమధర్మంతో చూడటం ఎంత హాయో ఒక్క క్షణం ఆలోచించండి. చావు అనేదే లేకపోతే, ఈ ప్రజలందరికీ ఈ నేలమీద స్తలం వుండొద్దూ ? జనన మరణాల మధ్యనున్నదే జీవితము - మరణం లేనప్పుడు జననమూ లేదు. మరణం ఎంతమాత్రమూ బాధావహమైన విషయం కాదు. బాధనుంచీ, వ్యాధినుంచీ, ఒంటరితనంనుంచీ తమని రక్షించమని ప్రతి సంవత్సరం ఎన్నివేలమంది ప్రజలు మృత్యుదేవతని ప్రార్థిస్తారో చాలా మందికి తెలియదు. మృత్యువుని రెండుచేతులా ఆహ్వానించేవారు వేలాదివేలు ఉన్నారు. జీవిత మొక సెన్సిటివ్ బాలెన్స్. ప్రతిదీ అతి జాగ్రత్తగా తూచడం నేర్చుకోవాలి.

మరణమనునది చిన్నపిల్లలకి భయాందోళనా హేతువు కావచ్చు - ఎంచేతననగా, భవిష్యత్తంతా వారికి అయోమయంగా కనిపిస్తుంది. యేళ్ళు గడవటంతో తాత్విక దృష్టి దానంతటదే బుర్రలోకి చొరబడుతుంది. ప్రాజ్ఞత అబ్బిన వ్యక్తులు తమ మరణం గురించి ఎంతమాత్రం బాధపడరు - తమని నమ్ముకున్నవారి గురించి ఆలోచిస్తారు. పోగా, ఈ ప్రపంచానికి తాము వున్నా ఒకటే, లేకపోయినా ఒకటే అను విషయం వారికి యేనాడో తడుతుంది. అందుకని అవసరమొచ్చినపుడు వారు ఆదర్శానికి అర్పితమైపోతారు.

ఈ సత్యాలు తెలుసుకున్నంత మాత్రాన సన్నిహితుల మరణం మనని దుఃఖవారధిలో ముంచకపోదు. ప్లాటో తన

మరణం గురించి బాధపడలేదు - కాని సోక్రటీస్ మృతికి ఎంతగానో విచారించాడు. సోక్రటీస్ భౌతిక కాయం నేల కలిసిందిగాని అతని భావామృతం యేమయింది? దానిని మనందరం ఈనాటికూడా పంచుకుంటున్నాముగా. ఈ ప్రపంచపు రీతినీతులు గమనించిన చాలామందికి అమ రత్వంమీద నమ్మకం ఉండదు: కాని కొందరిలోని ప్రతిభ, ఎందుకనో వారిని అటువైపుగా తరుముతుంది.

మానవుడే అశాశ్వతం అయినప్పుడు, అతనికోసమని చెప్ప బడే తాత్విక చింతలో శాశ్వతగుణం యేపాటి ఉంటుంది? ఆత్మీయులు మరణించినప్పుడు అన్ని తత్వాలూ నిరుప యోగం. వృద్ధాప్యంలో వున్నవారు చనిపోతే ఫరవాలేదుగాని, వయసులో వుండి వృద్ధిలోకి రాదగ్గవారు మరణిస్తే, ఆ శోకం భరింపరానిది. ఆ వేదన కొందరు కొందరిని జీవితాంతంవరకూ తరుముతుంది.

ఎవరి మరణం గురించివారు అంతగా బాధపడరు. అదే విధంగా వయోవృద్ధులు చనిపోయినా, పెద్దతనంలో వున్న తలితండ్రులు చనిపోయినా, జాతస్యః మరణం ధృవమ్ అని సరిపెట్టుకుంటారు. అదే చిన్నవాళ్లు చనిపోతే, కడుపు తరుక్కు పోయినట్టవుతుంది. పుట్టు మొగ్గని కాలపురుషుడు తుంచే శాడే అని బాధకలుగుతుంది. గంట క్రితందాకా యింట్లో తిరిగి, ఆడుతూ పాడుతూ బడికివెళ్ళిన ఏకైక తనయుడు, కారు ప్రమాదంలో పిప్పిపిప్పి అయితే ఎలా ఉంటుంది? ఇరవైయేళ్ల కొడుకు యుద్ధభూమి చేరుకున్న నాలుగు రోజు లకి, వొళ్లంతా తుపాకీ గుళ్లతో మరణిస్తే ఎలా ఉంటుంది?

పది హేడేళ్ల కూతురు ఏదో తీవ్రవ్యాధికి గురిఅయి, తమ కళ్ల ముందు చనిపోతూవుంటే, కనిపెంచిన తలిదండ్రులకి ఎలా ఉంటుంది ? ఏడాది కాపరంచేసి ప్రాణంలో ప్రాణంలా మసిలిన భార్య, శిశువుని ప్రసవిస్తూ చనిపోతే, ఆ భర్తకి ఎలా ఉంటుంది? వీరి నష్టాలు సామాన్య నష్టాలు కావు - ఎటువంటి హితవచనాలూ వారికి ఉపశాంతిని యివ్వలేవు.

అటువంటి ఆపదలు సంభవించినవారి సమక్షానవున్న వ్యక్తులకే వారి బాధ తెలుస్తుంది. ఆ దురదృష్టవంతుల బాధ మాటలలో యిమడదు – వర్ణనాతీతం. లెక్చరు తయారు చేసుకుంటున్న ప్రొఫెసరువద్దకు వచ్చి ఒక విద్యార్థి అంటాడు: "నిన్న రాత్రి ఒక విమానం కూలిపోయిన మాట మీకు తెలుసుకదూ! దాని పైలట్ మా నాన్న!!" - ప్రొఫెసరు యేంచెప్పాలి అప్పుడు? మాటలు స్ఫురణకి వస్తాయా ?

ఆప్తులని పోగొట్టుకోవడంవల్ల కలిగే గాయాలు ఒక పక్షాన మానవు. అవి జీవితాంతం మనవెంటనంటు వుంటాయి. ఎటొచ్చీ, మనం చేయగలదేమిటంటే, వివేక ధర్మాన్ని (విజ్ఞం) శరణుజొచ్చి, ముందుకి సాగడమే. మానవ చరిత్ర ప్రారంభంనుంచీ ఆలోచిస్తే, మనం పొందిన కష్టాలవంటివి పొందినవారు, అనేకులు వుండివుంటారు. వారి హితోపదేశం పూతగా తీసుకు, స్థిమితపడటమే మనము చేయగల పని.

మన వస్తువు యేదైనా మన చేయి జారిపోగానే, వున్న వాటిని చూసుకు తృప్తిపడటం నేర్చుకోవాలి. ఇప్పుడొచ్చిన

అపద, పాతవాటిని మార్చలేదు. కొన్ని సందర్భాలలో కాల పరిమితి ప్రధానం కాదు. కొందరి నూరు సంవత్స రాల జీవితంకంటే కొందరి యిరవై సంవత్సరాల జీవితం గొప్పగా రాణిస్తుంది - అదే ఎక్కువ విలువైనదని ఋజు వవుతుంది. ఉదాహరణకి జాన్ గంథర్ కుమారుని విషయం తీసుకుందాం - ఆ అబ్బాయి పెద్దవాడవకపూర్వమే చనిపోయాడు; కాని అతని కారణంగా, అతనికోసమని జాన్ గంథర్ సాటిలేని గ్రంథాలు రచించాడు. 'ఎంతకాలం బతికాడనిగాక, ఎంత ఉదాత్తత, ఎంత ఘనత ఆ జీవితం నుంచి వెలువడ్డాయి?' అనునవే ముఖ్యాంశాలు.

మనలని వొదిలి వెళ్లిపోయినవారిని మనసులో పెట్టుకొని, వారి జ్ఞాపకార్థంగా మన జీవితాలు గడపడం చాలా గొప్ప విషయం. అది అందరికీ సాధ్యంగాకపోవచ్చు. కాని, ఆ ప్రకారం జీవించినవారి జీవితాలు ఎంతో పరిమళభరితంగా మనకగుపడతాయి. స్వీయబాధలూ, స్వీయ సంతాపాలూ మర్చిపోయి, పది మందికీ ఉపయోగపడగల కృషి నిర్వహ ణగా ఆవేదనాభారాన్ని మార్చుకోకలిగిన వ్యక్తులు మానవా ళికి మేలు సమకూరుస్తున్నారు. ఫిలడల్ఫియాలోని ఒక స్త్రీ, మెడికల్ కాలేజిలో చదువుతున్న తన కుమారుడు చనిపో వడంతో, తమ యింటిని వైద్య విద్యార్థులకి యిచ్చింది - కాలక్రమేణా వైద్య విజ్ఞానానికి అదొక పెద్ద కేంద్రం అయింది. చనిపోయిన కొడుకు సంతోషంకోసం చేసిన పని, తోటిప్రజల బాధా నిర్మూలనానికి సహాయకారి అయింది.

వేదనని, కార్యోత్సాహకారకంగా మార్చుకున్నవారిలో జాన్ బ్రయిట్‌ని మొదట చెప్పాలి. యువకుడైన బ్రయిట్

భార్య చనిపోయింది - అతని సంతాపం భరింపరానిదిగా వుంది. రిచర్డ్ కాబ్డెన్ అతనివద్దకు వచ్చి, 'నీ వ్యక్తిగత దుఃఖం అటుంచి, ఈ ప్రజలదీనావస్త చూడు - తిండిలేక వారు మలమలమాడుతున్నారు. కారన్ లాస్ రద్దు అయేందుకు నీ శక్తి ధారపొయ్యి" అని అంటాడు. బ్రయిట్‌కి తన విధ్యుక్త ధర్మం బోధపడినట్టయింది. ఆనాటినుంచి కారన్ లాస్ రద్దయేదాకా అతను నిద్రపోలేదు. ఒంటివాడు, తన సర్వశక్తులతోటీ ప్రభుత్వాన్ని ఎదిరించి, ప్రజలకోసం పోరాడాడు. చనిపోయిన భార్యని బ్రయిట్, తక్కువ ప్రేమించాడనా? – ఎంతమాత్రం కాదు. తన స్వంత నష్టం ప్రజా క్షేమంగా మార్చి, తన భార్య స్మృతిని మరింతగా గౌరవించాడు.

రూఫస్ జోన్స్‌కి ఒక్కడే కొడుకు. అతని పేరు లవెల్. పదకొండో యేట చనిపోయాడు ఆ కుర్రవాడు. కాని, రూఫస్ జోన్స్ జీవితశేషమైన 45 సంవత్సరాలలోనూ అతనిముద్ర కనిపిస్తూనేవుంది, తను తనకోసమేగాక కొడుకుకోసం కూడా జీవించాలనుకునేవాడు ఆ తండ్రి. లవెల్ చనిపోయి నలభై సంవత్సరాలయాక కూడా తండ్రిరాస్తాడు ఆ కొడుకు గురించిః "పిల్లలు అందరూ ఆడుకుంటూండగా, పక్కచాటుగా విన్నాను నే నీమాటలు. పెద్దయాక తాము యేమేమిచేసేదీ వరస వరసగా చెబుతున్నారు వాళ్ళు. మావాడి వంతు వచ్చిందిః 'నేను పెద్దయాక మానాన్న మాదిరి మనిషిని అవుతాను' - అన్నాడు లవెల్. ఇప్పటికీ ఆ మాటలు నా చెవులలో గింగురుమంటున్నాయి. ఆ ఒక్క వాక్యమూ నా జీవి

తానికి మంత్రోచ్ఛారణ అయింది. నేను ఏటువంటి మనిషి నవాలని వాడు అనుకున్నాడో? వాడు అనుకున్నవిధంగా నేను రూపొందుతున్నానా ?”

రూఫస్‌జోన్స్ గురించి తెలిసినవారికి, అతని పదకొండేళ్ల కొడుకు మరణం వృథాకాలేదనిపిస్తుంది. ఆ కుర్రవాడు మామూలుగా బతికివున్న పక్షంలో, తండ్రిలో ఆ నిశ్చలదీక్ష ఉండేదా అంటే, చెప్పలేము. ఏమైనా, ఆ తండ్రి తన హృదయా వేదనని ఎప్పటికప్పుడు జయిస్తూ, లోకోపకారం చేయగలిగాడు.

వ్యక్తిగత దుఃఖా లెప్పుడూ యితరులు పంచుకోవడంవల్ల తగ్గి, కొన్ని సందర్భాలలో ఔన్నత్యకారకములవుతాయి. మన స్నేహితులెవరికైనా ఆపద సంభవించిందంటే - 'మేము మీపక్కనే వున్నాం' - అని వారికి ధైర్యం చెబుతూ, వారి కష్టాన్ని పంచుకోబోతాము. ఆ చెప్పేవి పొడిమాటలుగాక, మనఃపూర్వకంగా చెప్పడం నేర్చుకోవాలి. కష్టంలోవున్న వ్యక్తి, తనకష్టం ఎంత బాధావహమైనదో యితరులు చెప్పగా వినాలనుకుంటాడు - అది మానవ సహజం.

భార్యో, పిల్లవాడో పోయినప్పుడు మనమా విషయం అవతల మనిషి మొహంమీద పరామర్శ చేయడానికి సంశయిస్తాము. ఆ పుండు రేపడంవల్ల మరింతబాధ కలుగుతుందేమోనని మనము తటపటాయిస్తాం. కాని, ఆసంగతి మనం పైకి అనకపోవడంవల్లనే అవతలవారికి ఖేదం కలుగుతుంది.

గాయపడ్డవారికి తమ గాయం గురించి మాట్లాడటమే శమనగా ఉంటుంది. భార్యా వియోగి తన భార్య సుగుణాలని పరుల నోటివెంట పదేపదే విని, ఆ విషాదంలోనే ఆనందం పొందు తాడు. ప్రతి ఒక్కరూ ఆమెని మెచ్చుకున్నకొద్దీ, తన బాధ నిజమైనదనీ మిథ్యకాదనీ భావిస్తాడు. అది స్వభావ నైజం. కాలమే అన్ని గాయాలనూ మాన్పగలదు - అనే సూక్తి పూర్తిగా నిజంకాదు. గాయాలు పోగొట్టేది కాలంకాదు - పంచుకోవడంవల్ల గాయాలు మానుపడ్తాయి.

మనం యింతవరకూ ఈ పుస్తకంలో కొన్ని విషయాలు చెప్పుకున్నాము. ఇవి కొందరికి కొంతవరకూ ఉపయోగపడ వచ్చు. మానవ వివేకమంతా సూక్ష్మీకరించి చెప్పినట్టుగా ఎంతమాత్రం భావించవద్దు. జీవితం కొన్నివేళల సుందరంగా కనిపిస్తూ, మరికొన్నివేళల విషాదచ్ఛాయలతో అలుముకొని వుంటుంది. అందుకు కారణం చెప్పలేము - అది బుద్ధికి అందని విషయం. ఈ ప్రకరణలో చెప్పుకున్న వివేకధర్మం, చీకటిలో బాటసారికి కొంచెం చేయూతనివ్వగలదు.

---

# 10

# మార్గం

అయినప్పటికీ నేను మీకు ఉన్నత పథం చూపుతున్నాను

– సెయింట్ పాల్

గత ప్రకరణలలో చూపిన పాశ్చాత్యలోకపు నైతిక కట్టడం మూలాధారములు లేనిదని భావించవద్దు. వర్గ విభజనలకూ, దేశపుటెల్లలకూ అతీతమైన ఒక మూలవిశ్వాసం ఆ కట్టడానికి పునాదిగా వుంది. ఆ మూల విశ్వాసమే మన జీవితాలలోని అమృత బిందువు - అదే మన భావుకతకి జీవం పోస్తోంది. మన జీవన ధర్మంగానీ, మన జీవనోద్దేశంగానీ చెప్పదలుచుకున్నప్పుడు 'మతం' అను మాట వాడక తప్పదు; ఆమాట వినపడగానే చాలామంది ముడుచుకు ఒ తాయి.

అందుకు కారణాలు పరిశీలిద్దాము. ఒకటి: ఏ మత విశ్వాసం మన నైతిక నిర్మాణానికి పునాది అయిందో, అది ఈనాడు నిరుపయోగంగా కనపడుతోంది - ఎంచేతననగా, మానవులు సంస్కృతీపరులయారు; నేటి సంస్కృతి ఆ ప్రారంభ విశ్వాసాన్ని అధిగమించినదని చాలామంది అభిప్రాయం. రెండు: మత విశ్వాసంగల వ్యక్తులు ఎన్నో పేచీలతో వారిలో వారు కలహిస్తారు; తమ విశ్వాసమే నిజవిశ్వాసమనీ, అవతలవారిది తప్పుడు విశ్వాసమనీ అనవసరంగా ఖండిస్తారు.

ఈ పుస్తకంలో యింతవరకూ మత సంబంధమైన పలుకులూ, ఫిలాసఫీకి సంబంధించిన పదజాలమూ ఉద్దేశపూర్వ

కంగా వొదిలివేయబడ్డాయి. సామాన్య పాఠకుని ఆ పెద్ద మాటలతో వుక్కిరి బిక్కిరి చేయకుండా, ప్రపంచ స్థితిగతు లూ లోకపుతీరూ చెప్పాలని మా తలంపు. నేటి కాలంలో లక్షలాది ప్రజలు మతసంబంధమైన పుస్తకాన్ని పొరబాటున కూడా ముట్టరు. మత విషయం అనగానే చటుక్కున వొది లేస్తారు. మానవుని బాధకి వారి హృదయం ద్రవిస్తుంది - ఆ బాధ పోగొట్టేందుకు తమ చేతనైన కృషి చేద్దామని సంసిద్ధు లవుతారు. అంతేగాని, మతమను పేరు వినపడగానే వారు దూరంగా తప్పుకుంటారు.

ఆ విషయం అలా వుంచుదాం. మనం ఫ్రీ వరల్డ్ అని చెప్పుకునే చోటవున్న ప్రజల జీవనాదర్శంలోని ముఖ్య విశ్వా సాలు గమనిద్దాం. ఈ భావసంపదలో కొంతభాగం పురాతన గ్రీసునుంచి, మరికొంత భాగం పాలెస్టయిన్‌నుంచీ మనకు సంక్రమించింది. భగవంతుడు ప్రజలందరినీ తన ప్రతి రూపాలుగా సృష్టించాడను హెబ్రూ నమ్మకంనుంచి, ప్రజా స్వామిక ఆదర్శం (డెమాక్రటిక్ ఐడియల్) రూపొందింది. ఈ నమ్మకం ఏసుక్రీస్తు జీవితంలో పుష్పగుచ్ఛంలా పరిమళించి, ప్రేమ సందేశంగా మారింది. భగవంతుని దృష్టిలో మానవు లందరూ ఒకటే - ఆయనకు తరతమ భేదాలు లేవు. జాతి భేదాలతో నిమిత్తంలేకుండా అతనికి మానవుడు ఏ జాతి వాడైనా, అతను విజ్ఞాననిధి అయినా సామాన్యమానవుడైనా, సిరిసంపదలతో తలతూగే మహరాజైనా ఆ పూటకి అడుక్కు తినే కటికదరిద్రుడైనా భగవంతునికి ప్రియతముడే. భగ వంతుడు విశ్వకారుణ్యమూర్తి. మనుష్యులందరూ సరిసమా

నులనే ప్రజాస్వామిక భావాంకురము ఏసుక్రీస్తుతో జన్మిం చింది. అది భావాంకురం మాత్రమే - ఆ అభిప్రాయం యుగ ధర్మంగా రూపొందేందుకు అనేక విప్లవపరిణామాలకిలోను కావలసివచ్చింది. సర్వసమానత, మానవుని వ్యక్తి గౌరవం మొదలైనవన్నీ ఆ ప్రథమదర్శన (జెనెసిస్ రివిలేషన్) ఫలి తాలేగాని కొత్తగా పుదయించినవేమీ కాదు.

పాశ్చాత్యప్రపంచపు జీవనాడిగా మసలిన విశ్వాస మీనాడు అర్థరహితమైనదిగా భావింపబడుతోంది. ఏ విశ్వాసపునీడలో మానవులు తమ ప్రవర్తనను దిద్దుకొని, కళలకీ సైన్సుకీ యితరవిద్యలకీ దోహదమిచ్చారో, ఆ విశ్వాస మీ నాడు నశి స్తోంది. ఇనపతెరకి యిరుపక్కలనున్నవారూ ఈ విషయంలో ఒకేవైఖరి అవలంబిస్తున్నారు. రష్యాలోని పాలకులకీ బుద్ధి జీవులకీ (ఇన్‌టెలెక్చుయల్స్) మత విశ్వాసంమీద అసలు నమ్మకమేలేదు - వారిమతం మరొకవిధంగా రూపొందుతోంది. అక్కడి పాలకులకి ఈ నాడు చర్చితో పేచీ పెట్టుకోవలసిన పనిలేదు - ఎంచేత ననగా, భావిపౌరులైన యువతీయువ కులు అటువైపు వెళ్లనేవెళ్లరు. పోగా, వయసుచెల్లిన వారి సంగతి – వారేదో మనశ్శాంతి కని చర్చికివెళ్తారు. ఆ తరం వారితో చర్చి అవసరం తీరిపోతుందని పాలకులకి తెలుసు.

ఇనపతెరకి యివతల పక్కనున్న మనమూ ఒకరకంగా నాస్తికులమే (ఎతిస్ట్స్). నిరీశ్వరవాదులమని పైకి చెప్పు కోవడం మర్యాదగాఉండదు. భగవంతుడనే వాడు ఒకడు ఎక్కడో దూరంగావున్నాడనీ, అతని విషయంలో మనం నెర

వేర్చవలసిన బాధ్యతలేమీ లేవనీ ఈ కాలపు బుద్ధిమంతుల నమ్మకం. దేవుని ఎవరికి వారు ప్రార్థించుకోవచ్చునీ (ఇన్‌డివిడ్యుయల్ రెలిజియన్), అంచేత చర్చి అవసరం ఈ నాడులేదనీ చాలామంది అభిప్రాయం. ఈ దృక్పథం ఒక విధంగా మతసహనాన్ని ప్రోత్సహిస్తుంది; మతసహనాన్ని ప్రోత్సహిస్తూ, అన్నిమతాలూ గొప్పవేననీ ఒకదాని కొకటి తీసిపోవనీచెబుతుంది. మతైక దృష్టివుండటం మంచిదికాదనీ మతసంబంధమైన ఆలోచనలకి యింక అస్కారంలేదనీ పెక్కుమంది మేధావులు అంటారు. ఎందుకు ఆస్కారంలేదో వివరించి చెప్పరు.

ఇనపతెరకి యిరుపక్కలా మతరాహిత్యంఉంది - అది కాదనలేము. ఎటొచ్చీ, గత తార్కికభౌతికవాదులకంటె (డయలెక్టికల్ మెటీరిలిస్ట్స్) పడమటి దేశాలవారు (వెస్ట్) కొంచెం తడుముకుంటున్నారు. ఇది నీతి, అది అవినీతి అని నైతికసంప్రదాయం గురించి హెచ్చరించే మనుష్యులు మనలో యింకా కొందరువున్నారు. ఏ తల్లి వేరునుంచి ఈ మహావృక్షం పుట్టుకొచ్చి పళ్లూ ఫలాలూ సమర్పిస్తున్నదో, ఆ వేళ్లసంగతి కొందరు మర్చి పోలేకుండావున్నారు ఆ వేళ్లే మన నైతికధర్మం. వేళ్లనుంచి విడగొట్టబడిన చెట్టు బ్రతుకుతుందా?

పాశ్చాత్య ప్రపంచంలోని దుర్భరపరిస్థితులు చూస్తున్న స్త్రీ పురుషులు, మంచో చెడ్డో అజ్ఞానబంధురమైనా ఆ మత విశ్వాసమే శాంతికారకంగా ఉన్నదను మన స్థితివైపుకి మళ్లుతున్నారు. తమని సుఖపెట్టేందుకే ఈ విధ్వంసక కాండ అని

చెప్పే నాయకులమీద నమ్మకం తగ్గిపోతోంది సామాన్య ప్రజకి మానవునికి ఈ నాడొగ ముఖ్యలక్ష్యం కావాలి. ఆ లక్ష్యంపట్ల విశ్వాసం ఏర్పడాలి. ప్రయోజనమొక్కటే ఆ లక్ష్యధర్మంగా ఉండకూడదు. నైతికాదర్శానికి ప్రాణవాయువు వలె ఉండాలి ఆ లక్ష్యం.

ఆ లక్ష్యం మాటలకందని మహోన్నతపథంలా వుండ కూడదు - సందర్భోచితంగా, ఆచరణయోగ్యంగా ఉండాలి. మనని విడదీసేశక్తులకంటె, మనని దగ్గిరకితీసుకొచ్చి సామ రస్యం సమకూర్చేశక్తులు ఉదాత్తమైనవిగా నైతికవాదులు భావిస్తారు. రాజకీయక్షేత్రంలో కానీయండి, మతక్షేత్రంలో కానీయండి, సామరస్యం సమకూర్చేవే ఉత్తమశక్తులనునది మన అనుభవంలోని విషయం.

సన్నిహితులు చనిపోయినప్పుడు సన్నిహితుల ఆత్మతృప్తి కోసమనుకుంటూ చేసేపని, అద్భుతపరిణామాలు తీసుకు రాగలదని గత ప్రకరణలో అనుకున్నాం. ఒక లక్ష్యానికికట్టు బడివుండటం, నైతికంగానూ మానసికంగానూ ఎన్నోవిధాల మంచిది. కాని, ఏ లక్ష్యమూ ఎటువంటి లక్ష్యమూ - అను ప్రశ్న ఉదయించవచ్చు. ఏ లక్ష్యమూ లేనప్పుడు ఈ మానవ జీవితం, మధ్యలో ఆగిపోయినపాటలా, మనని బాధపెడు తుంది. అదొక విషాదగీతంలా తయారవుతుంది. మనం నమ్మిన లక్ష్యానికి జీవితం అర్పితంచేయడమే ఉత్తమధర్మం.

కొందరికి భగవంతుడిమీద నమ్మకంఉండదు - వారు నాస్తికులైనప్పటికీ చాలా మంచివాళ్లు అయివుంటారు. వ్యక్తి

లోని సత్‌శీలత అతనిని నాస్తికునిగా మార్చేందుకు కారణమవుతుం దప్పుడప్పుడు. తగు తార్కాణంలేనిదే అతను ఏ విషయాన్నీ ఆమోదించడు. తన నిజాయితీని నిలబెట్టుకునేందుకు సాధ్యమైనంతవరకూ యేదీ నమ్మకుండావుండటం మంచి దనిపిస్తుందతనికి. ఏమైనా అబద్ధాలకోరైన ఆస్తికుని కంటె, నిజాయితీగల నాస్తికుడు లోకానికి ఎక్కువ మేలు చేస్తున్నాడు.

తమ మార్గమేదో తెలుసుకుందామని కృషిచేసే స్త్రీ పురుషులు తమది యేకాంతపథం ('యెలోన్') అని విచారం పొందరు. మన ప్రార్థనలకి ఫలితం కనపడకపోవచ్చు - కాని, ఎవరూ వినడంనేదని అనుకోవడం పొరబాటు. భౌతిక ధర్మాలన్నిటికీ అతీతమైనది నైతికధర్మం. ఈ భూమి సౌరమండలంలో ఒకభాగం కావచ్చు; అనేక సౌరమండలాలు అనేకానేకతారకలూ మహావిశ్వంలో ఉండవచ్చు; ఈ పృథ్వీస్థలినుంచి ప్రాణికోటి నిష్క్రమించవచ్చు; 'సత్'కి అర్థం కనపడక, 'చిత్' మాయమవవచ్చు; కాని, కాని...

మన చిన్న జీవితంలోని మనదైనందిన కృత్యాలు అతి ముఖ్యం, ఆ చిన్నచిన్నపనులు నేర్పుగా చక్కగా మనకీ మన తోటివారికీ బాధకలగని విధముగా చేయగలగాలి.' అనినమాట నిలబెట్టుకుంటే నిజాయితీపరుణ్ణి - లేకపోతే అబద్ధాలకోరుని. నా మాట నేను నిలబెట్టుకోలేకపోతే నాకే చిన్నతనం. మాట నిలబెట్టుకోలేకపోయాడని అనిపించుకోవడం విచారకరంగా ఉంటుంది. మనవి సాధారణంగా

నీరసస్వభావాలు - ఆ నీరసగుణాన్ని జయించేందుకే తరుచూ ప్రయత్నిస్తాము. సమస్తమూ మిథ్య అనేవారుకూడా తమని తాము మిథ్యగా భావించరు కద! అదే నైతికధర్మానికి పునాది.

కొందరు దేవుణ్ణి నమ్ముతారు - కొందరు నమ్మరు; కాని, ఆలోచనాపరులైన వ్యక్తులందరూ 'దేవుని ఉనికి' గుర్తిస్తారు. దేవుడున్నాడంటే ఎంత ధైర్యం! "ఈ ప్రపంచంలో మనం ఏకాకులుగా బ్రతకడంలేదు; మనని కాపాడే శక్తి ఒకటి ఉంది; ఈ భూమండలంలోని ప్రాణవాయువు అయిపోవడంతోగానీ, సౌరమండలం చల్లారిపోవడంతోగానీ కథ పూర్తి అవదు; ఇంకా చాలా ఉంది" అని అనుకోవడం మనసుకి ఎంతటి ధైర్యాన్ని యిస్తుందో ఆలోచించండి. సాక్షీ భూతం కాదగు నిదర్శనం దొరకలేదని కొందరు దేవుడిమీద నమ్మకం వుంచరు - వారు లోపల్లోపల మథనపడుతూనే వుంటారు. దేవుడు లేడను నిశ్చయంగలవారికి అన్నీ లభిస్తాయిగాని నిజమైన ఆనందం లభించదు.

ఇది హేతుబద్ధమైన ప్రపంచం - యిందులో మానవుడు ఎంతమాత్రం ఏకాకివంటివాడుకాదు. కార్యకారణ సిద్ధాంతానికి కట్టుబడ్డ ఈ లోకంలో ప్రతిదీ క్రమానుగుణం. కారణం లేనిదే కార్యము జరుగదు. 'నదులు తమ జన్మస్థలానికి మించిన ఎత్తు ఎక్కలేవు' - అన్నారు గ్రీకులు; శూన్యతనుంచి ఏమీ ఉద్భవించదు - అన్నారు వారు. ఈ ప్రపంచం జీవితాన్నీ (లైఫ్), మనసునీ (మైన్డ్), ఆత్మనీ (స్పిరిట్) సృష్టించింది. కనుక, ఒక మహత్తరశక్తి ఉండితీరాలి.

ఇదంతా ఎలా సంభవించిందో మనం తెలుసుకోగలమా? ఇది క్రమానుగత ప్రపంచమైనప్పుడు, 'మనసు'కి (మైన్డ్) పూర్వమే ఈ ప్రపంచం వుండివుండాలి; ఎలాగనగా, క్రమానుగతమైనప్పుడు ('మైండ్' - మనసు) అందులో ఒక భాగమవుతుందేగాని దానికి ప్రత్యేకత ఉండదు. కొన్ని పరమాణువుల స్వరూప ధర్మంవల్ల కోటానుకోట్ల సామాన్యవ్యక్తులూ కొందరు మహాపురుషులూ జన్మించడం జరిగిందా? ఆ ధర్మ ప్రకారమే సృష్టిరథం సాగుతున్నదా? ఈ కోటానుకోట్ల ప్రజలు విధివశవర్తనులేనా?

పరమాణువుల ప్రపంచం ఈజీవితాన్నీ, మనసునీ, ఆత్మనీ (లైఫ్, మైండ్ అండ్ స్పిరిట్) సృష్టించిందను విషయం ఏదో ఆశ్చర్యకరంగా ఉంటుంది. అంతకంటె, యిదంతా భగవంతుని సృష్టి, అని భావించడం మనసుకి తెరిపి. ఇదంతా దేవుని మహిమ అనగానే, ప్రతిదీ ఎక్కడికక్కడ సరిగ్గా అతుక్కుపోతుంది. దేవుడు మన హేతువాదాన్ని కాదనడు. హేతువు మనని తీసుకువెళ్ల గలిగినంతవరకూ ప్రయాణం చేస్తాము; అపైది భగవంతుని లీలగా మిగిలిపోతుంది. హేతువుకీ ప్రకృతికీ మధ్య క్రమానుగత సంబంధం ఉంది; కాని అది ('డివైన్ మైండ్'కే - దైవసములు) గాని తెలియదు. సైంటిస్ట్ తను సిద్ధాంతాలు సృష్టించడంలేదు; ప్రకృతిలోగల సిద్ధాంతాలు కనిపెడుతున్నాడు (డిస్కవరింగ్) - అంతే; అతను భగవంతుడు చూపే మార్గం వెంట నడుస్తున్నాడని మనం మరువకూడదు.

శూన్యతనుంచి పదార్థం పుద్భవించడమనేది అర్థంలేని విషయం కాబట్టి, భగవంతుని వునికిని మనం అంగీకరించి, భగవత్ స్వరూపంపట్ల విశ్వాసం కలిగించుకోవాలి. అది సామాన్యమైన సంగతికాదు - చాలా కష్టమైన విషయం. బుద్ధిజీవనులకి (ఇన్టెలెక్చ్యుయల్స్), నమ్మకం కలిగించుకోవడంకంటె, నమ్మకుండా వుండటం తేలిక. కాని దేవుని మీద నమ్మకం లేనప్పుడు ఈ ప్రపంచమంతా అర్ధరహితంగానూ ఉద్దేశరహితంగానూ కనిపించక తప్పదు కద! సామాన్యులకంటె అసామాన్యులకే యిది గొంతుక్కి అడ్డంపడే విషయం.

మొట్టమొదట నమ్మకం కలిగించుకోవాలి. పోను పోను ఈ నమ్మకం అవశ్యకమైనదిగా తోస్తుంది మన అనుభవాల వల్ల. తాత్కాలికావసరంగానూ, ఆత్మశాంతికనీ ప్రారంభించిన ఈ నమ్మకం, రానురాను ఒక వ్యక్తిగత బాంధవ్యంగా మారుతుంది. భగవంతునితో సంభాషిస్తాము; భగవంతునితో చెప్పుకుంటాము; మన కష్టాలు ఆయన వింటారు; ఆయన చల్లనిచూపు మనని కనిపెడుతుంది. ఇంక ఆపైన భగవంతుడు వివాదగ్రస్థమైన వ్యవహారం అవడు; మన మిత్రుడు, మన బంధువు, జీవితపు చీకటి కోణాలని వెలిగించే కాంతి రేఖ, ఆ వెలుగులో మన కన్నీళ్లన్నీ కరిగిపోతాయి.

'దేవుని చెలిమి' (డివైన్ కంపేనియన్‌షిప్) అంటే ఏమిటో తెలియని ఈతరంవారికి యిలాటివి చెప్పడం వొట్టి కంఠశోష. తామేదో గొప్ప తెలివిగలవారైనట్టు రకరకాల వాదాలు లేవ

దీస్తారు. సబ్జెక్టివిటీ, సైకలాజికల్ ఎక్స్ప్లనేషన్, ప్రొజెక్షన్, కండీషనింగ్, విష్ఫుల్ థింకింగ్ అని రకరకాలుగా మనని సవరించబోతారు. భగవద్దర్శన మనునది వ్యక్తిగతానుభవం. భగవంతునిమీద విశ్వాసంతో అనేకులు అపరిమితమైన కష్టాలు ఎదుర్కొ గలిగారు. ఆ నమ్మకం తమ జీవితాలని మార్చగలిగిందని వారు చెబుతున్నారు. ఎన్నో శతాబ్దులుగా పవిత్ర హృదయులనేకులు 'ఆయన మాకు తెలుసు' అంటున్నారు.

సామాన్యులు భగవంతుని రూపు రేఖలు తెలుసుకోవాలని బాధపడతారు; ఆయన చర్మచక్షువులకి అగుపడడనీ, మనో చక్షువుకి ఆయన తెలుసుననీ మళ్ళీ సమాధానపడతారు. సర్వ బంధాలకీ అతీతుడైన భగవంతునికీ, భవబంధాలకి లోనుగావలసిన వ్యక్తికీ సంబంధమేమిటని కొందరు ప్రశ్నిస్తారు. భగవంతుడొక మహా శక్తి అనీ, ఆ శక్తికి వ్యక్తులతో ఎట్టి ప్రమేయమూ లేదనీ కొందరి అభిప్రాయం.

ఆ విషయాలు పరిశీలిద్దాం. భగవంతునికీ మనకీ వ్యక్తిగత బాంధవ్యం ఉన్నదంటే, ఆయన మానవాకారుడా అను ప్రసక్తి రాదు. ఆయనని మనం, మనలోని చైతన్యంద్వారా తెలుసుకోగలుగుతున్నాము కాబట్టి, ఆయనని విశ్వ చైతన్యమూర్తి అనవచ్చు. రసాయన పరిణామాలతో కూడిన ఈ ప్రపంచంలో వ్యక్తి స్వభావం (పర్సనల్ కారక్టర్) అనునది ఎలా వుత్పన్నమవుతుందో భౌతికవాది విడమరిచి చెప్పలేడు. వ్యక్తిలోగల ఆ ప్రత్యేక ప్రతిభే ఈశ్వరాంశ - అదే భగవం

తుణ్ణి తెలిపే మార్గం. మనందరమూ ఆ మార్గం వెంట వెళ్లవలసినవాళ్లమే!

జంతుధర్మంకంటె (బైలాజికల్ ఫెనోమినా) చైతన్యం గొప్పదైనట్టే, పదార్థంకంటె ప్రాణం గొప్పది. అదేవిధంగా ప్రకృతి ధర్మాన్ని (ఎక్స్‌టర్నల్ ఎన్విరాన్మెంట్) చెప్పకోవడంకంటె, దానితో మనకిగల వ్యక్తిగత బాంధవ్యం (పెర్సనల్ వాల్యూ) తెలుసుకోవడం గొప్ప సంగతి కదా! ఏది మనం సాధించినా వ్యక్తిద్వారానే సాధించకలుగుతున్నాం. వ్యక్తిత్వాన్ని గౌరవించే కొందరు భగవంతుని ఆమోదించదు. వ్యక్తిత్వపోషణవల్లనే, మన జీవితం సువిశాలం అవుతోంది. పాస్కల్ అంటాడు: "ఈ ప్రపంచంలో నేనొకడిని; కాని 'నా'లో ఈ ప్రపంచమంతా వుంది కూడాను."

ఏమైనా, మానవులకి భగవంతుని పట్లగల విశ్వాసానికి మూలకారణం వారు ఆయనని దర్శించడంవల్ల, ఆయనతో సంభాషించడంవల్ల ఏర్పడినదికాదు. భగవంతుణ్ణి మనం తెలుసుకు, ఆయనని ప్రేమించగలిగితే, ఆయన మనని తెలుసుకోకపోరు, ప్రేమించకపోరు. లక్షలాది స్త్రీ పురుషులు తమకి భగవంతునితో గల బాంధవ్యం పరోక్షమైనదిగా గాక వ్యక్తిగతమైనదిగా పేర్కొంటారు. తమ కష్టనిష్ఠూరాలు ఆయనతో స్వయంగా చెప్పకుంటారు.

ప్రార్థనవల్ల భగవదాకారం తెలియదుగాని భగవత్ పరిచయమవుతుంది. ప్రార్థనతో ఆత్మశాంతి లభిస్తుందను విష

యం లోక విదితం. అర్ధరాత్రిఅయినా పట్టపగలైనా, ఎటువంటి వేళప్పుడైనాసరే, శిశువు తల్లిని నమ్ముకున్నట్లు, మనము ఆయనని నమ్ముకోవచ్చు. పర్వతాల ఠీవిలోనూ, నక్షత్రాల సౌందర్యంలోనూ, జీవాణువుల అద్భుత శక్తిలోనూగాక, మనవలె వుండి, మనలోని లోపాలులేని లోపరహితునిగా, కారుణ్యమూర్తిగా ఒకసారి మనకి కనిపించాడు భగవంతుడు. ఆ ప్రభువు తన విశిష్ట జీవితంలో చూపిన సత్యాల ద్వారా మానవుడెవరో, దేవుడెవరో తెలుసుకుంటున్నాము. ఆయన బోధనలేకాదు, ఆయన జీవించిన జీవితం అతి రమణీయమైనది.

భగవంతుని పట్ల భక్తి విశ్వాసాలతో జీవితం గడిపిన వ్యక్తులు, మానవాళికి మార్గదర్శకులవడం మనం గమనించవలసిన విషయం. భగవద్విశ్వాసం గల ఈ మహనీయులు సర్వప్రపంచంచేత పూజింపబడుతున్నారు. రాజకీయపు ఎల్లలూ, భాషాసంబంధమైన ప్రతిబంధకాలూ వారిఖ్యాతికి అడ్డురాలేకపోయాయి. వేగుచుక్కలవంటి ఆ మహాత్ములకు మానవలోకమెప్పుడూ చేయెత్తి నమస్కరిస్తుంది. బుద్ధుడు, కన్‌ఫూషియస్, మోజెస్, గాంధీజీ - ఈ మహాపురుషులద్వారా భగవంతుడు మనకి దర్శనమిచ్చాడు. వీరుగాక మరొకాయన ఉన్నాడు. ఆయనెవరో మీకుతెలుసు యేసుక్రీస్తు. ఆయన అన్వేషికాదు - సత్యస్వరూపం మనకి చెప్పడానికని ఈ భూమ్మీదకివచ్చాడు. ఆయన ఆ నాడుచెప్పిన బోధనలు ఈ నాటికేకాదు; ఎప్పటికీ కూడా నిలిచివుంటాయి. చారిత్రక

ఘట్టాలన్నీ ఆ కారుణ్యసింధువు జననంతో తెక్కించడ మనేది, మానవజాతిచేసిన మంచి పనులలో ఒకటి.

యేసుక్రీస్తు శిష్యులు సర్వసామాన్యులు. కాని వారికి తమ గురువుపట్ల అమితవిశ్వాసం ఉంది. ఆ శిష్యులలో ఒకడు యేసుక్రీస్తుని శత్రువులకిపట్టియిచ్చినా, శిష్య బృందంలోగల అమితవిశ్వాసమే, వారిని సింహాలకంటె బలవంతులుగాచేయ గలిగింది. ఏ విధమైన సాంఘికగౌరవంగానీ, రాజకీయబలం గానీ, అర్థికసంపదగానీ లేని ఈ శిష్యులూ, ప్రశిష్యులూ రోమన్‌ప్రభువుల ఆగ్రహానికీ, గ్రీకుల వేళాకోళానికీ గురి అయ్యారు; కాని, అంతిమ విజయం యేసుక్రీస్తుదే, ఏసు క్రీస్తు శిష్యులదే. ప్లాటో విద్యాసంస్థ కాలగర్భాన కలిసి పోయింది, రోమన్ మహాసామ్రాజ్యం కూలిపోయింది; కాని క్రీస్తు సందేశం నలుదెసలకీ పాకింది.

ఏసుక్రీస్తు ప్రేమస్వరూపుడు. అయనలో నాకు భగవం తుడు కనిపిస్తున్నాడు, ఏసుక్రీస్తు బోధనలప్రకారం జీవిం చేందుకు నేను ఎవరి అనుమతీ పుచ్చుకోనక్కర్లేదు. బాహ్యా డంబరాలేమీ నేను పాటించనక్కర్లేదు.

వ్యక్తిగతమైన మతభావన (ఇన్‌డివిడ్యూయల్ రెలిజియన్) వున్నంతమాత్రాన తృప్తికలగదు - ఎవరికి వారు తమ దారి వెంట తాము ప్రయాణం చేస్తామనడం మంచిపనికాదు. తలుపువేసుకుకూర్చుని, నేను ఉత్తమ క్రిస్టియనుని అని అనిపించుకోలేను - నేను నలుగురితో కలవాలి; నలుగురిపట్ల సద్భావంతోమెలిగి, మంచిపనులుచేయడం నేర్చుకోవాలి. ఈ

చర్చికి చెందినవాణ్ణా, ఆ చర్చికి చెందినవాణ్ణా - అనుప్రశ్న లేదు. భగవంతుణ్ణి నమ్మి సేవాధర్మం ఆమోదించినవారే క్రిస్టియనులు. ఏసుక్రీస్తుమీద లక్ష్యంవుంచి, అయన ప్రబోధాలప్రకారం నడుచుకోవడం మొదలుపెడితే, జీవితం తేజోమయమై, వ్యక్తి స్వభావానికి కొత్త మెరుగులువచ్చి, ఆ పైన సాంఘికవ్యవస్థ మారే అవకాశం ఏర్పడుతుంది.

రోమను సామ్రాజ్యం రాజకీయంగానూ నైతికంగానూ పతనావస్థలో ఉన్నప్పుడు, ఆగస్టయిన్ వంటి క్రిస్టియనులు మానవులకి వెలుగుబాట చూపగలిగారు. వారు తమ ప్రయత్నంలో పూర్తిగా కృతకృత్యులు కాలేకపోయిన మాటనిజమే. కాని రాజకీయ సాంఘికపరిస్తితులు వారి తేజోకిరణాలవల్ల పునీతమయాయి. ఏ నాటికైనా 'యుద్ధంలేని ప్రపంచం' (వార్‌లెస్ వరల్డ్) వుద్భవమందితే, అది క్రిస్టియనుల కోరికలలో ఒకటి అని సగర్వంగా చెప్పుకోవచ్చు.

క్రిస్టియన్ మతబోధకులు ప్రారంభశతాబ్దాలలో విశ్వజనీన దృష్టి అలవరుచుకొని చరిత్రకి ఎంతో మేలుచేశారు. యేసుక్రీస్తు 'ఈ మందలోవే గాక అన్నిగొర్రెలూ తనవే' అన్నాడు. ("అదర్ షీఫ్ హావ్ ఐ వుచ్ ఆర్ నాట్ ఆఫ్ దిస్ ఫోల్డ్"). ఈ సుభాషితాన్ని ఆయన అనుచరులు శ్రద్ధాభక్తులతో పాటించారు. సమస్త ప్రపంచాన్నీ ప్రేమజ్యోతితో వెలిగించనున్న వెలుగు (లైట్) యేసుక్రీస్తుప్రభువుద్వారా సాక్షాత్కారమయింది. క్రీస్తుద్వారా భగవంతుడు తనమార్గాన్ని ('వే') మనకి చూపించాడు. అన్నిదేశాలలోవారూ అన్నికాలా

ల్లోనూ ఆవలంబించదగు మార్గమిది. యేసుక్రీస్తు భగవం తుడు కాదు - భగవంతుని కుమారుడు. తన కుమారుని ద్వారా భగవంతుడు తన్నుగురించి మనకి తెలియజేశాడు. యేసుక్రీస్తుకి పూర్వం ఈ వెలుగు (లైట్) ఎవరికీ కనపడ లేదా అని అడుగుతున్నారా? కనిపించకేం, కనిపించింది. జెరిమయ్‌కి కనిపించింది, సోక్రటీస్‌కి కనిపించింది - యిలా వందలాది మహానుభావులకి కనిసించింది. ఎటొచ్చీ, యేసుక్రీస్తు ద్వారా వ్యక్తమైన వెలుగు, అనేక కారణాలుగా మనందరి హృదయాలలోనూ మసులుతూ నేఉంది.

బాధితులకి బాధవల్లజరిగే అపాయంకంటె, బాధాకార ణంగా ఏర్పడ్డ హృదయకాఠిన్యత (బిట్టర్‌నెస్)వల్ల ఎక్కువ అపాయం జరుగుతుంది. తమకేదో అన్యాయం జరుగుతున్న ట్లుగా వారు భావిస్తారు. క్రిస్టియన్ విశ్వాసం ఆ కాఠిన్యాన్ని కరిగించి, మనసుని తేలికపరచగలుగుతుంది. ప్రపంచం లోని చెడుపును యావత్తూ క్రిస్టియానిటీ రూపమాపలేదు - ఎటొచ్చీ, అది కొంత వెలుగునిమాత్రం ప్రసాదించగలుగు తుంది. తాము యేకాకులవలె బాధపడటంలేదనీ, తమని తమ బాధలలో భగవంతు డనువాడొకడు కనిపెడుతున్నా డనీ అనుకోవడం బాధితులకి ఎంత శాంతినిస్తుందో ఆలోచిం చండి. బాధలకి జవాబు చెప్పగలిగినది మత విశ్వాస మొక్కటే!

ఏసుక్రీస్తు యిచ్చిన శాంతి, కలతలనుండి కాపాడే స్వాతంత్ర్యంకాదు; కలతల మధ్యకూడా చెడని శాంతి, సుశి

క్షణకు ఫలితమనదగు ఆత్మశాంతి. శాంతి అనునది వర ప్రసాదంగా లభించదు. ఈ సందర్భంలో ప్రభువు మాటలు జ్ఞప్తికి తెచ్చుకోవడం యుక్తము. "నా కాడిమాను మీమీద వేసుకు నన్నుగురించి తెలుసుకోండి...అప్పుడు మీ ఆత్మలకి శాంతి లభిస్తుంది." ఆ కాడిమానును (యోక్) మనమీద వేసుకోకుండా శాంతిని కాంక్షిస్తాము - ఎంత వెర్రివాళ్లం మనం ! !

అన్నిటికీమించి, విశ్వాసమనునది ఆనందాన్ని యిస్తుంది. ఓమర్‌ఖయామ్ గేయాలూ, ఎపిక్యూరస్ పదాలూ ఆలకిస్తూ వారి తత్వంలో నిమగ్నులమైనప్పుడు, ఆ గానసౌరభంనుంచి ఏదో విషాదచ్ఛాయ తొంగిచూస్తూన్నట్టు వుంటుంది. ఏసు క్రీస్తు కీర్తనలు అటువంటివి కాదు - అవి సంతోషభరితములు. ఆనందామృతం వాటిలో తొణికిసలాడుతుంది. రెండెల్ హారిస్ అను పండితుడు, "భగవంతుని మనుష్యులకు ఆనం దమే బలము - అదే వారి కీర్తిని యినుమడింపజేసే ప్రత్యేక సంపద," అని అంటాడు. విశ్వాసంనుంచి విచార మెన్నటికీ జనించదు. అర్ధరాత్రివేళ చెరసాలల్లో ఏసు ప్రభువు మహి మల గురించి, సెయింట్స్ పాల్, సైలాస్ మొదలుకొని నిన్న మొన్నటి నాజీకాన్‌సెన్‌ట్రేషను కాంపులలోని ఖైదీలవరకూ పాడుతూ వచ్చారు. అంధకార బంధురమైన జీవితాలకి ఆయనే వెలుగు. ఆయన గురించి పాడుకుంటూనే కోటాను కోట్ల ప్రజలు శాంతి సౌఖ్యాలు పొందగలిగారు.

లండన్ జైలులో 28 వ ఏట చనిపోయిన ఎడ్వర్డ్ బరో, 1662 లో ఈ విధంగా వ్రాశాడు :

"భగవత్ స్వరూపం, ఆత్మస్వరూపంగా మాలో ప్రవేశించి, హృదయంలో చిందులాడి, నాలుకలమీద నృత్యంచేసి, మాటలై నోటివెంట వెలువడింది. తన సంతానాన్ని ఆ పరమ ప్రభువే శతవిధాల కాపాడుతున్నాడు."

గొప్ప మతాలన్నిటిలోనూ సత్యస్వరూపం చక్కగా వివరింపబడింది. కాని క్రిస్టియానిటీ సంతోషాన్ని ఒకసుగుణంగా చేస్తూ సహనశీలత నేర్పింది. క్రిస్టియన్ అయినవాడు ప్రజలందరూ సన్మార్గులనీ, దుర్మార్గమనేది ఈ ప్రపంచంలో లేదనీ అనడు. అన్నీ మంచిగా పరిణమించవు; భగవంతుడు ప్రేమించినపే మంచివవుతాయి.

మనం అనేక బాధలుపడాలి, అనేక కష్టాలకి గురికావాలి- అదంతా అన్యాయమే; కాని, యిది మన ప్రపంచం కాదు, భగవంతుని ప్రపంచం. ఆయన యిష్టం ఎలాఉందో అలా జరుగుతుంది. సుఖపడమని మాత్రమే ఆయన మనలని సృష్టించలేదు. భగవంతుడు మనతోవుండి, మనద్వారా తన కార్యాలు నెరవేర్చుకుంటున్నాడు. మనకంటె ఆయన మనలను ఎక్కువగా అన్వేషిస్తున్నారు.

భగవంతునిమీద నమ్మకం వుంచి, జీవన ధర్మం నిర్వర్తించేవారిని, వారివారి జీవితాలలో గల స్వల్ప సమస్యలు అట్టే వేధించవు. అయన సృష్టిలో మానవుడు 'నలుసు' కంటె చిన్నవాడు. తన స్వల్పత్వం గ్రహించడం వల్లనే మానవుడు ఉన్నతుడై భగవంతుని దిక్కుగా చూడ గలుగుతున్నాడు.

యేసుక్రీస్తు విప్లవాత్మకమైన ప్రేమ సిద్ధాంతాన్ని (రివల్యూషనరీ లవ్) ప్రబోధించాడు. ఆ ప్రేమ సూత్రాన్ని పాటించే మహాత్ముల హృదయంలో విద్వేషాగ్ని మచ్చుకి కూడా ఉండదు. దుర్బలులను కాపాడేందుకు ద్వేషం జయించమంటా డాయన. ద్వేషం జయించామంటే ఆయుధాలతో అంతగా పనివుండదు.

భగవత్ స్వరూపం తెలుసుకునేందుకు ప్రేమ అనునది ఒక ప్రధానమైన నైతిక విలువ. తత్వశాస్త్రానికీ (ఫిలాసఫీ) నీతిశాస్త్రానికీ (ఎతిక్స్) భిన్నంగా ఉంటుంది మతం. సుఖ జీవనాన్వేషణ మతమనిపించుకోదు. భగవంతునికీ వ్యక్తికీ గల బాంధవ్యమే మతము. అది భగవంతుని గురించిన వాదోపవాదం కాదు - ఆయన ప్రేమకు సమాధానం. ప్రతి వ్యక్తీ తనలోని ఈశ్వరాంశవల్ల ఆయనను తెలుసుకోగలడు; ఆయనకూడా ప్రతి వ్యక్తిని అదేవిధంగా కనిపెడుతున్నాడు.

ఒక్కసారి భగవంతునిమీద గురి యేర్పడిందా, మృత్యువుతో సమస్తమూ అంతం కాదనువిషయంమీద నమ్మకం కలుగుతుంది. ఆ పైన, మృత్యుముఖంలో కూడా భగవంతుని ప్రేమను విశ్వసించి, గుండె ధైర్యంతో ఉండగలుగుతాము. ఇది భగవంతుని ప్రపంచమైనప్పుడు, సజీవుల్నీ విగతజీవుల్నీ అందరినీ కాపాడేది ఆ కరుణామూర్తే కదా! మానవులు భగవంతుని మార్గాలు తెలుసుకోలేరు; ఆయన చూపిన వెలుగుద్వారా నడవటమే వీరు చేయగలపని. భగ

వంతునిసృష్టి అంతటిలోకీ అపూర్వమైనది వ్యక్తిత్వనిర్మాణం (పర్సనాలిటి). వ్యక్తికి దేవుడు దారి చూబుతున్నాడు.

మరణానంతరం మనందరం యేమయేదీ మానవులకి తెలియదు - తెలుసుకోలేరుకూడాను. మనని ఒంటరితనం లోనూ విచారంలోనూ కాపాడే జగదీశ్వరుడు ఒకడు వున్నాడని తెలుసుకుంటే చాలు. కవితా సౌందర్యం జంతువులకి అర్థంకానట్టే, అమరపురి వైభవం మానవులకి అర్థం కాదు. ఎందుకర్థంకాదని వాపోయి లాభం లేదు - అయన ప్రేమని తెలుసుకుంటే చాలు.

జీవితమొక ప్రయాణం. ముందువెనకలు చూసుకుంటూ పదిలంగా ప్రయాణం చేయమని వాస్తవికత చెబుతోంది. మనం బాటవెంట నడుస్తున్నప్పుడు అనేక పక్కదారులు కనిపిస్తాయి. ఒక్కొక్కప్పుడు యేది రాజబాటో, యేది దొంగబాటో తెలుసుకోలేని అవస్థలోపడతాం. కొన్ని బాటలు మధ్యలో ఆగిపోతాయి. సరి అయిన బాట తెలుసుకు నడక సాగించవలసిన బాటసారులం మనమందరమూ. మన కంటె ముందు వెళ్లినవారు, మనకోసమని కొన్ని గుర్తులు వొదిలిపెడుతూంటారు. ఒక్కొక్కప్పుడు మనం కంటకావృతమైన బాటలోకి వచ్చి, మళ్ళీ వెనక్కి వెళ్ళి రాజబాట చేరుకోవలసి వస్తూంటుంది.

ఫలానాది రాజబాట అని చెప్పగల గుర్తు (సంకేతం) మనకి కావాలి. అది ఫలానా అని తెలుసుకున్నంత

మాత్రాన అన్వేషణ పూర్తిగాదు. ఎవరికి వారు ఎప్పటి కప్పుడు దారి వెతుక్కుంటూ ముందుకి సాగవలసిందే! మిథ్యలో పడకుండా వుండేందుకు నిరంతరం మనని మనం ప్రశ్నించుకుంటూ వుండాలి. మానవమాత్రులమవడంవల్ల మనం తప్పులు చేయవచ్చు, పొరబాట్లు చేయవచ్చు; కాని భగవంతుని మీద విశ్వాసం వుంచి, ఆ చిరు వెలుతురుతో కాంతివంతమయే బాట వెతుక్కుంటూ, ముందుకి నడవటమే మన కర్తవ్యం. విశ్వాసమే మన ప్రాణాధారం.

---